డిసెంబరు 2013

రూ. 12/-

# విపుల

విశ్వకథా వేదిక

* తొలి ఆధునిక తమిళ కథ గుంటకట్ట రాగిమాను చెప్పిన కథ ... 6
* ఇటీవలి నోబెల్ గ్రహీత




విపుల 36వ వసంతంలో కాలుమోపిన సందర్భంగా 'ముప్పైఅయిదేళ్లనాటి విపుల కథల్ని' నేటితరం పాఠకలోకానికి అందిస్తున్నాం. అనువాద కథల్ని మాత్రమే ఈ శీర్షిక కింద పునర్ముద్రిస్తున్నాం. దీనికోసం సుప్రసిద్ధ రచయితలు, కథకులు విపుల ఆవిర్భావం నుంచి ఒక్కో సంచికను కూలంకషంగా చదివి ఒక్కో కథను ఎంపిక చేశారు. ఇందులో భాగంగా 1978 డిసెంబరు విపుల నుంచి తోలేటి జగన్మోహనరావు గారు ఎంపిక చేసిన ఇమ్రెషర్కడి హంగేరి కథ మీకోసం!

ఈనెల 2 న పుట్టినరోజు జరుపుకుంటున్న తోలేటి జగన్మోహనరావు గారికి జన్మదిన శుభాకాంక్షలు!

# బలిపశువు

గ్రామసమితి ప్రెసిడెంటు ఇమ్రెబర్టా ఆరోజు మోటారు సైకిల్ మీద తన పొలానికి వెళ్ళి తిరిగొస్తున్నాడు. సరిగ్గా మార్కెట్టు దగ్గరికొచ్చేసరికి ఇద్దరు కుర్రాళ్ళు ఒకళ్ళ నొకళ్ళు తరుముకుంటూ రోడ్డు మధ్య కొచ్చేశారు. ఆయన వెంటనే మోటారు సైకిల్ వేగాన్ని తగ్గించి గట్టిగా హారన్ వత్తాడు. ఆ హారన్ మోత వినగానే కుర్రాళ్ళు క్షణకాలం పాటు స్తంభించిపోయి ఎక్కడివారక్కడ నిలబడిపోయారు. ఆ తరువాత చట్టున తేరుకుని ఒకడు కుడివైపూ, మరొకడు ఎడంవైపూ పరుగెత్తారు. ఎడంవైపునకు పరుగెత్తిన కుర్రాడు ఆగి ఎందుకో మళ్ళీ రోడ్డు మధ్య కొచ్చాడు. వచ్చి కోడిపిల్లలాగ మోటారుసైకిల్ కింద పడ్డాడు. ప్రెసిడెంటు బ్రేకును బలంగా నొక్కాడు. సడన్ బ్రేకుతో కీచుమంటూ ఆగిన మోటారు సైకిలు కుర్రాడి పక్కనే బోల్తా పడింది.

కుర్రాణ్ని తిట్టుకుంటూ నెమ్మదిగా పైకి లేచాడు ప్రెసిడెంటు. ఆయన మొహం కోపంతో ధుమధుమలాడుతోంది. ఆయనకు దెబ్బలు బాగా తగిలాయి. కంకర రోడ్డుమీద పడటం మూలాన మొహం ఒకవైపంతా కొట్టుకుపోయింది. మోకాలికి పెద్ద గాయమైంది. మొహం మీదంతా రక్తంతో తడిసిన ఇసుక అతుక్కుంది. ప్రెసిడెంటుకు కాళ్ళూచేతులూ వొణకసాగాయి. ఇదంతా ఒక్కక్షణంలో జరిగిపోయింది.

ఆ తరువాత ప్రెసిడెంటు ఒళ్ళు దులుపుకుని లేచి కుర్రాడికి దగ్గరగా వెళ్ళాడు.

వాడిని తన చేతుల్లోకి తీసుకునేసరికి వాళ్ళ చుట్టూ ఓ పదిమంది పల్లీయులు పోగయ్యారు. అయితే ఎవరూ నోరైనా విప్పలేదు.

ఇంతసేపూ కొయ్యబారిపోయినట్టు కళ్ళు తేలేసి చూస్తున్న కుర్రాడు తనని ఎవరో ఎత్తుకున్నారని తెలియగానే పెద్దగా ఏడవడం మొదలెట్టాడు. ఆ కుర్రాడు లాస్లోమదార్ కొడుకన్న సంగతి ప్రెసిడెంటుకు తెలుసు. ఎర్రగా ఉండే కుర్రాడి

మొహం ఇప్పుడు భయంతోనూ, కంగారు తోనూ నల్లబడిపోయింది. ఆ కుర్రాడిని తన చేతుల్లోంచి కిందికి దించి చుట్టూ మూగిన జనం సాయంతో వాడిని నిటారుగా నిలబెట్టేందుకు ప్రయత్నించాడు ప్రెసిడెంటు. కానీ ఆ కుర్రాడు కెవ్వుమని అరిచి అలాగే నేలమీద కూలబడిపోయాడు.

జనం ఇంకా పోగవుతూనే ఉన్నారు. దగ్గరలోనే మార్కెట్టు ఉండడంతో- సరుకులు అమ్మేవాళ్లూ, కొనుక్కునేందుకు వచ్చినవాళ్ళూ, బలాదూరు తిరిగే బద్ధకస్తులూ- అందరూ అక్కడ చేరారు.

గుంపుగా గుమిగూడిన జనం మధ్య ప్రెసిడెంటు ఆ కుర్రాడిని చేతుల మీద ఎత్తుకొని నిలబడ్డాడు. వాడిని సముదాయించి, నేలమీద నిలబెట్టాలని ఆయన ఎంతగానో ప్రయత్నిస్తున్నాడు. అంతలో ఆ కుర్రాడి తల్లి గాలి దుమారంలా అక్కడికి దూసుకొచ్చింది. నేరుగా ప్రెసిడెంటు దగ్గరికెళ్ళి ఆయన చేతుల్లోంచి కుర్రాడిని లాక్కుని ఒక్కమాట కూడా మాట్లాడకుండా వచ్చిన దోవనే వెళ్ళిపోయింది. కొడుకుని తీసుకుని తిన్నగా డాక్టరు దగ్గరికి వెళ్ళింది. మిగతా జనమంతా ఇంకా అక్కడే ఉన్నారు. ప్రెసిడెంటు తన మోటారుసైకిలును పైకెత్తి దానికేమన్నా అయిందేమోనని పరీక్షించసాగాడు. జనమంతా ఆయన వైపే చూస్తూ నిలబడిపోయారు.

"ఇక బుర్రుమని వెళ్లిపోతాడు కామోసు!" గుంపులోంచి ఎవరో అన్నారు.

"అవును మరి... మనుషులకి మల్లే మోటారుసైకిలు కేమన్నా దెబ్బలు తగుల్తాయా ఏమిటి? " ఇంకొకరన్నారు.

"మనిషి ఒక మోటారుకు సేవలు చేయాల్సిన కాలం వచ్చింది.." అన్నాడు అదే దారిన పోతున్న ఓ తత్త్వజ్ఞాని.

"నేనిప్పుడే చెబుతున్నా.. కావాలంటే రాసిపెట్టుకోండి.. చివరికి ఆ కుర్రాడివైపు వాళ్ళే ఫైన్ కట్టాల్సి వస్తుంది" అని ఇంకెవరో అన్నారు.

"తప్పకుండానూ.. మరి వాడు ఇంత ఖరీదైన మోటారుసైకిల్‌ను పాడు చేయలేదూ..? " అని వంత పాడారెవరో.

అంతవరకూ ప్రెసిడెంటు అసలు జనం వైపు చూడనేలేదు. నిలుచున్న చోటినుంచి ఒక్క అంగుళం కూడా కదలకుండా ఎవరికి తోచిన మాట వారు అంటూ, తన వైపే చూస్తున్న ఆ జనం వైపు ఆయనిప్పుడు తలెత్తి చూడక తప్పలేదు. 'సర్కసులో వేలాదిమంది ప్రేక్షకుల మధ్య నిలబడి తను చేయవలసిన ఫీట్సును మరిచిపోయిన మనిషిలా వుంది తన స్థితి' అనిపించింది ఆయనకు.

మోటారుసైకిల్ ఎంతకీ స్టార్టు కాకపోవడంవల్ల ఆయనకు ఏంచేయాలో తోచలేదు. చివరికి తన చుట్టూ నిలబడిన జనంవైపు ఓసారి తిరిగి అన్నాడు "ఆ పిల్లలు సడన్‌గా రోడ్డు మధ్యలో కొచ్చేశారు. నేను.. నేను.." ఇక ఆ తర్వాత మాట్లాడలేక జేబులోంచి రుమాలు తీసి మొహం తుడుచుకున్నాడు- ఇందులో తన తప్పేమీలేదని సూచిస్తున్నట్టుగా..

"రోడ్డుమీద కాక ఇంకెక్కడ పరుగెత్తాలట వాళ్ళు? "

"ఆడుకునే పిల్లల్ని ఇంట్లో మగ్గబెట్టాలేమిటి? "

"పిల్లలు పరుగెత్తకుండా, ఆడుకోకుండా వుంటే, వాళ్ళు పెరిగేదెలా మరి? "

"మోటారుసైకిలు మీద వెళ్ళే పెద్దమనుషులు ఒళ్ళు దగ్గరపెట్టుకొని నడపాలి గానీ, పసి పిల్లలకేం తెలుస్తుంది? "

ప్రెసిడెంటు చుట్టూ నిలుచున్న జనం ఇలా తలా ఒకమాట విసిరేస్తున్నారు.

వాళ్ళందరి సూటి పోటి మాటలకు ఆయన జవాబు చెప్పబోతుండగానే ఆ కుర్రాడి తల్లి మళ్ళీ అక్కడికి వచ్చింది. ఆమె ఇప్పుడు చాలా శాంతంగా ఉంది.

కానీ మొహంలో మాత్రం ఏదో దృఢని శ్చయం గూడు కట్టుకొన్నట్లు కనిపిం చింది. ఆమె సూటిగా వచ్చి ప్రెసిడెంటు ముందు నిలబడింది.

"ప్రెసిడెంటుగారూ! పిల్లాడి కాళ్ళు రెండూ విరిగాయి. దానికి బాధ్యులెవరం టారు? " అని ప్రశ్నించింది.

"అలాగా" అన్నాడు ప్రెసిడెంటు.

ఎర్రటి ఆయన మొహం ఇప్పుడు నల్లబా రిపోయింది. మోటారుసైకిల్ మీద నుంచి కింద పడ్డప్పుడు ఆయన మొహాని కంటిన దుమ్ముకన్నా నల్లబారిపోయింది. ఆ కుర్రా డి పట్ల ఎంతో జాలి కలిగింది ఆయనకు.

చుట్టూ ఓసారి కలయచూశాడు. అక్కడ నిల్చున్న వారంతా తననే తేరిపార చూస్తు న్నారు. మరీ దగ్గరగా నిల్చున్న వాళ్ళు ఏమీ మాట్లాడడంలేదు. కదలకుండా, మెదలకుండా అలాగే నిలబడి చూస్తు

## అనువాదం : శ్రీకంఠమూర్తి

న్నారు. కాస్త దూరంగా వున్నవారు మా త్రం ఏదో గుసగుస లాడుకుంటున్నారు.

'వీళ్ళంతా తప్పు తనదే అంటారిప్పుడు. అవసరమైతే ప్రమాణం చేసి సాక్ష్యం ఇవ్వ డానికి కూడా సిద్ధమే!' అనుకున్నాడు మన సులో ప్రెసిడెంటు.

ఓసారి కలయచూశాడు ప్రెసిడెంటు.

"ప్రమాదం జరిగినప్పుడు మీలో ఎవ రైనా చూశారా? " అని అడిగాడు జనాన్ను ద్దేశించి.

ఎవరూ మాట్లాడలేదు. తను మోటారు సైకిల్ మీద వస్తుంటే సడన్‌గా ఆ కుర్రాళ్లు రోడ్డు మీదికి పరుగెత్తుకురావడం, తను వెంటనే స్పీడు తగ్గించి బ్రేకు వేయడం, ఆ ప్రయత్నంలో తాను కూడా కింద పడడం.. వగైరా విషయాలన్నీ ఆయన వాళ్ళకు వివరించి చెబుతూండ గానే- ఒక పెళసరి గొంతు ఆయన మాట లకు అడ్డు తగిలింది.

"నిజమే, ఇంకాసేపట్లో తప్పెవరిదో తేలి పోతుంది. అబ్బాయి తల్లిదండ్రులే నష్టపరి హారం ఇచ్చుకుంటారులెండి. వాళ్ళబ్బాయి మీ మోటారుసైకిల్ కింద పడ్డందుకు ఇచ్చుకుంటార్లెండి.."

యాభై, అరవై జతల కళ్ళు దుమ్ముతో నిండిన రోడ్డువైపే చూస్తున్నాయి. 'ప్రెసి డెంటుగారిదే తప్పు' అన్న భావం ఆ కళ్ళల్లో స్పష్టంగా కనిపిస్తోంది.

మరి కాస్సేపటికి పోలీసు ఉన్నతాధికారే స్వయంగా వచ్చి, కేసు విచారణ ప్రారం భించాడు. ఇలాంటి విషయాల్లో బాగా ఆరితేరిన ఆ పోలీసు అధికారి ప్రెసిడెంటు మీద ప్రశ్నల వర్షం కురిపించేశాడు. "హారన్ మోగించినప్పుడు ఆ పిల్లలు మోటారు సైకిలుకు ఎంత దూరంలో ఉన్నారు? అప్పుడు మీరు ఎన్నిమైళ్ళ స్పీడుతో నడుపుతున్నారు? అంత స్పీడునీ వెంటనే ఎలా తగ్గించగలిగారు? ఆ కుర్రాడు అటు వెళ్ళిన వాడు కాస్తా మళ్ళీ రోడ్డు మధ్యకు పరుగెత్తుకు రాగానే సడన్ బ్రేకు వేశానని చెబుతున్నారు. ఓకే. అప్పుడు మీరూ కింద పడ్డారు కదూ? ఆ విషయం మీ ముఖమే చెబుతోందిలెండి. ఏదైనా బలమైన కారణం లేనిదే మీరలా బ్రేకు వేసి.. బండిని ఆపే మనిషికారు.. అవునా? "

ఆ పోలీసు అధికారి అంటే ప్రెసిడెం టుకు మొదట్నుండీ గిట్టదు. అలాంటి ప్పుడు తనకు అనుకూలంగా న్యాయబద్ధ మైన ప్రశ్నలు అడుగుతున్నాడంటే దీని అంతరార్థం ఏదో ఉండే వుంటుంది -అని పించింది ప్రెసిడెంటుకు. గ్రామసమితి మీటింగుల్లో ఈ పోలీసు అధికారి ఎప్పుడూ ప్రెసిడెంటుకు విరుద్ధంగానే వాదించేవాడు. ఒక్కోసారి వ్యక్తిగతమైన

# ముక్కుసూటితనానికి ముప్పుతిప్పలు!



'విపుల' 1978 డిసెంబరు సంచికలో ప్రచురించిన హంగేరీ కథ 'బలిపశువు' ముక్కుకు సూటిగా పోయే ఒక అధికారి మీద ప్రజలందరూ ఎందుకు కక్ష కట్టారో చెబుతుంది. ఈ సంచికలో ప్రచురించిన కథలన్నింటిలోనూ నాకు నచ్చిన కథ ఇది.

నిప్పులాంటి అధికారులూ తప్పుడు వ్యక్తుల ముందు ఎందుకు తలవంచవలసి వస్తుంది?

ప్రభుత్వంలో అందరూ అవినీతిపరులే ఉండరు. కొందరు మంచివారు, నిజాయితీపరులూ ఉంటారు. నిజాయితీగల అధికారులు కూడా ఎందుకు నిజాయితీగా ఉండలేకపోతున్నారు? న్యాయధర్మాల తరపున ఎందుకు గట్టిగా నిలబడలేకపోతున్నారు? కళ్ల ఎదురుగా ఏ అన్యాయం జరిగినా మౌనం వహించే పరిస్థితి ఎందుకు ఉంది?

నిజాయితీగలవారు, విధి నిర్వహణలో కొంచెం కరుగ్గా వ్యవహరించాల్సి వస్తుంది. దాంతో వారు అందరికీ శత్రులవుతారు. ఏ వ్యక్తీ పొరపాటూ చెయ్యకుండా ఉండలేడు. ఏదో ఒక సందర్భంలో ఏదో ఒక తప్పు జరుగుతుంది. ఏదో ఒక చిక్కులో పడతాడు. అటువంటి సమయంలో అవినీతిపరులందరూ దయ్యాల్లా, రాబందుల్లా మీద పడతారు.

ప్రెసిడెంటు మోటారు సైకిల్ కింద పడి కాళ్ళు విరిగిన కుర్రాడు బాగుపడి సంతోషంగా గంతులు వేస్తూ ఉంటాడు. ప్రజల గురించి, దేశ శ్రేయస్సు గురించీ, తన ప్రవర్తనలో, కార్య నిర్వహణలో దీక్ష, శ్రద్ధ చూపించిన ప్రెసిడెంటు, చేయని నేరానికి పదవి పోగొట్టుకుంటాడు. అవినీతి వాతావరణంలో ఒక వ్యక్తి నిజాయితీగా తన విద్యుక్త ధర్మం నిర్వహించడం ఎంత కష్టమో వివరిస్తుంది 'బలిపశువు'

**– *తోలేటి జగన్మోహనరావు,***
సీనియర్ కథారచయిత

## అభ్యుదయవాది

అరవై కథల వరకు రాసిన తోలేటి జగన్మోహనరావుగారి మీద రావిశాస్త్రి, ముళ్లపూడి వంటి సుప్రసిద్ధులతో పాటు పాశ్చాత్య రచయిత పి.జి. వుడ్ హౌస్ ప్రభావం అధికంగా కనిపిస్తుంది. తోలేటి జగన్మోహనరావు కథలు, లక్ష్మీ కటాక్షం, తోలేటి కథలు - అని ఇప్పటికి మూడు కథాసంపుటాలు వెలువరించారు. 'రెండో ప్రపంచ యుద్ధంలో రష్యా', 'మేం మళ్లీ వస్తాం' అనే పుస్తకాలు వామపక్ష భావాలున్న వారిని విశేషంగా ఆకర్షించాయి.

పశ్చిమగోదావరి జిల్లా పాలకొల్లులో విద్యాభ్యాసం చేసిన జగన్మోహనరావు 1963 నుంచి 1971 వరకు హైదరాబాద్‌లో అక్కౌంట్ జనరల్ ఆఫీసులో స్టెనోగ్రాఫర్‌గా వ్యవహరించారు. 1971 నుంచి 2005 వరకు న్యూఢిల్లీలో సెంట్రల్ సెక్రటేరియట్లో, మినిస్ట్రీ ఆఫ్ హెల్త్, పవర్‌లోనూ పనిచేశారు. పదవీ విరమణ అనంతరం హైదరాబాద్‌లో స్థిరపడ్డారు.

నిందారోపణ కూడా చేసేవాడు. అలాంటి వాడి చేతుల్లో ఇప్పుడు తను చిక్కుకున్నాడు. అతనిప్పుడు ఏం చేసినా చెయ్యొచ్చు. మోటారు సైకిల్‌ను స్వాధీనం చేసుకున్నా చేసుకోవచ్చు. లేకపోతే తనకే ఏదైనా శిక్ష వేసినా వెయ్యొచ్చు- అనిపించింది ప్రెసిడెంటుకు. శిక్ష అన్న ఆలోచన రాగానే ఆయన మొహం తెల్లగా పాలిపోయింది.

"అయితే మీ అభిప్రాయం ఏమిటంటారు? తప్పు నాదేనంటారా? " అని అడిగాడు ప్రెసిడెంటు.

"ఇందులో మీ తప్పేమీ లేదనే అనిపిస్తోంది నాకు" అన్నాడు పోలీసు అధికారి- ప్రెసిడెంటును సూటిగా చూస్తూ.

"హమ్మయ్య.. ఇప్పుడు నాకెంతో తృప్తిగా ఉంది. అందరూ నాదే తప్పంటున్నారు. నేను కూడా అలాగే అనుకోవాల్సొ

చ్చేది..." అని తేలిగ్గా ఒక నిట్టూర్పు విడి చాడు ప్రెసిడెంటు.

ఇద్దరూ కరచాలనం చేసుకున్నారు. తరువాత ప్రెసిడెంటు తన ఆఫీసుకు వెళ్ళి పోయాడు. అక్కడ ఆయన కోసం పది మంది దాకా కాచుక్కూచున్నారు. వాళ్ళలో యానోష్ బీజ్ కూడా ఉన్నాడు. అతను పన్ను బకాయీ విషయం గురించి ఆఫీసు కొచ్చాడు.

"చూడండి యానోష్‌గారూ.. ప్రభుత్వ విధానాలు మారినంత మాత్రాన మీరు పన్ను కట్టకుండా ఎగ్గొట్టొచ్చని అర్థం కాదు. అలా అనుకోవడం సబబు కాదు. మీరిలా ఆలస్యం చేస్తూంటే చివరికి కోర్టు అమీనాను పంపించి వసూలు చేయవలసి రావచ్చు. వ్యవహారం అంతదాకా రానీయ రనే ఆశిస్తున్నాను" అన్నాడు ప్రెసిడెంటు.

ఈ మాటలు అని ఆయన యానోష్ బీజ్ మొహంలోకి చూడగానే ఏదో చటుక్కున గుర్తొకొచ్చింది.

ప్రమాదం జరిగినప్పుడు ఇతను కూడా అక్కడున్నాడు. చుట్టూ మూగిన జనంలో వెనక్కి నిలబడ్డాడు. అప్పుడు ఇతను కూడా తన మీద ఓమాట విసిరే ఉండొచ్చు.

ప్రెసిడెంటు కనుబొమలు ముడివడ్డాయి. తనిప్పుడు ఈ పన్నులు ఎగ్గొట్టే దగాకోర్ల దయాదాక్షిణ్యాల మీద ఆధారపడవలసి వచ్చిందన్నమాట!

చప్పున ఆయన తన ధోరణి మార్చుకున్నాడు. చాలా నెమ్మదిగా మృదువుగా.. "చూడండి యానోష్‌గారూ! మేము ఏదో ఒకటి చేస్తాం.. కానీ ప్రభుత్వానికి కూడా డబ్బు అవసరమన్న సంగతి మీరు అర్థం చేసుకుంటే మంచిది. పరిస్థితి చాలా ఇబ్బందికరంగా వుందని నాకూ తెలుసు.." అన్నాడు ప్రెసిడెంటు.

ప్రెసిడెంటుగా రీరోజు చాలా శాంతంగా ఉన్నారన్న సంగతి ఆఫీసు బయటంతా అతిత్వరగా వ్యాపించి పోయింది.

★ ★ ★

సాయంకాలం పోలీసు అధికారి వచ్చాడు. తన బ్రీఫ్‌కేసులోంచి ఒక కట్ట కాగితాలు బయటికి తీసి- "ఇదిగో చూడండి! వాళ్ళంతా మీకు విరుద్ధంగా సాక్ష్యమిచ్చారు.." అన్నాడు.

"అంటే..? " అన్నాడు ప్రెసిడెంటు కంగారుగా.

"ఇవి చూడండి.." అంటూ పోలీసు అధికారి ఒక్కోకాగితమే తీసి చదవసాగాడు.

"ప్రమాదం జరిగినప్పుడు మీరు గంటకు 50-60 మైళ్ల వేగంతో మోటారు సైకిల్ నడుపుతున్నారని శ్రీమతి పాల్ యూనోషీ చెప్పింది. వర్క్‌షాప్ ఫిట్టర్ ఎలిక్‌బర్‌కు మోటారు సైకిల్ విషయం

బాగా తెలుసు. మీరు దానిమీది నుంచి కింద పడడానికి కారణం- అంత స్పీడుగా రావడమే అంటాడతను. అంతేకాదు, మీర సలు హారన్ మోగించనేలేదని అందరు అంటున్నారు. ఆ ప్రమాదం జరిగినప్పుడు ఆ ప్రదేశమంతా ఎంతో నిశ్శబ్దంగా ఉందనీ, ఒక చిన్న లేగదూడ అరిచినా అందరికీ వినబడివుండేదనీ, అలాంటప్పుడు మోటారు సైకిల్ హారన్ గనక మోగి ఉంటే అది తమకు తప్పక వినిపించి వుండేదనీ చెప్పారు. అందరూ అలాగే అంటున్నారు. మీరు అంత వేగంగా వెళ్ళ డమే ప్రమాదం జరగడానికి కారణం అని వారు గట్టిగా చెబుతున్నారు"

ఇదంతా విని ప్రెసిడెంటుకు ముచ్చెమ టలు పోశాయి.

"కానీ.. కానీ.." అంటూ తడబడ్డాడు. ఆయన నోట్లోంచి మాటలే సరిగ్గా ఊడి పడటంలేదు. "ఆ కుర్రాడు కింద పడ్డ ప్పుడు రోడ్డు మీదసలు ఒక్క నరమాన వుడు కూడా లేడు" అన్నాడు చివరికి ఎలాగో.

"అదేమో నాకు తెలీదు. వాళ్ళందరూ అలాగే అంటున్నారు మరి.." అన్నాడు పోలీసు అధికారి.

"వాళ్ళన్నదంతా అబద్ధం"

"నాకూ అలాగే అనిపిస్తోంది. మీది ఇంకా కొత్తబండి. ముప్పయిమైళ్ళ కన్నా ఎక్కువ వేగం నడవలేదు. అలాంటప్పుడు వేగాన్ని తగ్గించడం ఏమంత కష్టం కాదు. మీ మాటలను నేను నమ్ముతున్నాను" అన్నాడు పోలీసు అధికారి.

"అయితే మంచిది"

"కానీ మీరే ఆలోచించి చూడండి.. ఇంతమంది జనం మీకు విరుద్ధంగా సాక్ష్యం చెప్పినప్పుడు నేను మాత్రం ఏం చేయగలను? పోనీ మీరే ఏదైనా సలహా ఇవ్వండి.. నేనేం చెయ్యాలో చెప్పండి!"

"కానీ.. వాళ్లంతా చెప్పింది అబద్ధం కదా? "

"నిజమే, ఆ విషయం నాక్కూడా తెలుసు. 'వాడు చూశాడు, వీడు చూశాడు'

అనే చెబుతున్నారు అంతా. ఒకరు అక్క డుండడాన్ని ఇంకొకరు సమర్థిస్తున్నారు" అన్నాడు పోలీసు అధికారి.

"ఎందుకలా చేస్తున్నారు వాళ్ళు? కారణం ఏమయి వుంటుంది? " అడిగాడు ప్రెసిడెంటు.

"అవును, ఎందుకు? " అంటూ పోలీసు అధికారి భుజాలెగరేశాడు.

'... ఎందుకంటే వాళ్ళకు నువ్వంటే గిట్టదు. వాళ్ళంతా నిన్ను ద్వేషిస్తున్నారు. నీకు అధికార గర్వం ఎక్కువ. ఇక నుంచైనా నీ పద్ధతులు మార్చుకుంటే మంచిది' అని పోలీసు అధికారి చెప్పా ల్సింది. లేకపోతే 'పల్లెటూరి వాళ్ళంతా అంతేలే!' అనైనా అనాల్సింది. కానీ అలా అన్నందువల్ల తనకి కలిగే ప్రయోజనం ఏముంటుంది గనక? ఒకవేళ ప్రయో జనం కన్నా నష్టమే కలగొచ్చునేమో!

"చూడండీ.. నేనివన్నీ జిల్లా ఉన్నతాధి కారికి పంపించాల్సి వుంటుంది" అన్నాడు పోలీసు అధికారి.

ప్రెసిడెంటుకు అర్థమైపోయింది.

"అలాగే చెయ్యండి" అన్నాడు.

★ ★ ★

గ్రామసమితి అధ్యక్షుడు ఇమ్రెబర్టా ఆ కుర్రాడి తల్లిదండ్రులకు నష్టపరిహారం ఇవ్వాలని జిల్లా ముఖ్యాధికారి తీర్పు చెప్పాడు. అంతేకాదు ఈ సంఘటన నాధారం చేసుకుని ఇమ్రెబర్టాని ప్రెసి డెంటు పదవి నుంచి తొలగించారు. అయితే దానికి సరైన కారణాలను మాత్రం వారు చూపించలేదు.

ఒక వ్యక్తిని గ్రామ ప్రజలందరూ ద్వేషి స్తూ, అతనికి విరోధులుగా ఉన్నప్పుడు- అతను ఏ చిన్న పొరపాటు చేసినా- అత నికి విరుద్ధంగా సాక్ష్యం చెప్పడానికి జంక రనీ, అప్పుడతను పదవిలో కొనసాగడానికి అనర్హుడవుతాడనీ ఇప్పుడు తేలిపోయింది.

ఆ రోజు జరిగిన చిన్న ప్రమాదానికి ఇమ్రెబర్టా బాధ్యుడు కాడన్న విషయం అందరికీ తెలుసు. అయితే ఒకరు చెప్పిన సాక్ష్యానికీ, మరొకరు చెప్పిన సాక్ష్యానికీ ఎక్కడా పొంతనే కుదరడంలేదు. ఆ సంఘటన ప్రమాదవశాత్తూ జరిగిందనీ, కేవలం ఆ కుర్రాడి దురదృష్టమే దానికి కారణమనీ అందరూ ఎరిగిన విషయమే. అయినా- అంతమంది ఏకంగా ఇమ్రెబర్టా మీద కక్ష కట్టారంటే దానికి ఏదో కారణం ఉండే వుంటుంది. జిల్లా ముఖ్యాధికారి ఇచ్చిన తీర్పుకు తన ఆమోదాన్ని తెలియచే శాడు, జిల్లా సమితి ప్రెసిడెంటు.

"నువ్వింక పదవిలో ఉండడం అనవ సరం. ఉంటే మా గతేంకావాలి? !" అని రెండు మాటల్లో ముగించేశాడు జిల్లా సమితి ప్రెసిడెంటు.

ప్రజల గురించీ, దేశం శ్రేయస్సు గురించీ- తన ప్రవర్తనలో, కార్యనిర్వహ ణలో ఎక్కువ దీక్ష, శ్రద్ధ అవసరమన్న సంగతి ఆయనకు బాగా తెలుసు.

నిజంగా ఇమ్రెబర్టా మంచి మనిషే. కానీ తన కర్తవ్య నిర్వహణలో మటుకు మరీ కరుగుగా ఉండడం వల్ల జనం అతని మీద కక్షకట్టారు. ఆ కక్షే ఆయన ఉద్యోగం పోవడానికి కారణమైంది.

ఆయన వల్ల విరిగిన కుర్రాడి కాళ్ళు బాగుపడి వాడిప్పుడు మొదటికంటే ఎక్కువ ఉత్సాహంగా ఉన్నాడు. సంతో షంతో గంతులు వేస్తున్నాడు. తాను మోటారు సైకిలుకు అడ్డంగా వచ్చినందు వల్ల ఇమ్రెబర్టాకు కలిగిన నష్టం ఏమిటో ఆ కుర్రాడి కసలు తెలియనేలేదు. తెలిసినా అర్థం చేసుకునే ఈడు వాడికి రాలేదు.

*గమనిక: ఈ శీర్షికలో ప్రచురిస్తున్న ఆయా భాషల కథలు విపులలో తెలుగు అనువాదంగా వెలువడి 35 ఏళ్లయిందని గ్రహించగలరు. మొద టిసారి మూల రచయిత / అనువాదకులకు విపుల పారితోషికం చెల్లించింది కనుక వారికి మరోసారి పారితోషికం ఉండదని మనవి.* V

# అభినందన చందనం

## జీవనయానంలో నేస్తాలు



'విపులంగా దేశ విదేశాల సంగతులను ఎలా చెప్పగలుగుతున్నావే? 'అని అడిగిన స్నేహితురాలికి 'నేను విపుల - చతురల పాఠకురాలిని' అని జవాబు చెబుతుండొక కాలేజీ విద్యార్థిని. ఈ పత్రికలు వెలువడిన కొత్తల్లో రేడియోలో ప్రకటనలు విన్న నేను ఈ జంట పత్రికలను బ్యాగులో పెట్టుకొని వీలయినప్పుడల్లా చదువుకుంటూ ఉండేదాన్ని. ఆఫీసు స్పెషల్ బస్సులోనూ, లంచ్‌టైమ్‌లోనూ ఈ పత్రికలను చదవడం ఓ సరదా. ఇక రైలు ప్రయాణాల్లో అయితే.. నాతో పాటూ ప్రయాణించాల్సిందే! రచనావ్యాసంగంలో కాస్త ప్రవేశం ఉన్న నేను.. హిందీ పత్రికలలో మంచి కథలను అనువదించి 'విపుల'కు పంపించాను. 1986 జూన్ 'విపుల'లో అచ్చయిన 'ఎలర్జీ' కథ నుంచి 2013 ఆగస్టుసంచికలోని 'తొలిప్రేమ' వరకూ... నా అనువాద కథలు ఎనభై వరకూ ప్రచురితమయ్యాయి. సిందూర కెరటాలు, హనీమూన్ - ఈ రెండు పెద్ద కథలు చతురలో వచ్చాయి. జీవనయానంలో నేస్తాలుగా నిలిచిన 'విపుల - చతుర'లు తెలుగు సాహితీ గగనంలో ధ్రువతారలుగా నిలవాలని కోరుకుంటున్నాను.

**– శీతంరాజు పద్మావతి,** సికింద్రాబాద్

## దినదినాభివృద్ధి



సాహితీ సౌరభాలను అందించే అపురూప కానుకలు 'విపుల- చతుర'. 'ఇంతింతై వటుడింతై...' అన్నట్లు ఎదుగుతూ ముప్పై ఆరో వసంతం జరుపుకుంటున్నాయంటే ఆశ్చర్యమే. భరతమాత ముద్దుబిడ్డ, సరస్వతీదేవి మానస పుత్రులు, రామోజీరావుగారు వాటికి జన్మనివ్వడమే అందుకు కారణం. వైవిధ్యమైన కథా సంకలనాల మణిదీపిక 'విపుల'. సమకాలీన సమస్యలని శోధించి, పరిష్కార మార్గం చూపించే నవలావేదిక 'చతుర'.

నా నవల 'ఎటో వెళ్లిపోతోంది మనసు..' చతురలో ప్రచురితమైంది. చిత్రంగా నా భవిష్యత్తుని గురించే రాసినట్టుందా నవల. ఆ నవల ప్రచురితమయ్యే సమయంలో.. ఆ కథలోని నాయికలా నేను మరణశయ్య మీద మృత్యువుతో పోరాడుతున్నాను. నవలలోలా కాకుండా, నిజజీవితంలో నాకథ సుఖాంతమైంది. నన్ను అభినందిస్తున్నట్టు నా నవల ప్రచురితమైన 'చతుర' నా చేతిలో వాలింది. అంతే! నోబెల్ పురస్కారం వచ్చినంతగా పొంగిపోయాను. మొదట్నించీ 'చతుర- విపుల'ల అభిమానినైన నేను అప్పట్నించీ వీరాభిమానిగా మారాను.

**– రావినూతల సువర్ణా కన్నన్,** రచయిత్రి

## నిత్య నూతనం



తెలుగు సాహితీ ప్రపంచంలో ఓ ప్రభంజనం 'చతుర- విపుల'. ప్రపంచ భాషల్లోని గొప్ప కథల్ని తెలుగు పాఠకులకు పరిచయం చెయ్యాలన్న ఆలోచనే అపూర్వం... సాహసోపేతమైన ప్రయోగం. 'విపుల' మాస పత్రికే అయినా... పూర్ణాయుష్షుగల పత్రిక. ఎందుకంటే ఎపుడు చదివినా నిత్యనూతనంగా ఉంటుంది. ఇక 'చతుర' నవతరానికి నచ్చే నవలా ప్రయోగవేదిక. ప్రతినెలా నవలలో ఆలోచనలో పడేసే కథాంశం చోటుచేసుకోవడం విశేషం. ఆరోజు మూడు రూపాయలకు ముచ్చట పడి కొనుక్కున్న 'చతుర' ఈరోజు అక్షరలక్షలు. 'విపుల- చతుర' అప్పుడే ముప్పై ఆరో వసంతంలోకి కాలుమోపడం సంబరంగా ఉంది. ఈ అక్షరార్చనలో 'చతుర- విపుల' ఆచంద్రార్కం నిలిచిపోవాలని కోరుకుంటున్నాను.

**– ఇమంది రామారావు,** సీనియర్ పాత్రికేయులు

# ఏ పేరుతో పిలిచినా?




మూడో తరగతి చదువుతున్న మా బంటీగాడు మహా గడుసరి. బంధువులింట్లో పెళ్ళి కారణంగా వరుసగా మూడ్రోజులు బడి మానేశాడు. ఈరోజు బడికెళ్లమంటే వెళ్ళనని మారాం చేస్తున్నాడు. పైగా విప్లవ నాయకునిలా ఓ సమస్యను నా వద్ద ఉంచి పరిష్కరిస్తే చదువుకుంటానని... లేకుంటే అర్థం కాని చదువు చదవలేనని కూడా అన్నాడు. ఇంతకూ వాడి సమస్య ఏమంటే! క్రైస్తవులు వారి దేవున్ని 'ఏసు'అని పిలుస్తారని, ముస్లిములు వారి దేవున్ని 'అల్లా' పేరుతో పిలుస్తారని... ఇక హిందువులు రాముడు, కృష్ణుడు, శివుడు... అని పలుపేర్లతో పిలుచుకుంటారని... ఇలా ఎన్నిపేర్లతో పిలిచినా... పలికే దేవుడొక్కడేనని మా టీచర్ చెప్పారు. దేవుడొక్కడే అయితే... ఇన్ని పేర్లతో పిలవడం దేనికి అని!! వాడి సందేహం సరైనదే! కానీ వాడి వయసు కర్థమయ్యేలా ఎలాచెప్పాలి? ఆలోచించాను...



వెంటనే "బంటీ నీ సందేహం తీరిస్తే బడికెడతావా? "

"ఓ! తప్పకుండా! వెడతాను!!"

"అయితే నేనొకటి అడుగుతా చెప్పు"

"అలాగే, అడ్డుగమ్మా!"

"నాన్న! నిన్నేమని పిలుస్తారు? "

"కన్నా!" అని!!

"మరి నీ అన్నయ్య? "

"తమ్ముడూ!" అని

"మీ తాతయ్య? "

"బుజ్జీ!" అని

"మీ నాయనమ్మ? "

"పండూ!" అని

"నీ ఫ్రెండ్స్? "

"వంశీ!" అని

"టీచర్స్? "

"ఒరేయ్ వంశీ" అని

"మరింతమంది ఇన్ని పేర్లతో పిలిచినా! పలికేది నువ్వొక్కడివే గదా! చిన్న పిల్లాడివైన నీకే ఇన్ని పేర్లున్నప్పుడు... అందరికీ దేవుడైన ఆయనకెన్ని పేర్లుంటాయో గదా!"

నా సమాధానం వాడికి నచ్చింది.

"నిజమేనమ్మా! భలేగా చెప్పావంటూ.." సందేహం తీరినందుకు తృప్తిగా నవ్వి బడికి బయలుదేరాడు.

– కె.వి. లక్ష్మణరావు,
మానేపల్లి, తూ. గో. జిల్లా

# గిఫ్ట్‌ప్యాక్

చిన్న బజారువీధిలో జనం పల్చగా వున్నారు. నెలాఖరు. సుశీల, గోపాల్రావు బట్టల దుకాణం వైపు నడుస్తుంటే ఇద్దరు టి.వి. చానెల్ వాళ్లు బైక్‌ని ఆపుచేసి వాళ్లదగ్గ రకొచ్చారు. సుశీలకసలే టి.వి. దురద ఎక్కువ.



మైకు సుశీలకు అందించి "పెరుగుతున్న ధరల మీద మీ అభిప్రాయం? " అనడిగారు. గోపా ల్రావు కొంపదీసి 'బకరా' కాదు కదా అనుకు న్నాడు. ఇంతలో కెమెరా పట్టుకున్నతను




"మేడమ్! మీరు ధరల గురించి మాట్లాడతారు కదా! అందుకని మీరు సాదాసీదాగా వుండాలి. మెడలో ఆ గొలుసులు, జూకాలు తీస్తే నేచురల్‌గా రికార్డవుతుంది. మీ అభిప్రాయం టి.వి.లో ప్రచారమైనపుడు సహేతుకంగా వుంటుంది" అన్నాడు.

"అవును నిజమే" అన్నాడు గోపాల్రావు.

సుశీల అవన్నీ తీసేసి మైకు పట్టుకున్న వాడి కిచ్చి చాలా ఆవేశంగా "కరెంట్, పెట్రోలు, ప్రయాణాలు, నిత్యావసర వస్తువుల ధరలు" అంటూ మాట్లాడింది.

"చాలా నేచురల్‌గా వుంది మేడమ్. మీకో గిఫ్ట్" అంటూ చిన్న గిఫ్ట్ పేక్ ఇచ్చి ఇద్దరూ బైక్‌మీద ఉడాయించారు. సుశీల బంగారం వస్తువులు సర్దుకుని, ఘొల్లుమంది. గిఫ్ట్ పేక్ తీసి చూస్తే చిన్న డబ్బాలో 'బకరా'అని రాశారు నకిలీ ఛానల్ వాళ్లు.

**– జి.వి.ఎస్. ప్రియంవద**

అరసవిల్లి, శ్రీకాకుళం జిల్లా

# అపరిచితుడు

"అమ్మగారూ! అమ్మగారూ!! ఇంట్లో ఎవరైనా మగవాళ్లుంటే కాస్త పిలవండి!" అడిగాడో అపరిచితుడు.

"ఇంట్లో మగవాళ్ళెవరూ లేరు" చెప్పింది అనసూయ.

"పోనీ పక్కింట్లో వాళ్ళనైనా పిలవండి"

"పక్కిళ్ళలోనూ ప్రస్తుతం ఎవరూ లేరు బాబూ"

"అయితే ఫోన్ చేసి మీవారిని పిలవండి!"

"అయ్యో! ఫోన్ చెడిపోయిందే..."

"కనీసం పనివాళ్ళనయినా పిలవండి"

"ఈరోజు పనమ్మాయి కూడా రాలేదు. ఇంతకీ ఏంటి బాబూ పని? "



"మీ పిల్లలు? "

"కాలేజీకి వెళ్ళిపోయారుగా!"

"అయితే ఎవరూ లేరన్న మాట"




"అవును బాబూ, ఏం పని మీద వచ్చావ్? "

"సరే! అయితే నీ మెళ్లో గొలుసు, మంగళసూత్రాలు, చేతిగాజులు, చెవికమ్మలు, ఉంగరాలు అన్నీ తీసి మర్యాదగా నా చేతిలో పెట్టు. లేకపోతే కత్తితో గొంతు కోస్తా" చాకుతో బెదిరిస్తూ చెప్పాడు, అప్పటిదాకా మర్యాదగా అడిగిన అపరిచితుడు.

**– పి.వి. రమణకుమార్,**
చిలకలూరి పేట.

# అయితే నాదే!

షావుకారు సుబ్బయ్య ఫోను మోగింది. ఫోన్ తీశాడు సుబ్బయ్య.

“మామయ్యా! మధ్యాహ్నం మా నాన్నకి మ్మని ఎంతిచ్చావు? ” అడిగాడు మేనల్లుడు సూర్యం.



“ఐదువేల మూడు వందలు! నేను మీకివ్వవలసింది అంతే! అవే యిచ్చాను. ఏం? ” అన్నాడు.

“అదే! ఓ వంద తేడా...” అంటూ నీళ్ళు నములుతున్న సూర్యం మాటలకు, సుబ్బయ్యకు తీవ్రస్థాయిలో కోపం వచ్చేసింది!

“నేనందుకే చిలక్కి చెప్పినట్టు చెబుతూ వుంటాను. డబ్బుదగ్గర అజాగ్రత్త కూడదు. ఒకటికి పదిసార్లు లెక్క చూసుకోవాలి. మొగమాటాలకూ, భేషజాలకూ పోకూడదు! నా దగ్గర ఎప్పుడూ ఒక్క పైసా తేడా రాదు! నువ్వు తీసుకున్న తరువాత పూర్తి జవాబుదారీ నీదే! నువ్వు అనుభవించవలసిందే! డబ్బు దగ్గర చుట్టరికాలుండవు. ఒకసారి చేతులు కాలితేగానీ నీక్కూడా తెలిసిరాదు!” అంటూ తీవ్రస్థాయిలో సూర్యానికి క్లాసు పీకాడు సుబ్బయ్య.




“అదికాదు మామయ్యా! ఓ వంద ఎక్కువుంది!” అన్నాడు సూర్యం.

“ఆ!? ఏమిటీ వంద ఎక్కువుందా? అయితే నాదే! జాగ్రత్తగా నాకు తెచ్చివ్వరా.. అల్లుడూ!”

**– వి.వి. సుబ్బరాజు,** కోలంక

# లోకో భిన్న దృష్టిః

ఆపరేషన్ థియేటర్ ముందు గుమికూడిన జనం అంజన్న యాక్సిడెంటు గురించి మాట్లాడుకుంటున్నారు. వారం క్రితం అంజన్నతో వివాహం జరిగిన అంజలి ఆసుపత్రి వరండా మూల చేరగిలపడి తలదించుకు కూర్చొని మౌనంగా రోదిస్తోంది.



ఆపరేషను పూర్తిచేసి డాక్టరు వరండాలోకి వచ్చాడు.

ఆత్రుతగా ఉన్న అంజన్న తండ్రి డాక్టర్ని కలిశాడు.

"చాలా పెద్ద యాక్సిడెంట్. అదృష్టవశాత్తూ ప్రాణగండం తప్పింది" అన్నాడు డాక్టరు.

అంజలి మొహంలో ఆనందం వెల్లివిరిసింది. తన పసుపు కుంకుమలు నిలిపిన ఏడుకొండల వెంకన్నకు మౌనంగా మొక్కింది.

"అభాగ్యురాలు అంజలితో పెళ్ళి జరిగిన వారానికే నా మనుమడికిలా జరిగింది" అంటూ జనాలతో వాపోతోంది అంజన్న నాన్నమ్మ.




అంజలి మొహంలో విషాదం అలముకుంది.

"అంజలి అదృష్టమే నా కొడుక్కి ప్రాణం పోసింది. ఆవిడ మాంగల్య బలం ముందు మరణం ఓడిపోయింది" అంది అంజన్న అమ్మ.

అత్త మాటలు విన్న అంజలి మొహంలో వేయి దీపాల కాంతి వెల్లివిరిసింది.

అంజన్న అమ్మ దృష్టి ఒకలా, నాన్నమ్మ దృష్టి మరోలా ఉంది.

"లోకో భిన్న దృష్టిః" అనుకున్నారు పరామర్శించడానికి వచ్చిన బంధువులు.

**– పోలిశెట్టి ఓబయ్య,**
కడప

# రోజు విడిచి రోజు




శంకరయ్య అతి పొదుపుగా జీవించి, పది లక్షల కట్నం ఇచ్చి తన ఒక్కగా నొక్క కూతురు పద్మను ఇన్సూరెన్స్ ఆఫీసులో పనిచేస్తున్న హరిబాబుకిచ్చి ఘనంగా పెళ్ళిచేశాడు. అల్లుడి విషయంలో అన్నీ బాగానే ఉన్నాయి. కానీ ఒక విషయంలో మాత్రం పెద్ద బాధైపోయింది శంకరయ్యకు. అల్లుడు హరిబాబు ఆఫీసు అయిపోగానే చక్కగా పేకాట స్థావరానికి వెళ్ళి అర్ధరాత్రి దాకా పేకాట ఆడి వస్తుంటాడని తెలుసుకొని విలవిల్లాడిపోయాడు శంకరయ్య.



ఈ విషయం తానే స్వయంగా అల్లుడితో చెప్పలేక తన మిత్రుడు సాంబయ్యను వెంట పెట్టుకుని కూతురు ఇంటికి వెళ్ళాడు శంకరయ్య. హరిబాబు పలకరింపులు, పరామర్శలు బాగానే చేశాడు. యథాప్రకారం తన పేకాట స్థావరానికి వెళ్ళిపోయాడు.

మర్నాడు ఉదయం శంకరయ్య మిత్రుడు సాంబయ్య "చూడు బాబూ! పేకాటలో డబ్బు ఈరోజు వస్తుంది. రేపు పోతుంది. ఎల్లుండి వస్తుంది. ఆవలి ఎల్లుండి పోతుంది. శాశ్వతం కాదు. నామాట విని అది వదిలెయ్.." లౌక్యంగా చెప్పాడు.

"అలాగా! ఈ ట్రిక్కు నాకిన్నాళ్ళూ తెలీదు. ఇకనుంచి రోజు విడిచి రోజు ఆడతా... డబ్బు గెలుస్తా! థాంక్సండీ..!" అంటూ ఉత్సాహంగా వెళ్ళిపోతున్నా హరిబాబుని చూసి నోళ్ళు వెళ్ళబెట్టారు శంకరయ్య, సాంబయ్య.

**– పి.వి. రమణకుమార్**
చిలకలూరిపేట

# సరసిజం

అమ్మాయి బొమ్మయితే చక్కగానే వుందమ్మా.
కానీ నేను చూపించమన్నది రిజర్వేషన్ మెసేజి కదా!




టైం ఎంతయిందో తెలియడం లేదు!
ఎవరినైనా టైం అడిగి తెలుసుకోవాలి!
వాచ్ కంపెనీ
ఇక్కడ అన్ని రకముల గడియార



ఈ కుక్కకి
నేనంటే ఎంత ప్రేమ...
నాగ్రాజ్.


మన బాస్ ఇలాగే
మాట్లాడుతున్నాడంటే ఖచ్చితంగా
ఆ ఫోన్ ఇంటి నుంచే..


బాస్
బివి


పండిత పుత్ర శుంఠః అన్నారు!


అది మాకు వర్తించదు! బాబో!

# పత్రం పుష్పం ఫలం తోయం




'మాసానాం మార్గశీర్షోహం' అని పరమాత్మ వచనం. పుణ్యప్రదమైన కార్తీక మాసం పూర్తయిన వెంటనే విశిష్టమైన మార్గశీర్షం ప్రవేశిస్తుంది. ఉత్తరాయణ పుణ్యకాలానికి బ్రాహ్మీముహూర్తంలాంటి సమయమిది. ఈ మాసంలో వాతావరణం శీతవాతాతప శూన్యంగా, సుఖరంజకంగా, ఆహ్లాద జనకంగా ఉంటుంది. ప్రాణులు శక్తిమంతంగా ఉండే తరుణం. పంటలన్నీ చేతికంది రైతు శ్రమ ఫలించే సమయం. పాడిపంటలతో కళకళలాడుతూ తపోవ్రత దానాదులకు అనువైన కాలం. మహాభారత కాలంలో మార్గశీర్షంతో నూతన వత్సరం ఆరంభమయ్యేదని అనుశాసనిక పర్వం చెబుతోంది. మార్గశీర్షంలో శుద్ధ ఏకాదశినాడు పవిత్ర భగవద్గీత ఆవిర్భవించింది. ఆ రోజు గీతాజయంతి జరుపుకుంటాం. చాంద్రమానం ప్రకారం మార్గశీర్షమాసమే సూర్యమానంలో ధనుర్మాసం. భౌతిక ఫలాల్నే కాకుండా ఆధ్యాత్మిక ఫలాల్ని కూడా అందించే శుభప్రదమైన కాలం. లోకహితాన్ని కాంక్షిస్తూ ధనుర్మాస వ్రతాన్ని ఆచరిస్తాం. ఈ వ్రతాలు, నోములు, పూజలు అన్నీ శ్రీమహావిష్ణువు పద పద్మాలను అందుకోడానికి మార్గదర్శకాలని మన పెద్దలు చెబుతున్నారు.

*పత్రంపుష్పంఫలంతోయం యో మే భక్త్యాప్రయచ్ఛతి*
*తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః*

భక్తి పురస్సరంగా సమర్పించిన పత్రం, పుష్పం, ఫలం, జలం ఏదైనా సరే ఆరగిస్తానని శ్రీమద్భగవద్గీతలో పరమాత్మ చెబుతున్నాడు. ఆకలే తెలియని పరమాత్మ ఆకులు తింటాడా? ప్రాణధర్మమైన దాహమే ఉండని ప్రాణనాథుడు జలపానం చేస్తాడా? ఫలాలైతే సరే, మరి పువ్వుల మాటేమిటి? అశ్నామి - తింటాను అంటున్నాడు. జలాలు తినడమేమిటన్నదే మీమాంస. మరోవైపు వేదం 'నహవై దేవా అశ్నన్తి న పిబన్త్యే తదేవామృతం దృష్ట్వా తృప్యన్తి' అని చెబుతోంది. భక్తులు సమర్పించినవేవీ దేవతలు తినరు. పానం చేయరు. అమృతమును కూడా కళ్లతో చూచి తృప్తిపొందుతారే కానీ తాగరంటుండగా మరి పత్రపుష్పఫలజలాలను తింటానని పరమాత్మ స్వయంగా ఎందుకు చెబుతున్నాడు? 'అశ్నామి' పదానికి 'గృహ్ణామి' స్వీకరిస్తాను అని అర్థం చెప్పారు భాష్యకారులు కొందరు. భక్తితో సమర్పిస్తే ఏవైనా అందుకుంటాడు. అనుగ్రహిస్తాడు.

### ఆ నాలుగే ఎందుకు?

పత్రం, పుష్పం, ఫలం, తోయం- లోకంలో ఈ నాలుగే శ్రేష్ఠమైనవా? పరమాత్మకు ప్రీతిపాత్రమా? అసలు వీటితో ఎవరినైనా తృప్తిపరచగలమా? కానీ భగవంతుడు తృప్తిచెందుతున్నాడు. ఆయన గ్రహించేది వస్తువును కాదు. మన భక్తిని. అందరికీ ఈ నాలుగూ సులభంగా ప్రాప్తించేవి. 'అన్యస్మాత్ సౌలభ్యం భక్తౌ..' అని వీటి సమర్పణకు అవసరమైన భక్తి కూడా సులభసాధ్యమైనదే.

**పత్రం :** ఆకలి ఎరుగని అచ్యుతుడు అన్నం వడ్డించమన్నాడు. పాత్ర నిండుకుందని అడవుల్లో ఉన్న చెల్లెమ్మ ద్రౌపది చిన్నబోయింది. సూర్యదత్తమైన అక్షయపాత్ర అంచుకు అంటుకుని అగుపించిన శాకలేశాన్ని నోటిలో వేసుకున్నాడు. 'విశ్వాత్మా ప్రీయతాం దేవస్తుష్టశ్చాస్మితి యజ్ఞభుక్' - 'భగవంతుడు



# నాలుగు కావు, అన్నీ ఒక్కటే!

పత్రం - పుష్పం - ఫలం - తోయం.. అనేవి నాలుగుగా కనిపిస్తున్నా తాత్త్వికంగా విశ్లేషిస్తే ఒక్కదాని రూపాలే అని బోధపడ తాయి. ఆ ఒక్కటే మన అంతఃకరణం. మనో బుద్ధ్యహంకార చిత్తములనే అంతఃకరణ చతుష్టయం.

పత్రమంటే మనస్సే. 'చలనాత్మకం మనః' ఆకు చలించినట్లుగా నిరంతరంచలిస్తూ ఉండేది మనస్సు. చలనశీలమైన మనస్సు భగవంతునికి అర్పించడమే పత్ర సమర్పణం. పుష్పం బుద్ధికి ప్రతిరూపం. సుందర సురభిళ విజ్ఞాన సౌగంధ్యాన్ని ప్రసరించే వికాసయుత మైన బుద్ధే పుష్పం. బుద్ధిలోని భావసౌరభా లను భగవంతుని పదకమలాల చెంత సమర్పించడమే పుష్ప కైంకర్యం. అహంకార భావనయే ఫలం. 'నాహం కర్తా.. హరిః కర్తా' నేను కర్తను కాను. కేవలం పరమాత్మ చేతిలో ఉపకరణాన్ని మాత్రమే అనే భావనతో అహంకారమనే ఫలాన్ని నారాయణుని చరణాలకు సమర్పించడమే ఫలనివేదన. చింతన శీలమైన చిత్తమే తోయం. నదిలో నిత్యప్రవాహం కొనసాగునట్లు గత స్మృతులు, వర్తమాన భావనలు, భావి ఊహాపోహలు ముప్పిరిగా అల్లుకుంటూ సాగే చింతనమే చిత్తమనే తోయం. ఈ వృత్తులన్నిటినీ నిరోధించి చిత్తాన్నిభగవంతుని చెంత ఉంచడమే ఉదక సమర్పణం.

*దళమైనను పుష్పమైనను*
*ఫలమైనను సలిలమైన బాయని భక్తి*
*న్గొలిచిన జనులర్పించిన*
*నెలమిన్ రుచిరాన్నముగను యేను భుజింతున్*

– శ్రీమద్భాగవతము

సంతృప్తి చెందుగాక!' అని పలికాడు శ్రీకృష్ణుడు. పదివేలమంది శిష్యగణంతో వచ్చి ఆతిథ్యం ఇవ్వమన్న దుర్వాసమహర్షి అభీష్టం నెరవేరడానికి ఆ పలుకే హేతువైంది. అర్పించింది ఆకు మాత్రమే! ఆకలి తీరిందో పదివేలమందికి! పరమాత్మ మహిమను వర్ణించడం ఎవరి తరం?

**పుష్పం :** మొసలితో పోరాడి.. పోరాడి అలసిపోయి అసువులు బాసేవేళ గజేంద్రుడు శ్రీహరిని ప్రార్థించాడు. మొర ఆలకించి వైకుంఠపురం నుంచి బయలుదేరి త్రికూట పర్వతము నందలి రుతుమంతమనే ఉద్యానవనంలో గజేంద్రుని సమీపించాడు. శ్రీహరిని దర్శించి గజేంద్రుడు 'ఉత్క్షిప్య సాంబుజకరం, నారాయణాఖిలగురో భగవన్ నమస్తే!' సరోవరము నందలి శతపత్రాన్ని తొండంతో పట్టి పైకెత్తి జగన్నాథా! నమస్కారం అన్నాడు. అంతే శ్రీమహావిష్ణువు చక్రాయుధాన్ని ప్రయోగించి మకరి శిరస్సు ఖండించాడు. కరిని ఉద్ధరించాడు. సమర్పించింది పుష్పం. ప్రతిగా శ్రీహరి నుంచి పొందింది ప్రాణం.

**ఫలం :** 'శ్రీరామ దర్శనంతో తరిస్తావన్న' గురువచనాలను మనస్సులో నిలుపుకొని శబరి, పంపానదీ తీరంలో నిరాశ లేని నిరీక్షణ చేసింది. రామచంద్రుడు రానే వచ్చాడు. 'గురుసేవకు ఫలం ప్రాప్తించిందా?' అని అడిగాడు.

*అద్య ప్రాప్తా తపః సిద్ధిః తవ సందర్శనా న్మయా*
*అద్యమే సఫలం తప్తం గురవశ్చ సుపూజితా!*

రామా! నీ సందర్శనంతో నా తపస్సు, నేనాచరించిన గురుసేవ సఫలములయ్యాయని శబరి పరవశించింది. రుచికరములైన ఫలములు సమర్పించి రామసేవలో తరించింది.

'అర్చితోహం త్వయా భక్త్యా గచ్ఛ కామం యథాసుఖమ్' శబరీ! నన్ను భక్తితో అర్పించావు. ఇక పరలోకాలకు సుఖంగా వెళ్లమని శ్రీరాముడు ఆశీర్వదించాడు. పక్వమైన ఫలమూలాదులు సమర్పించింది. ముక్తి ఫలాన్నే అందుకుంది.

**తోయం :** సర్వుల్లో సర్వేశ్వరుని సందర్శిస్తూ, సంపదనంతా వితరణ చేసిన ఉదారశీలి రంతిదేవ మహారాజు. ఒకప్పుడు తీవ్రమైన క్షామం సంభవించగా, నలభై ఎనిమిది రోజుల అనంతరం ఆహారం దొరికింది. భార్యాబిడ్డలతో కడుపు నింపుకుందామనుకున్నాడు. ఇంతలో అతిథులు అరుదెంచగా 'అభ్యాగతః స్వయం విష్ణుః' అని ఆహారాన్నంతా అర్పించాడు. ఉన్న ఉదకంతోనైనా ప్రాణాలు నిలుపుకుందామనుకున్నాడు. ఈలోగా వచ్చిన మరొకనికి ఆ నీటినిచ్చి అతని ప్రాణాలు రక్షించాడు. రంతిదేవుని సమర్పణ వైభవానికి బ్రహ్మాదులు మెచ్చి పరమపదాన్నే అనుగ్రహించారు.

– చారి



★ 'విపుల' నవంబరు సంచికలో తమిళ కథ 'ఉనికి' సరళంగా, సొంపుగా సాగింది. తండ్రీ కూతుళ్ళ అనుబంధం, ఓ నిరుపేద సంప్రదాయ కుటుంబంలో వుండే బాధలు, సమస్యలు అన్నీ కళ్ళకు కట్టినట్లు చూపించారు. మళ్లీమళ్లీ చదవాలనే ఆసక్తిని కలిగించిందీ కథ.

– *పి.ఎస్. సుశీలమ్మ,* కొత్త చెరువు

★ నవంబరు 'విపుల'లో పెద్దలు చదవాల్సిన పిల్లల కథలన్నీచాలా బాగున్నాయి. 'దివ్యా, వాళ్ల అమ్మా!' కథ ఆలోచింపజేసింది. పిల్లలకు బలవంతంగా చదువు చెప్పించ కూడదని, వారికి నచ్చిన గ్రూపులోనే చేర్పించాలని చాలా బాగా చెప్పారు. ఈ కథ తల్లిదండ్రులకు కనువిప్పు. రచయితకు అభినందనలు. 'డైనోసార్ బిడ్డ' కొత్త ఆలోచనలతో అందరికీ నచ్చే విధంగా ఉంది.

– *పల్లా పవన్‌కిశోర్,* ప్రొద్దుటూరు

★ నవంబరు సంచికలో కథలన్నీ బాగున్నా, తెలుగు కథలు మాత్రం శిల్పంలో మెరుగనిపించాయి. తెలుగు కథల్లో ముఖ్యంగా 'కాకులు' హృద్యంగా ఉంది. తల్లిదండ్రుల పట్ల మనసులో లేని ప్రేమానురాగాలు చనిపోయిన తర్వాత శ్రాద్ధకర్మలలో చూపడం అవసరమా? అని ఈ కథ ప్రశ్నిస్తుంది. త్యాగానికి మితి, పరిమితి లేవని, త్యాగం చేసినవాడు కానీ, గ్రహించిన వాడు కానీ, పైకి చెప్పుకోవలసిన అవసరం లేదని కన్నడ కథ 'ఎందరో మహానుభావులు' స్పష్టపరిచింది. ఇరాన్ కథ 'అపరిచిత వ్యక్తి' హృదయాన్ని కలిచివేసింది. సాయం ఇవ్వడానికి, తీసుకోవడానికి పరిచయం అవసరం లేదని అవగతమయింది. 'జ్ఞానధార'లో దీపావళి, కార్తీక మాసాల సందర్భంగా 'దీపారాధన' గురించిన సమాచారం ఉపయుక్తంగా, ప్రయోజనకరంగా ఉంది. కార్డుకథల్లో 'శ్రీరంగ నీతులు' బాగుంది.

– *డాక్టర్ శివభూషణం,* కర్నూలు

★ నవంబరు 'విపుల' ఆకట్టుకుంది. కథలన్నీ బాగున్నాయి. ముషాయిరా కవితలు మమ్మల్ని ఎంతగానో అలరించాయి. కార్తీక మాసం సందర్భంగా 'జ్ఞానధార'లో 'దీపారాధన' బాగుంది. అభినందనలు.

– *సంజీవిగారి నాగశ్వేత,* బెంగళూరు

★ నవంబరు సంచికలో కథలన్నీ బాగానే ఉన్నాయి. తెలుగు కథల్లో బాలల మనస్తత్వం స్పష్టంగా ఉంది. చాలామంది తల్లిదండ్రులు పిల్లల అభిరుచులు పట్టించుకోరని 'దివ్యా, వాళ్ల అమ్మా!' కథ చాటి చెప్పింది. దేశం దాటి వెళ్లిన పిల్లల ప్రవర్తన తల్లిదండ్రులని ఎంత బాధిస్తుందో 'మాతృదినోత్సవం' తెలిపింది. డబ్బుతో ప్రేమాభిమానాలను కొనలేమనే కటిక నిజాన్ని ఈ సమాజంలో అడుగడుగునా చూస్తున్నాం. మలయాళ కథ 'డైనోసార్ బిడ్డ' బాగుంది. ప్రపంచ భాషల్లో 'జిరాఫీ, తాబేలు' కథలూ పిల్లల ఆకాంక్షలను ప్రతిఫలింపజేసేవిగా ఉన్నాయి. ఆణిముత్యాల్లాంటి కథలను ముప్ఫై అయిదేళ్ల క్రితం సంచికల నుంచి ఎంపికచేసి అందివ్వడం బాగుంది. రచయితలు కూడా ఉత్తమ కథలనే ఎంపిక చేస్తున్నారు. 'జ్ఞానధార' నిజంగా జ్ఞానమిచ్చేదిగా ఉంది.

– *మంచాళ శ్రీలక్ష్మి,* వైజాగ్

★ నవంబరు సంచిక బాగుంది. '35 ఏళ్లనాటి విపుల కథ' లో చెకోవ్ కథ 'బహుమతి' ప్రచురించినందుకు అభినందనలు. బహుమతిగా వచ్చిన నగ్నప్రతిమను డాక్టరు వదిలించుకున్నా గోడకు కొట్టిన బంతిలా అది తిరిగి ఆయన వద్దకే వచ్చి చేరడం పాఠకుడికి నవ్వు తెప్పించక మానదు.

– *టి. గాయత్రి,*
కందుకూరు, ప్రకాశం జిల్లా



# అస్మ - తస్మ

ప్రభుత్వం 'ఐదుగురు పిల్లలుంటే ఉచిత గృహం' పథకం ప్రవేశపెట్టింది.

భర్త "మనకి ముగ్గురున్నారు కదా. ఎదురింట్లో ఇద్దరూ నా పిల్లలే, వాళ్ళని తీసుకొస్తా" అని వెళ్ళాడు.

తిరిగొచ్చేప్పటికి భార్య ఒక్కతే ఉంది.

"పిల్లలేరీ? "

"వాళ్ళ తండ్రులొచ్చి పట్టుకెళ్ళిపోయారు."



# ఎలాగూ అదే!

కుక్కలెందుకు పెళ్ళి చేసుకోవు?

ఎందుకంటే మొదట్నుంచీ అవి కుక్కబతుకే ఈడుస్తున్నయ్ కదా అందుకని!!

# దొందూ దొందే!



కొత్తగా ఇళ్ళు కట్టుకున్న ఇద్దరు స్నేహితులు గొప్పలు చెప్పుకుంటున్నారు.

"మా ఇల్లు ఎంత పెద్దదంటే ఒక గదిలోంచి ఇంకో గదిలోకి వెళ్ళాలంటే లోకల్ ట్రెయిన్ ఎక్కాలి"

"ఓస్ ఇంతేనా! మా ఇల్లు ఎంత పెద్దదంటే ఫోన్ చేస్తూ ఒక గదిలోంచి ఇంకో గదిలోకి వెళ్తే రోమింగ్ చార్జీలు పడతయ్...!"

- కాళోజీ నారాయణరావు

# మనమే నయం

"ఇవ్వాళ్ళ ఎల్లయ్య మన మెడలపై కాడికి బదులు, బుక్కా గులాలు, బ్యారేడు జోడులకు బదులు పూలదండలు, నుదుట కుంకుమ పెట్టి కొరడా చురుకులకు బదులు వెన్నుపై దయతో చేయి తిప్పుతున్నాడేమి? " అని నల్లఎద్దు తెల్లఎద్దును ఎల్లయ్యకు తెలియకుండానే ప్రశ్నించెను.

అంత తెల్లఎద్దు "ఓపిక పట్టు. అంతా జరిగినట్టు చూడు. అదే తెలుస్తుంది. నాకు మాత్రం ఏమి తెలుస్తుంది" అనెను.

ఆరోజు ఎస్.పి.సి.ఎ. (జంతువుల యెడ జరుగు అన్యాయ నిరోధక సంఘము) స్థానిక శాఖ కార్యకర్తలు తమ సంస్థయొక్క వార్షికోత్సవము జరుపదలచిరి. వారు నాడు పురప్రముఖులతో బాటు పురములోని కొన్ని ఆవులను, గుర్రాలను, ఎడ్లను బాగా బలిసిన వానిని వెతికి వెతికి ఊరేగింపు జరుపుటకు ఏర్పాటు జేసిరి. మల్లన్న సేటు గారి భర్తి బండిని లాగే పై రెండు ఎడ్లు కూడా నాటి ఊరేగింపులో పాల్గొనవలసి

## ప్రజల పక్షాన గొంతెత్తిన కాళోజీ

ప్రజల గోడును తన గోడుగా చేసుకొని గొంతెత్తిన ప్రజాకవి, బహుభాషావేత్త కాళోజీ నారాయణరావు నిజాం నిరంకుశత్వానికి వ్యతిరేకంగా పోరాడి పలుసార్లు జైలుశిక్ష అనుభవించారు. వీరి తండ్రి కాళోజీ రంగారావు గుల్బర్గా సుబేదార్ కార్యాలయంలో పనిచేసేవారు. తరువాత వీరి కుటుంబం వరంగల్లు జిల్లా మడికొండ గ్రామంలో స్థిరపడింది. కాళోజీ నారాయణరావు విద్యాభ్యాసం మడికొండలోనే జరిగింది. ఉన్నత చదువు హైదరాబాద్‌లో సాగింది. న్యాయవాద పట్టా పొంది వరంగల్లులో కొంతకాలం న్యాయవాద వృత్తి చేపట్టారు. తెలుగుతోపాటు కన్నడ, మరాఠి, ఉర్దూ, హిందీ భాషల్లో కూడా చిన్నతనంలోనే ప్రవేశం పొందారు. వరంగల్లు సమీపంలోని గనిచెర్ల గ్రామానికి చెందిన వేలూరి మాణిక్యరావు కుమార్తె రుక్మిణీబాయితో వివాహం జరిగింది.

నాటి నిజాం రాష్ట్రంలో తెలుగుభాషకు ప్రోత్సాహం లేకపోవడంతో 1943లో హైదరాబాద్‌లో ఆంధ్ర సారస్వత పరిషత్తును స్థాపించడంలో కాళోజీ ప్రముఖపాత్ర పోషించారు. భగత్‌సింగ్‌ను ఉరికంబానికి ఎక్కించినపుడు కాళోజీ తీవ్రంగా స్పందించి మొట్టమొదటిసారి కవిత రాశారు. సమాజంలోని హెచ్చుతగ్గులు, దురాచారాలు వస్తువుగా అనేక కవితలు రాశారు. అదే 'నా గొడవ' కవితా సంపుటి. సమాజానికి అంతటికీ వర్తించే నగ్నసత్యాలే ఆయన కవితలు. అధిక్షేపం, వ్యంగ్య చమత్కృతులు ఆయన కవితలోని ప్రత్యేకత. ఖలీల్ జిబ్రాన్ 'ది ప్రాఫెట్' రచనకు ఉత్తమ అనువాదకుడిగా సాహిత్య అకాడమీ అవార్డు లభించింది. జైలులో ఉన్నప్పుడు 'రెబల్ ఇండియా' గ్రంథాన్ని రాశారు. వీరి కథల్లో 'లంకా పునరుద్ధరణ' ప్రసిద్ధి చెందింది.

1930 నుంచి గ్రంథాలయోద్యమంలో పాల్గొంటూ వచ్చిన కాళోజీ రాజకీయోద్యమాల పట్ల ఆకర్షితులయ్యారు. కాంగ్రెసు సత్యాగ్రహోద్యమం, క్విట్ ఇండియా, హైదరాబాద్ సంస్థాన విమోచనోద్యమాల్లో చురుకుగా పాల్గొన్నారు. 1952లో వరంగల్లు నుంచి కాంగ్రెసు అభ్యర్థిగా పార్లమెంటుకు పోటీచేసి అపజయం పొందారు. తర్వాత శాసనమండలికి ఎన్నికయ్యారు.




**పేరు : కాళోజీ నారాయణరావు**

**జననం :** 1914వ సంవత్సరం సెప్టెంబరు తొమ్మిదో తేదీ

**జన్మస్థలం :** కర్నాటక రాష్ట్రం బీజాపూర్ జిల్లా రట్టహళ్లి గ్రామం

**ప్రసిద్ధి :** కవి, కథారచయిత, సాహితీవేత్త, సామాజిక, రాజకీయ, పౌరహక్కుల ఉద్యమశీలి. 1958 నుంచి 1960 వరకు ఆంధ్రప్రదేశ్ శాసనమండలి సభ్యులు. తెలంగాణ రచయితల సంఘం అధ్యక్షులు. ఆంధ్ర సారస్వత పరిషత్తు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ సభ్యులు. 1992లో పద్మభూషణ్ పురస్కార గ్రహీత.

1968లో 'జీవనగీత'కు ఉత్తమ అనువాద రచనగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ పురస్కారం, కాకతీయ విశ్వవిద్యాలయం నుంచి గౌరవ డాక్టరేట్, విశాఖవారి గురజాడ పురస్కారం, మద్రాసువారి కళాసాగర్, ఉండేల మాలకొండారెడ్డి విజ్ఞానపీఠం, నాగపూర్ విశ్వవిద్యాలయం ఇలా అనేక సాహితీ సంస్థల విశిష్ట పురస్కారాలు అందుకున్నారు.

**రచనలు :** అణాకథలు, కాళోజి కథలు, నా గొడవ, జీవన గీత, తెలంగాణ ఉద్యమ కవితలు, ఇదీ నా గొడవ (ఆత్మకథ)

**మరణం :** 2002వ సంవత్సరం నవంబరు 13వ తేదీ

యుండెను. అందుకనే వాటి కాపరి ఎల్లయ్య వాటిని బండికి కట్టక అందంగా అలంకరించుచుండెను.

పగలు మూడు గంటలకు బాజా బజం త్రీలతో, వాలంటీర్ల 'గార్డ్ ఆఫ్ ఆనర్లతో' చెప్రాసి మొదలు సుబేదారు వరకు గల ప్రభుత్వోద్యోగులు, లక్షాధికారులు, బిచ్చ గాండ్లు, విద్యావంతులు, అవిద్యావంతులు, డాక్టర్లు, వకీళ్ళు, వారు వీరు అననేల అన్ని కులాల, సంఘాల, మతాల, ప్రతినిధులు ముందు నడవ- ఎడ్లు, గుఱ్ఱాలు, ఆవులు మహావైభవంగా ఊరేగెను. గుంపులోనున్న చాలామంది పెద్దలకు (వారికి గల ధన సందలచే పెద్దలు) నాటి యా హడావుడి విషయము కథా ప్రారంభమున నున్న ప్రాణులకి తెలిసినంతే తెలియును. పాప మా నల్లెద్దుకు ఎల్లయ్య బలవంతముచే నా టి యా వుత్సవములో పాల్గొనవలసి వచ్చె ను. గుంపులోని చాలా మంది పెద్దలు ప్ర భుత్వము వారి ఉన్నత ఉద్యోగుల యాజ్ఞా బద్ధులై నడుచుచుండిరి. ఇంతే తేడా.

పెద్ద హడావుడితో ద్విపద, చతుష్పాద ముల అపూర్వమైన గుంపు పుర మంది రము జేరెను. అక్కడ అదివరకే సభకు తగిన ఏర్పాట్లు చేయబడియుండెను. ప్రభు త్వము వారి ఒక గొప్ప ఉద్యోగి (అధికారి) అధ్యక్షత వహించెను. సంఘ కార్యదర్శి వార్షిక నివేదిక చదివి వినిపించెను. దానిలో యెన్ని వందల ముల్లుకట్టెలు విర గగొట్టినది, యెంతమంది బండ్లవాండ్లను, జట్కావాండ్లను, బక్కవాటిని, గాయపడిన వాటిని, ఎడ్లను, గుఱ్ఱాలను, బండ్లకు కట్టి నందుకుగాను కోర్టుకెక్కించి జరిమానాలు జేయించినది (దానిచే ఆ బక్కవాటికి గడ్డి కొనుటకు చిల్లిగవ్వలేక ఎన్నింటినో చంపు కొన్న సంగతి దానిలో లేదు) వివరంగా ఉండెను. తర్వాత నలుగురైదుగురు పెద్దలు జంతువులకు గల కష్టాలు, ఇబ్బం దులు, వానిని మాన్పుటకు ఉపాయము లను గూర్చి ఘనంగా ఉపన్యసించిరి. (ఇంతకు వారిలో ఎవరికి ఏ జంతువున కేమి కష్టమో ఏది సుఖమో తెలియదు) సభానంతరము పెద్దలందరు తమతో ఊరే గిన జంతువులను జూచిరి. వారంతా మోటార్లలో తిరుగుతూ, భవనాలలో జీవనం గడిపేవారు. కావున ఆ జంతువుల జూడ వారికెంతో సరదాగా ఉండెను. వారిలో కొందరికి గుఱ్ఱాలననేవో, ఎడ్లన నేవో కూడా తెలియదు. ఇట్లు ఈ తమాషా జరిగిన తరువాత పెద్దలందరు తమ తమ బంగళాలకు, పశువులు తమ తమ దొడ్లకు వెడలిపోయెను. మన నల్ల, తెల్ల యెద్దులు గూడా నాడు తమ జీవితములో మొదటి సారి బండి లాగని దినము (విశ్రాంతి) జరిపి యెల్లయ్య సహాయంతో తమ దొడ్డిని జేరుకొనెను. పాపం నల్లది ఉదయం తాన డిగిన ప్రశ్నకు సంతృప్తికరమైన ప్రత్యుత్త రము గానక చింతతో నుండెను. అంత తెల్లది దానితో నిట్లనెను.

"నేటి 'ఫార్సు' (బూటకము) నీకు బోధ పడలేదేం? చెపుతాను విను. ఈ మనుష్య లలో కొందరు, అందులో ముఖ్యంగా పని పాటలు లేకనే వందలు వేలు గడించేవారు మన క్షేమం కోసమని ఓ సంస్థ స్థాపిం చారు. ప్రత్యక్షంగా నిత్యజీవితంలో వారికీ, మనకూ ఏమీ సంబంధం లేదు. మనతో నేరుగా సంబంధం ఉన్నవారు, మన వలన జీవనోపాధియే గాక వేల పుట్ల ధాన్యము పండించుకునేవారు, మనపై, మనము ఈడ్చే బండ్లపై స్వారీ జేయువారు, మనకు తిండి సరిగా పెట్టక కష్టపెట్టెదరనియు, మనకు రోగం వచ్చిన, గాయాలు తగిలిన, చికిత్స జేయించకనే మనతో పని చేయించు కుంటారనియు, అందువలన మనమంద రము చాలా ఇబ్బందుల పాలగుచున్నామ నియు వీరి అభిప్రాయము. అందుకనే ఈ సంఘంవారు యెంతో ప్రయాసపడి మన కాపరులగు నరుల నుండి వేలకువేలు

# కథా కాళోజీయం



జంతువులు మనుషుల్లా మాట్లాడే పాత్రలు నీతికథల్లో కన్పిస్తాయి. ఇటువంటి జంతువులను మానవత్వారోపిత ప్రాణులని సాహితీ విమర్శకులు అంటారు. 1943 ఏప్రిల్‌లో ప్రచురితమైన కాళోజీ కథ 'మనమే నయం' కేవలం నీతికథేనా?

రూపంలో 'మనమే నయం' నీతికథలా కన్పడవచ్చు. కానీ రచనా వ్యూహంలో, సారంలో నీతికథల కంటే భిన్నమైంది. ఆధునిక కథారచనా పద్ధతిని అనుసరించడం వల్ల భిన్నమైంది. రచన నేపథ్యం భిన్నమైంది. సమాజంలోని పీడన పద్ధతుల్ని వెల్లడిస్తున్నందు వల్ల భిన్నమైంది. ఆధునిక చింతననూ, సంస్కారాన్నీ కలిగిస్తున్నందు వల్ల భిన్నమైంది.

ఈ కథాంశం (పాయింట్) ఎద్దులవంటి జీవులకున్న రక్షణ కూడా కోట్లాది శ్రామిక జనానికి లేదని చెప్పడం. కథకు నేపథ్యం ఒక పురం. ఈ పట్నంలో ఎస్.పి.సి.ఎ. సంస్థ (సొసైటీ ఫర్ ది ప్రివెంక్షన్ ఎగినెస్ట్ క్రూయాల్టీ ఆఫ్ యానిమల్స్) కథకుడి మాటల్లో 'జంతువుల యెడ జరుగు అన్యాయ నిరోధక సంఘం' స్థానిక శాఖ వార్షికోత్సవం ఈ కథలోని ముఖ్య సంఘటన. ఒకరోజు జరిగిన ఈ సంఘటన తంతును కథకుడు సర్వసాక్షి దృష్టికోణంలో మన కళ్లముందుంచుతాడు.

ఈ కథలో రెండు ఎద్దుల ప్రతిస్పందనలు కీలకమైనవి. నల్లఎద్దు రచయిత భావాల ప్రతినిధి. తెల్లఎద్దు ఆ భావాల ప్రతిద్వంది. మొదట్లో తమపట్ల దయ, తమకు చేసిన అలంకరణ ఎందుకో అని అడిగిన ప్రశ్నకు సంతృప్తికరమైన జవాబు దొరక్క నల్లఎద్దు చింతలో ఉంటుంది. తెల్లఎద్దు ఉపన్యాసాన్ని విన్న నల్లఎద్దు చుట్టూ ఉండే బతుకుల్లోని అవకతవకలను వేదనతో ఎత్తి చూపుతుంది.

ఈ కథలోని ఎత్తుగడ, సంఘటన, ముగింపుల మధ్య అమరిక ఉంది. శైలిలో ఆనాటి పుస్తక భాష ఛాయలున్నా నేపథ్యానికి అవసరమైన తెలంగాణ ప్రాంతీయ పదాల వాడుకతో (బుక్కాగులాలు, బ్యారేడు జోడులు) సరళంగా రచన సాగింది. కథకుడి కంఠస్వరంలో మంట, అధిక్షేపం, వ్యంగ్యం, సంఘటన వివరణ కనిపిస్తాయి. మరీ ముఖ్యంగా కుండలీకరణాల్లోని మాటల వల్ల కథ వేగంగా నీతిబోధ చేయదు. మనోచలనానికి గురిచేస్తుంది.

డెబ్బయేండ్ల కిందటే న్యాయవాదిగా కథలో జంతు హింసా నిరోధక చట్టాన్నీ, సంఘాన్నీ, దాని కార్యకలాపాల్నీ విమర్శకు పెట్టడం గురించి మనం ఆలోచిస్తాం. భూతదయ, జీవ కారుణ్యంలో ఉండవలసిన పీడన వ్యతిరేక చైతన్యాన్ని గురించి ఆలోచింపజేయడంలో కాళోజీ ముద్ర ఉన్న కథ ఇది.

**– కేతు విశ్వనాథరెడ్డి,**
సీనియర్ రచయిత

ముల్లుకట్టెలను లాగికొనుచున్నారట. బక్కబడినవాటితో, రోగాలవాటితో, గాయపడిన వాటితో పని తీసుకొను నరులను కోర్టుల కెక్కించి శిక్షలిప్పించుచున్నారట. కాని వీరికి కరకర నరకబడే జంతువులపై ఏ మాత్రము దయలేదు. ఒకేసారి చంపుట యన్న జీవిత కష్టముల నుండి ముక్తి ఇప్పించుట యని వీరి యభిప్రాయము కాబోలు! తమ ఆహారమునకు ప్రతిరోజు తెల్లవారు సరికి, లక్షల కోళ్ళు, గొర్రెలు, ఆవులు, యెడ్లు క్రమముగా నరకబడుచున్నను వీరికేమాత్రము ఆక్షేపణ లేదు. అట్లు జంపుటకు కావలసిన జంతువులు ఆరోగ్యము కలవి, బాగా బలిసినవి, ముసలివి కానివి, బలము గలవిగా ఉండవలెను. ఇది ఏమి భూతదయయో! ఇది ఏమి దౌర్జన్య నిరోధమో!! వారికే తెలియవలెను. ఇంతకూ ఈ సంఘంవారు మనపై జేసిన ఉపకారమేమి? తల్లిపాలు మరచి ఏ నాలుగుపోచలలో నమల నారంభించిన నాటి నుంచే మనకు ఈ నిర్బంధ జీవితము ప్రారంభము. రోజూ ఒకటే కార్యక్రమం.

స్వేచ్ఛ యననేమో మనమెరుగము గదా! ఏ వాంఛను కూడా దీర్చుకోనివ్వక ఈ నరుడు మన జీవనమును దుఃఖమయం జేయుచున్నాడు గదా! వారు కట్టిన గుంజ వద్ద పడియుండి, వేసిన నాలుగు గడ్డిపో చలు నమిలి, బండికి కట్టితే బండిని, నాగలికి కట్టితే నాగలిని, మోటకు కట్టితే మోటను, అది ఇది అననేల చేయించిన పనిని తలవాల్చి జేయవలసినదే కదా! లేక పోతే యెముకలు విరిగేటట్టు బాదుతాడు దుడ్డుకర్ర పుచ్చుకొని. పనిచేస్తాం.. చేస్తూ వచ్చాం.. చేస్తూ ఉన్నాం.. చచ్చేవరకు చేస్తాం. మనకున్న అన్ని కష్టాలకు మూల కారణం ఈ నిర్బంధ జీవనము. దానికి కారణం ఈ నరుడు. వీడేమి! మనసుద్ధరిం చుట ఏమి!! తన జీవనాన్ని సుఖంగా గడు పుటయే పరమధర్మమని తలపెట్టి అందు కని మనలను అన్ని నిర్బంధాల పాలుజేసే నరుడా మనపై దౌర్జన్యముల నిరోధించు నది. ఛీ! ఛీ!! అంతా బూటకం. మోసం ఏమంటావు, అంతేనా? ”

ఇంతవరకూ తెల్లఎద్దు ఇచ్చే ఉపన్యాసం శాంతంగా వింటున్న నల్లఎద్దు ఇట్లనెను:

“అంతా నిజమే చెప్పావు. కాని మనలను ఇంత కష్టపెట్టే ఆ నరుల జీవితం మాత్రం ఏమంత బాగా ఏడ్చింది. వారిలో చాలా మంది బ్రతుకు మనకన్నా అన్యాయం. అత్యల్ప సంఖ్యాకులైన భాగ్యవంతులు (అందరి కష్టాలకు మూలకారకులు) తప్ప మిగతా కోట్లకొద్ది ప్రజల జీవితం మనకన్న ఎన్నియో రెట్లు అసహ్యాకరంగా ఉంది. జంతువులలో స్వేచ్ఛగా ఉన్నవి సుఖంగానే ఉన్నవి కదా! పోగా మిగిలిన మనవంటివి. మనవంటి వాటికి గూడా అతి దేహకష్టము జేసిన తర్వాతనైతేనేమి తినుటకు గడ్డి, చొప్ప, తెలకపిండి, త్రాగుటకు నీరు, ఉండు టకు కప్పుగల దొడ్లు గలవు. కాని మను ష్యులలో కోట్లకొలది జనులకు ఎముకలు విరుగునట్లు కష్టపడినను వుండుటకు గుడిసె లేక, వారి ఆచారానుసారము దేహము దాచుకొనుటకు గుడ్డలేక, తుదకు త్రాగుటకు జలమైన లేక మలమల మాడు చు అసహ్యాకరమైన రోత పుట్టునట్టి జీవ నము (కేవలము ధనాఢ్యుల దాస్యము కొర కే యున్నట్లు) గడుపుచున్నారు. వారికి మ నకున్నట్లు దౌర్జన్య నిరోధక సంఘమొకటి (ఎస్.పి.సి.ఎ.) లేదు.

కనీసం తల నరికి ఒకేసారి కష్టముల నుండి ముక్తి ఇప్పించునటువంటి కసాయి ఖానాలు గూడా లేవు మనకున్నట్టు. ఇంతకూ మనమే నయము!! ఇది విని తెల్ల ఎద్దు తెలతెలబోయెను.

*(శతజయంతి సంవత్సరం సందర్భంగా కాళోజీ నారాయణరావుకు ప్రత్యేక నివాళి)* V

తొలి ఆధునిక తమిళ కథ

- వ.వే.సు. అయ్యర్

# గుంటకట్టి
## రాగిమాను చెప్పిన కథ

చూడడానికి నేను మానునే. కానీ నా మనసులో ఉన్నదంతా చెప్పాలంటే ఈ పొద్దంతా చెప్పినా తీరదు. ఈ బతుకులోనే కళ్లారా ఎన్నిటిని చూసి ఉండానో! చెవులారా ఎన్నిటిని విని ఉండానో! మీ అవ్వలకు అవ్వలు దోగాడతా ఆడుకొనడాన్ని కూడా ఈ కళ్లారా చూసి ఉండాను. నవ్వతుండారు కదూ.. నేను చెప్పేదాంట్లో ఆవగింజంతయినా పొల్లు లేదు. ఇప్పుడు నాకు తొంబయ్యో.. నూరో.. ఏళ్లు ఉంటాయి. మీ నానమ్మల అవ్వలందరూ మన గుంటకట్టకాడకీ తరచుగా వచ్చేవాళ్లు. కొందరు బిడ్డల్ని కూడా వెంటబెట్టుకొని వచ్చేవాళ్లు. ఆ బిడ్డల్ని కట్టమీద వదిలేసి, కోకలను ఉతుక్కుని, పసుపు పూసుకొంటూ ముచ్చటగా మునకలు ముగించేవాళ్లు. బిడ్డలందరూ బాలగోపాలుడిలాగా దోగాడతా మల్లె గుబురు దగ్గరకు పోయి మల్లెమొగ్గల్ని చూసి నవ్వేవాళ్లు. ఆనాళ్లలో ఒక పొగడ మల్లె చెట్టు ముత్తెపు పువ్వులను పూస్తా ఆ అంచున ఉండేది.

గుంటకట్టంతా గుమ్మని గుమాళించిపోతుండేది. ఇప్పుడు ఆదుకొనేవాళ్లు లేక ఎండిపోయింది. కొందరు పెద్దబిడ్డలు దాని పువ్వులను ఏరుకొని ఆబగా వాసన చూస్తుండేవాళ్ళు... హుఁ! ఆనాళ్లనంతా తలుచుకొంటుంటే ఆశగా ఉంది! అయితే ఇప్పుడు నేను మీకు ఆ కాలపు కతలను ఏమీ చెప్పేటట్టుగా లేను. మనసు ఆనందంగా ఉన్నప్పుడు చెప్తాను. ఏడెనిమిది నాళ్లుగా నాకు రుక్మిణి తలపులే గుర్తుకు వస్తుండాయి.

పదిహేనేళ్లు అయింది. కానీ నాకు నిన్న జరిగినట్టే ఉంది. మీలో ఒక్కరికి కూడా రుక్మిణి ఎవరో తెలియదు. చూడడానికి పసిడి బొమ్మలాగా ఉండేది బిడ్డ. ఆమె నగుమోమును తలచుకొంటుంటే ఆ బిడ్డే ఎదురుగా వచ్చి నిలబడినట్టుంది నాకు. ఆమె నుదుటి సొగసును ఈనాటి వరకూ చూస్తానే ఉండిపోయుండచ్చు. మాంచి పొడుగ్గా ఉండేది. ఆమె చేతులూ కాళ్లూ తామరతూడుల్లా నిడుపుగా ఉండేవి. ఆమె మేనో మల్లెపూవులాగా మెత్తగా ఉండేది. కానీ ఆమె అందమంతా కళ్లలోనే. ఎంత వెడల్పు! ఏమి తేట! ఏమి తెలివి! నలకలు లేని నీలపు నింగి గురుతుకొచ్చేది. ఆమె కళ్లను చూడగానే నల్లకలువలు నిండిన తేటనీటి వాగు గురుతుకొచ్చేది. చూపుల్లో ఎంత ప్రేమ! ఎంత ప్రీతి! సోమవార అమవసలలో దేవుని పూజకోసం వచ్చి నా చుట్టూ తిరిగేది. అప్పుడు ఆమె నన్ను చూసే చూపుల్లో ఉండే ప్రేమను ఏమని చెప్పేది! నా ఎండిన రెమ్మలు కూడా ప్రేమతో నిండిన ఆమె చూపు తగలతానే చిగురించేవి! అయ్యో, నా రుక్మిణి బంగారా! ఎప్పటికి చూడగలను ఇంక

## ఆధునిక తమిళ కథకు అతడే తండ్రి

తొలి ఆధునిక తమిళ కథను రాసిన వ.వే.సు. అయ్యరుగారి పూర్తిపేరు వరగనేరి వేంకటేశ సుబ్రమణ్య అయ్యర్. వీరు తిరుచిరాపల్లి జిల్లాలోని వరగనేరిలో వేంకటేశ అయ్యర్, కామాక్షమ్మలకు 1881 ఏప్రిల్ 2న జన్మించారు. అయ్యరుగారు వారి తల్లి నుండి తమిళంతో పాటు గ్రీకు, లాటిను, ఫ్రెంచి, ఆంగ్లం, సంస్కృత భాషలలో పాండిత్యం సంపాదించారు. ఆ యా భాషల్లోని కావ్యాలను చదివి వాటిపై ఆంగ్లంలో ఎన్నో వ్యాసాలను రాశారు. 1907లో బారిస్టరు చదువుకోసం లండన్‌కు వెళ్ళిన అయ్యర్‌గారు అక్కడ సావర్కర్ వంటి దేశ భక్తుల పరిచయంతో స్వాతంత్రోద్యమం వైపు ఆకర్షితులయ్యారు. చదువు పూర్తయినా కూడా బారిస్టరు పట్టా తీసుకోకుండా బ్రిటిషువారిని ఎదిరించి, తను ఫ్రెంచివారి ఆధీనంలోని పాండిచ్చేరికి చేరుకుని కార్యకలాపాలను కొనసాగించారు. మొదట అతివాదిగా ఉద్యమం సాగించినా క్రమంగా గాంధీ మార్గం పట్టారు. 1922లో తమిళ గురుకులాన్ని నెలకొల్పారు. 'బాలభారతి' తమిళ పత్రికకు 1924లో సంపాదకునిగా వ్యవహరించారు. తిరుక్కురళ్‌ను ఆంగ్లంలోకి అనువదించారు. 'మంగైయక్కరసి కాదల్' అనే కథల సంకలనమే తమిళంలో వచ్చిన తొలి కథల పుస్తకం. అందుకే తమిళ సాహితీలోకం వీరిని ఆధునిక తమిళకథకు తండ్రిగా పేర్కొంది. వ.వే.సు. అయ్యర్‌గారు చిన్నవయస్సులోనే 1925 జూన్ 4న కన్నుమూశారు.

**ఇదే తొలి కథ!**

ఇక ఈ కథ గురించి చెప్పాలంటే ఇది

నీవంటి బిడ్డని? రుక్మిణి పసితనం నుండి, చివరినాటి వరకూ, ఇక్కడకు రాని నాడే లేదు. అయిదారేళ్లప్పుడు అయితే ఎప్పుడూ ఇక్కడ్నే ఆటలాడుకొంటా ఉండేది. ఆ బిడ్డను చూడగానే జవిరి ఎత్తుకొని ముద్దు పెట్టాలని అనుకోని వాళ్లే లేరు, ఎంత అక్కర పని ఉండినా కూడా. మన వేణు గోపాలశాస్త్రి ఉండెనే, ఆయన తెల్లవారేసరికే మునకలు తీర్చుకొని, బిడ్డ చేతి నిండా మల్లెపూలు కోసిచ్చే పొయ్యేవాడు. మన ఆవుదూడలు ఎంత మొరటువయినా సరే, ఆమెను చూసిన వెంటనే మొరటుతనాన్నంతా వదిలేసి ఆ చిన్నారి చేతులతో నిమిరించుకోవాలని ఆమె పక్కనే కాచుకొని ఉండేవి. బిడ్డలంటే నాకు ఎప్పుడూ ఆశ. అందుకే ఆమె వచ్చిందంటే చాలు, మైమరచిపోయేదాన్ని.

ఆమె మీద రవంతయినా ఎండ పడనిచ్చేదాన్ని కాదు. ఆమె కొంచెం అటుగా ఉంటే కూడా నా చేతుల్ని చాపి ఆమెకు గొడుగు పట్టేదాన్ని. నా పెనిమిటి అయిన పొద్దుదేవర మొకాన్ని ఆశ తో, భయభక్తులతో దర్శనం చేసుకొన్నాక, నాకు బిడ్డ రుక్మిణి గురుతుకొచ్చేది. ఆమె రాకకోసం ఆబగా ఎదురు చూస్తా ఉండేదాన్ని. ఆమె రాగానే నాలో పట్టలేనంత ప్రేమ పొంగేది.

బిడ్డల్లో వేరిమి చూపకూడదు. అయితే ఇంకెవరు వచ్చినా నాకు ఆమె వచ్చినప్పుడు ఉన్నట్టుగా ఉండేది కాదు. నేను మట్టుకేనా? ఊర్లోని మిగిలిన బిడ్డలు కూడా ఆమె వచ్చినాకనే నిండయిన ప్రేమతో ఆటలాడేవాళ్లు. ఆమే వాళ్లల్లో రాణి. అందర్లో మంచి రూపసి. అప్పుడంతా ఆమె తండ్రి అయిన కామేశ్వరయ్యర్ మంచి స్థితిలో ఉండేవాడు. బిడ్డపైన ఆయనకు ఎంతో ప్రేమ. ఆమెకు ఏం చేయాలన్నా ఆయనకు అలసట అనేదే ఉండేది కాదు. అంగడి తెరువులో పట్టుగుడ్డలు కొత్తగా వచ్చుండేది చూస్తే చాలు. 'మన రుక్మిణి కట్టుకొంటే అందంగా ఉంటాది' అని వెంటనే కొని తెచ్చేసేవాడు. మేలిమి రవ్వలూ, కెంపులూ కలిపి ఆమెకు ఎన్నో నగలు చేయించినాడు. ఆమెకు పదేళ్ల ఈ

అయ్యరుగారి రెండోకథ. మొదటిది 'మంగైయ క్కరసి కాదల్'. అయితే తమిళ విమర్శకులు ఈ 'కుళత్తుంగళై అరసమరం చొన్న కద్రై (గుంటకట్ట రాగిమాను చెప్పిన కథ)'ను తమిళంలో తొలి చిరుకథ(కథానిక)గా గుర్తించారు. ఈ కథ 1908లో వచ్చింది. అంతకుముందే 1905లో తమిళ మహాకవి అయిన సుబ్రమణ్య భారతి గారు 'తులసీబాయి' అనే కథను రాశారు. వారిదే 'ఆరిల్ ఒరుపంగు' అనే కథ కూడా వచ్చింది. కానీ ఇవి ప్రయత్నాలు మాత్రమే అనీ, అయ్యరుగారి 'గుంటకట్ట రాగిమాను...' కథే తొలి కథ అనీ తమిళ విమర్శకులంతా ఒప్పుకున్నారు. అయితే 'మాలన్' అనే విమర్శకుడు 1884లో రవీంద్రనాథ్ ఠాగూర్ రాసిన 'ఘాటేర్ కథ' అనే బెంగాలీ కథను అనుసరించి రాసిన కథ అనీ, దాదాపుగా అనువాదంలా ఉన్న ఇది తొలి తమిళకథ కాదనీ మాలన్‌గారు వాదించారు. అయితే వీరి వాదం నిలబడలేదు.



వ.వే.సు.అయ్యర్

ఎందుకంటే అయ్యరుగారికి బెంగాలీ రాదు. ఘాటేర్ కథ 1914లో ఆంగ్లంలోకి అనువాదమయ్యింది. అయ్యరుగారి కథేమో 1908లోనే వచ్చింది. బెంగాలీ కథలో 'రేవు' ఒక అమ్మాయి గురించి చెబుతుంది. ఈ కథలో 'రాగిమాను' ఒక అమ్మాయి కథను చెబుతుంది. ఈ పోలిక ఉన్నంత మాత్రాన దీన్ని కాపీ కథ అనడం తగదనీ, పైగా ఘాటేర్ కథ ఆంగ్లానువాదం కంటే ఆరేండ్లు ముందుగానే ఈ కథ వచ్చిందనీ, అందుకే దీన్ని తొలి తమిళ కథగా గుర్తించాలని తమిళ విమర్శకులు కమలాలయన్‌గారు తేల్చిచెప్పారు. దీన్ని తమిళ సాహితీ లోకమంతా ఈ వాదాన్ని ఒప్పుకుంది.

– ఓట్ర పురుషోత్తం

డు అప్పుడు కోలాట పండగ కోసమని ఒక పావడనూ పైటనూ కొనిపెట్టినాడు. ఆ జాబిలికీ, ఆమె అలంకారానికీ, ఆమె అందానికీ ఎంత పోలిక! కన్నుల విందుగా ఉండేది నాకు! ఆమె గొంతును గురించి మీకు చెప్పడం మరిచినాను. కోయిల ఎందుకు పనికొస్తాది? పసిడి కమ్మి మోగినట్టు పలికేది ఆమె గొంతు. పొద్దంతా వింటుంటే కూడా విసుగు పుట్టదు. పండగలప్పుడే ఆమె పాటను నేను వినుండాను. ఇప్పుడు తలచుకొంటే కూడా ఆమె గొంతు అదే తియ్యదనంతో, కమ్మదనంతో నా మనస్సున వినబడుతుంది. ఆమెకు ఈడు పెరిగేకొలదీ పెరిగిన ఆమె సొబగును ఏమని చెప్పేది? పసిబిడ్డగా ఉన్నప్పుడే అందరితోనూ ఒద్దికగా ఉండేది.

ఆ గుణం నానాటికీ పెరగతా వచ్చింది. నేస్తరాళ్లు వేరు, తాను వేరు అనే తలపే ఆమెకు ఉండదు. లేనింటి పడుచయినా ఉన్నింటి పడుచయినా సరే, ఆమెకు నేస్తరాళ్లందరి మీదా ఒకటే కూరిమి. ఇంకా చెప్పాలంటే మిగిలినవాళ్లకంటే లేనింటి వాళ్లమీద ఎక్కువ ప్రేమ చూపించేది. అడుక్కొనేవాళ్లువస్తే దోసిలి నిండుగా బియ్యాన్ని తెచ్చి వేసేది. కళ్లు లొట్టలు పడిన బిచ్చగాళ్లను చూసి ఆమెకు తెలియకుండానే ఆమె కళ్లు నీళ్లతో నిండిపోవడాన్ని నేను చూసి ఉండాను! మిగిలిన వాళ్లకు వేసేదానికంటే వాళ్లకు ఎక్కువగా వేసేది. ఇట్ట ఎంతో జాలీ, దయా కలిగిన ఆమెను తలచుకొనేటప్పుడంతా నాకు కరుకయిన ఎండాకాలాన్ని దాటుకొన్నాక, మంచి వాన కురిసేటప్పుడు కలుగుతుందే అట్టాంటి వెలకట్టలేని ప్రేమ కలుగుతుంది.

ఇట్ట కంటికి కన్నుగా నేను చూసుకొంటా వచ్చిన నా గారాల బిడ్డ గతి ఇట్ట అయిపోవాల్నా! నేను పాపిని. పెట్టుకొన్న ఆశలన్నీ మట్టికొట్టుకుపోవాల్నా! బమ్మదేవుడికి కొంచెం కూడా కనికరం లేకుండా పోయిందే! అయినా బమ్మదేవుడు ఏమి చేస్తాడు, మనుషులు చేసే ఆగడాలకు? రుక్మిణికి పన్నెండేళ్లు నిండేసరికి ఆమె నాయన ఆమెను మన మణేగారయిన రామస్వామి అయ్యర్ కొడుక్కు ఇచ్చి కట్ట

బెట్టేసినాడు. పెళ్లి చాలాగొప్పగా జరిగింది. తోడుపొంగలి(ప్రదానం)నాడూ, మెరవణీ (ఊరేగింపు) నాడు ఆమె రాకను చూసి నాను. కళ్లు చెదిరిపోయినాయి. అంత అందంగా ఉండింది. చెలికత్తెల నడుమన ఉండిన ఆమెను చూసినప్పుడు, మెరుపు తీగలు ఊడిగం చేస్తుంటే మెరుపురాణి మెరుస్తున్నట్టుగా ఉండింది. కామేశ్వర య్యరు పెళ్లిపందిరిలో రుక్మిణికి చేయా ల్సిన సాంగేలన్నీ(వేడుకలు) చేసినాడు.

రుక్మిణి అత్తగారూ మామగారూ ఎంత తనివి పడినారు. పెళ్లి అయినాక అత్త గారు అప్పుడప్పుడూ రుక్మిణిని తోడుకొని పోయి ఇంట్లోనే పెట్టుకొనేది. ఆమెకు జడ వేసి పూలుపెట్టి తనివితీరా చూసుకొనేది. తమ చుట్టాలను చూడడానికి పోయేటప్పు డు రుక్మిణిని వెంటబెట్టుకోకుండా పొయ్యే ది కాదు. ఇట్ట అన్ని తీరులుగా జానకి (రుక్మిణి అత్తగారిపేరు), రుక్మిణి మీద తనకుండే ముచ్చటనంతా చూపించేది. అల్లుడు నాగరాజన్ మంచి తెలివిపరుడు. అతను కూడా రుక్మిణిమీద ఎంతో మక్కు వగా ఉండేవాడు. ఆ ఊరిలో వాళ్లిద్దరే రూపులోనూ, తెలివిలోనూ, గుణంలోనూ సరైన జంట అని అనుకోని, మాట్లాడుకోని వాళ్లేలేరు. ఇట్ట ఒక ఏడాది గడిచింది. ఆ

ఏడాదిలోనే ఎన్ని మార్పులు!

కామేశ్వరయ్యరు చెయ్యి కిందికి వచ్చేసింది. రొక్కాన్నంతా, ఏదో అరవైనాళ్ల కంపెనీ అంట, దాంట్లో వడ్డీకోసం వేసినాడు. మన అయ్యరు డబ్బులు నాలుగు కోట్ల రూపాయిల్నీ మింగేసి అరిగించేసుకోవడంతో, కామేశ్వరయ్యరు ఒక్కసారిగా లేనోడు అయిపోయినాడు. రుక్మిణి తల్లి మీనాక్షమ్మ ఒంటిమీద నగలు మట్టుకే మిగిలినాయి. పెద్దలు గడించి ఇచ్చిపోయిన ఇంటినీ, పొలాల్నీ అమ్మి ఆయన అప్పుల్ని తీర్చాల్సి వచ్చింది. ఇప్పుడు కుప్పుసామి ఆయ్యరు ఉంటాడే కాలవ గట్టు, అందునా ఆ ఇంట్లోకి కాపురం వచ్చి చేరినారు. మీ నాక్షి కూడా చూడడానికి మహాలక్ష్మిలాగా ఉంటుంది. ఆమె శాంతానికి ఎల్లలే లేవు. ఎంత పెద్ద ఇక్కట్టు వచ్చేసింది. అయినా ఆమె మనస్సు కొంచెమయినా చెదరలేదు.

"ఏదో ఇన్నాళ్ళూ బతికినాము. ఎవర్ని అడిగి ఇచ్చినాడు ఆ పైవాడు. ఆయన ఇచ్చినదాన్ని ఆయనే తీసుకొన్నాడు. ఆయనా, రుక్మిణీ ఉన్నంతవరకూ నాకు కొదవ ఏమీ ఉండదు. ఈ తై (పుష్య) నెలలో రుక్మిణికి అక్కర చేసేసి(సారె పెట్టేసి) అత్తగారింటికి పంపించేస్తే ఇంక మాకు దిగుల్లేదు. సద్దో, అంబలో తాగి ఎప్పటిమాదిరిగానే ఆ పైవాడిని తలచుకొంటూ గడిపేస్తాము" అని చెప్పేది మీనాక్షి.

అయ్యో పాపం, ఆమెకు మట్టుకు జరగబొయ్యేది ఏం తెలుసు? కామేశ్వరయ్యరు దగ్గర నుండి కొంచెమయినా రాదు అని తెలస్తానే రామస్వామి అయ్యరు ఆయనకు దూరం కాసాగినాడు. ఇది వరకు ఆయన అప్పుడప్పుడూ కామేశ్వరయ్యరు ఇంటికి వస్తా పోతా ఉండేవాడు. ఆయన్ని దోవలో ఎక్కడయినా చూస్తే పది నిమిషాలయినా మాట్లాడకుండా పోయేవాడు కాదు. ఇప్పుడేమో కామేశ్వరయ్యరు దూరంగా వస్తుండడం కనబడగానే, ఏదో అవసరమయిన పని మీద పోయేవాడిలాగా ఇంకొక పక్కకు తిరుక్కొని బిరబిరా పోతుండాడు. ఇట్ట చేసేవాడు, వాళ్ల ఇంటికి రాకపోకలను

కూడా నిలిపేసినాడని నేను చెప్పకుండానే మీకు తెలిసిపోయి ఉంటుంది. ఆయన పెండ్లాము జానకి కూడా అదే మాదిరిగా మీనాక్షమ్మ దగ్గరకు రావడం నిలిపేసింది. అయితే మీనాక్షమ్మా కామేశ్వరయ్యరూ దీనిని పెద్దగా పట్టించుకోలేదు. సంపద ఉన్నప్పుడు చుట్టంగా చేరడం, అది లేకుండా పోయినప్పుడు బయటవాళ్ళలాగా జారుకోవడం... దీన్నంతా కూడా స్నేహ మనాల్నా? అయితే వాళ్లు రుక్మిణి పట్ల కూడా పట్టనట్టు ఉండసాగినారు. ఆ అర వైనాళ్ల కంపెనీ ముంచడానికి ముందు అయితే కొన్ని నెలలుగా ప్రతి శుక్రవా రమూ రుక్మిణిని తోడుకొని రమ్మని తమ పనిమనిషిని పంపేది జానకి. ఆ పొద్దు రుక్మిణికి జడ వేసి, మేనంతా చందనం రాసి సింగారించి, అఖిలాండేశ్వరి గుడికి పంపించేది.

అరవై నాళ్ల కంపెనీలో మునిగిపో యింది తెలిసినాక వచ్చిన మొదటి శుక్ర వారంనాడు 'ఈ పొద్దు నాకు ఇంట్లో పనుంది' అని చెప్పి పంపించింది జానకి. ఆ తరువాత అట్ట చెప్పి పంపడం కూడా తెలీదు. ఇదంతా చూస్తుంటే మీనాక్షికీ, కామేశ్వరయ్యరుకూ ఏడుపు పొంగి వచ్చింది. రుక్మిణి కూడా మన అత్తగారు మనల్ని ఇంతగా పక్కకు నెట్టేసిందే అని వెత పడింది. ఇట్ట కొన్నాళ్లు గడిచినాయి. ఊర్లో వాళ్లంతా గుసగుసగా మాట్లాడు కుంటూ ఉండారు. ఆ గుసగుసలన్నీ ఈ గుంటకట్ట దగ్గరే. అరమాట కొరమాటగా నా చెవిన పడతాయి తప్ప ఏ మాటా మొత్తంగా నాకు చేరడం లేదు. ఊర్లో ఎప్పుడూ ఇట్ట ఉండింది లే దు. నా మ నసు కలతగా ఉంది. ఈ గుస గుసలన్నీ జరగబోయే ఏదో చెడుకు ఆనవాళ్లు అని నాకు అప్పుడే అనిపించింది. అయితే ఆ చెడు ఎవరికి జరగబోతోందో తెలియలేదు.

చివరకు అటూ ఇటూగా దా న్ని దీన్ని ఒక టిగా కలిపి చూడగా చూడ గా కొద్దికొద్దిగా నాకు తేటపడింది. రామస్వామి అయ్యరూ జానకీ కలిసి రుక్మిణిని పక్కకు పెట్టేసి నాగరాజన్‌కు ఇంకొక పెళ్లి చేయాలని తీర్మానానికి వచ్చినారు. ఏమి చేసేది? నా హృదయమే పగిలిపోయింది.

బిడ్డ రుక్మిణిని పక్కకు పెట్టడానికి ఎవ రికయినా తెగింపు వస్తుందా? అయ్యో పాపీ! నీ మాదిరిగానే ఆమె కూడా ఒక ఆడదే కదా! అది నిన్ను ఏమి చేసింది? దానిని కంటితో చూస్తే రాయి అయినా మెత్తబడుతుందే! నీ గుండె రాతికన్నా గట్టిదా! కామేశ్వరయ్యరుకూ, మీనాక్షికీ మొ కాలు వెలవెలపోయి ఉండాయి. నాకే ఇట్ట ఉంటే కన్న తల్లిదండ్రులకు ఎట్టుండాల? ఇంక నమ్మకం పెట్టుకోవడానికి మిగిలింది ఆ నాగరాజన్ ఒక్కడే. అతను పేటలో చదువుతా ఉండినాడు. పండగ నెల పట్టే సింది. అతను ఎప్పుడొస్తాడా అని నాళ్లను లెక్కపెడతా ఉండినాను. చివరకు వచ్చి చేరినాడు. వచ్చినప్పుడు మట్టుకే అతని మొకంలో చిరునవ్వు చిందేసింది. తరు వాత ఆ ఆనందం మారి వేరయిపో యింది. తల్లీ తండ్రీ అతని మనస్సుని చెడ గొట్టడం మొదలుపెట్టేసినారు. నానాటికీ మొకంలో కలత ఎక్కువవుతా వచ్చింది. కరిగించేవాడు కరిగించితే రాయి అయినా కరుగును అంటారే.. కలత పడిన అతని మొకాన్ని చూసినప్పుడల్లా నా కడుపు మం డిపోయింది. ఇంక ఏం మిగిలింది? ఈ ఒక్క ఆశ ఉండేది. అది కూడా పోయిం ది. రుక్మిణి గతి అధోగతి అని అనుకున్నా ను. తై (పుష్యం) నెల వచ్చేసింది. బయ టకే మాట్లాడుకోవడం మొదలుపెట్టేసి నారు. ఎవరో దిగువపక్క పడుచు అంట. ఆమె తండ్రికి నాలుగు లక్షల సొత్తు ఉందంట. కొడుకులు లేరంట. ఈ పడు చు తరువాత చాలా ఏళ్ల ఎడంతో ఇంకొక కూతురుందంట. రామస్వామి అయ్యరు

కుటుంబానికి రెం డు లక్షల రూపాయల సొత్తు చేరిపోతుందంట. ఈ మాటలన్నీ నా చెవుల్లో చీల ల్లాగా దిగినాయి. కానీ ఏమి చేసేది? తలరాత అనుకొని వింటా ఉండిపోయినాను. ఈ మాట పుట్టినప్పటి నుండీ వెలుతురు పొద్దులో మీనాక్షి బయ టకు రావడమే లేదు. పొద్దు పుట్టడానికి ముందుగానే గుంటకాడకు వచ్చి మునిగేసి నీళ్ళు ముంచుకొని పొయ్యేది. ఆమె మొకాన్ని చూస్తే కలకబారి ఉండేది.

సరయిన కునుకు ఎక్కడిది? కూడు ఎక్కడిది? ఓహో అని గొప్పగా బతికేసి, ఈ పాటుకు గురయినామే అనే దిగులు ఆమె చక్కదనాన్ని చెరిపేసింది. ఇల్లూ వాకిలీ పోయిందనో, నగా నట్రంతా చేజా రి వట్టి పసుపుతాడు మట్టుకే మిగిలిందనో ఆమె వెత పడింది లేదు. చిలకలాంటి పడుచు ఇంట్లో ఉంటే దాని మీద కొంచె మయినా జాలి చూపించకుండా జానకి తన కొడుక్కి ఇంకొక పెళ్లి చేయాలని అనుకొనిందే అని రేయి పగలూ కుమ లతా ఉంది.

ఆమె మొకాన్ని చూస్తే జానకికి కూడా మనస్సు కరిగిపోతాది. కానీ రాణిలాంటి ఆమె ఎందుకు చూస్తాది. అప్పుడు రుక్మిణి ఎట్ట ఉండేదో ఏమి తలచుకునేదో నాకేమీ తెలియదు. ఏమీ ఎరగని బిడ్డ, ఏమి తల చుకొని ఉంటుందో! ఒకవేళ అత్తగారు తనను బొత్తిగా పక్కకు నెట్టెయ్యదులే అనుకొని ఉంటుందా? లేకపోతే అత్తగారి మాటలను నాగరాజన్ ఒప్పుకోడులే అను కొని ఉంటుందా? ఇంకా అయిదేళ్లయినా నిండలేదే. వాళ్లిద్దరూ జంటగా మన గుంటకట్ట మీద ఆటలాడి! పెళ్లి అయినాక కూడా ఎవరికీ తెలియకుండా ఎన్నిసార్లు ముందు మాదిరి గానే ప్రేమతో నాగరా జన్ ఆమెతో మాట్లాడి ఉండాడు! అతను తన చెయ్యి విడువడనే అనుకొని ఉంటుంది రుక్మిణి. అయితే రోజులు గ డుస్తున్న కొద్దీ నాగరాజన్ పెళ్లి మాట ముదరతా వచ్చింది. నాగరాజు మనసులో ఏముందనేది మట్టుకు ఎవరికీ తెలియదు. పేట నుండి వచ్చిన నాడు, మామగారికీ అత్తగారికీ మొక్కడానికి వచ్చినాడు అంతే. మరలా అతను రుక్మిణిని తలచుకొని ఉంటాడనడానికి ఆవగింజంత అయినా ఆనవాలు లేదు. అయితే మొదటినాడు అతని మోము నుంచి మరుగయిన ఉల్లా సపు నవ్వు గురుతు మరలా తిరిగి రానే లేదు. ఎవరితోనూ మాట్లాడకుండా ఎప్పు డూ మొకం మాడ్చుకొని ఉండేవాడు. చివ రకు లగ్గం పెట్టుకొనేసినారు. పడుచు ఇంటివాళ్లు వచ్చి లగ్నపత్రికను చదివేసిపో యినారు. అయ్యో! ఆ పొద్దు మేళాల చప్పుడు విని నా అయిదూపిర్లూ అల్లాడి పోయినాయి. కామేశ్వరయ్యరుకు ఎట్ట ఉం డుంటుందో? మీనాక్షి గుండె ఎట్ట కొట్టు కొని ఉంటుం దో? రుక్మిణి ఎట్ట ఓర్చుకొ నిందో? అంతా పైవాడికే తెలిసుండాలి.

నాగరాజన్‌కు కూడా రవంతయినా జాలీ కనికరమూ లేకుండా పోయిందే అని నేను ఏడవని పొద్దు లేదు. కొన్నేసిసార్లు, ఇట్టంతా చేస్తే వీడు మటుకు బాగుపడ తాడా అని అనుకొనేదాన్ని... ఇట్ట నా మ నస్సు తడబడి అల్లాడుతుండగా ఒకనాడు, నా కడుపులో పాలుపోసినట్టుగా ఒక

మాట నా చెవిన పడింది. నాగరాజన్‌తో పాటు చదివిన శ్రీనివాసన్ అనే చిన్నోడు నాగరాజన్‌ను చూడడానికి వచ్చినాడు. వాళ్లు గుట్టుగా మాట్లాడుకోవడానికి వేరే చోటు ఎక్కడుంది? మన గుంటకట్టే కదా. ఒకనాడు పొద్దువాలినాక ఏడెనిమిది గంట లప్పుడు అందరూ పొయ్యేసినాక వీళ్లిద్దరూ ఇక్కడకు వచ్చినారు.

శ్రీనివాసన్ చాలా మంచోడు. వాళ్ల ఊరు ఏబయి అరవయి రాళ్ల (మైళ్ల)కు అవతల ఉంది. పెళ్లాం ఉండగానే ఇంకొక పడుచుని నాగరాజు పెళ్లాడబోతుండాడని అతనికి ఎవరో రాసినట్టు ఉండారు. వెంటనే తపాల బండి మాదిరిగా పరిగెత్తి వచ్చేసినాడు. గుంట కట్ట దగ్గరకు వస్తానే, తను వినింది చెప్పి, అదంతా నిజమేనా అని నాగరాజుని అడిగినాడు అతను.

"అమ్మానాయనా కలసి తీర్మానించేసి నాక నేను కాదంటే మట్టుకు చెల్లతాదా? అదీకాక ఆ పడుచు లక్షణంగా ఉందంట. వాళ్ల నాయన లక్ష రూపాయల సొత్తును ఆమె పేరున రాసిపెట్టి ఉండాడంట. తరువాత ఇంకొక లక్షసొత్తు కూడా వస్తుందంట. సిరి వస్తుంటే కాలు అడ్డం పెట్టడం ఎందుకు? " అన్నాడు నాగరాజు.

ఈ మాటలను వినేటప్పుడు శ్రీనివాసన్ మొకం పోయిన పోకడను ఏమని చెప్పేది? నాగరాజన్ నిలపగానే శ్రీనివాసన్ అందుకొన్నాడు.

"ఎన్ని లక్షలు వచ్చినా, ఒక పడుచు పాపాన్ని తలకు పోసుకోవాల్నా? పెళ్లిపందిరిలో మంత్రరూపాన చేసిన ప్రమాణాలను మీరతావా? " అంటూ ఎన్నో తీరులుగా న్యాయాన్నీ, ధర్మాన్నీ ఎత్తిచెప్పి, రాయి కూడా కరిగేటట్టు రుక్మిణికోసం గొంతు కోసుకొని మాట్లాడినాడు. 'అతను చల్లగా ఉండాల, మంచిగా ఉండాల, ఏ కొరతా లేకుండా బతకాల' అని అడుగడుగునా నేను అనుకొంటా ఉండినాను. అతను మాట్లాడతానే నాగరాజన్ అతన్ని చూసి-

"శ్రీనివాసా, ఇంతవరకూ నీతో చెప్పినదంతా ఆటపట్టించడానికే. డబ్బుకోసం నేను ఇంత ఆశ పడతానని అనుకొన్నావా? నా లోపలుండేది ఎవరికీ తెలియకుండా గుట్టుగా పెట్టుకొని ఉండాల అనుకొన్నాను. నువ్వు ఇంత దూరం మాట్లాడేసినాక నీ దగ్గర దాపరికం ఉండకూడదు. కానీ దీన్ని నువ్వు ఎవరితోనూ చెప్పకూడదు. వీళ్లంతా తమ పెద్దరికాన్ని వదిలేసి ఇంత కుచ్చితంగా నడుచుకొంటా ఉండేది చూసి వీళ్లకు బాగా తలొంపులు తేవాలని తీర్మానించుకొన్నాను. నేను ఎంతగా వద్దని చెప్పినా మా అమ్మా నాయనా ఒకే పిడివాదంగా ఉండారు. అందుకనే నేను మన్నారు కోయిలుకు పోతాను. అక్కడికి పోయినా ఏమీ కాదు అనే చెపుతుండాను. కానీ బలవంతం చేస్తారు. పెళ్లి పందిట్లో కూచుంటాను. ఏమయినా నేనే కదా పుస్తె తాడును ముడెయ్యాల? ఇంకొకరు ఎవరూ వేయలేరు కదా. అప్పుడు వీలుపడదు అని తెగ్గొట్టి చెప్పేస్తాను. అందరూ మిరపకాయను కొరికిన కోతి మాదిరిగా ఎగురుతారు. రుక్మిణిని తాకిన చేతులతో ఇంకొక పడుచును తాకుతానని అనుకొంటుండావా? " అని చెప్పినాడు.

"కానీ నువ్వు పెళ్లికని పోయేటప్పుడు, రుక్మిణికీ వాళ్ల అమ్మా నాయనకూ మనస్సంతా ఎట్టుంటుందో తలపోసినావా? " అని శ్రీనివాసన్ అడిగినాడు.

దానికి నాగరాజన్ "తలపోసినాను. అయితే, అంతా అయిపోయిందని వాళ్లు వేసటతో అల్లాడుతుండేటప్పుడు నేను గబాలని పరిగెత్తి వచ్చి అత్తామామలకు దండం పెట్టి, వెతపడొద్దండీ! నా రుక్మిణిని ఎన్నటికీ వదలను. డబ్బాశ పట్టినోళ్లు అందరికీ పెళ్లి పందిట్లో తలొంపులు చేసేసి ఇక్కడికి వచ్చేసినాను అని అంటుంటే వాళ్లకు ఎంత ఆనందంగా ఉంటుంది. ఆ సంతోషాన్ని

చూడాలనే ఇట్ల చేస్తుండాను" అన్నాడు.

"అప్పటి వరకూ వాళ్ల మనసు ఎట్ల కొట్టుకొంటుందో తలచి చూడు" అన్నాడు శ్రీనివాసన్.

"ఇంక అయిదునాళ్లయినా లేదు. ఈ పొద్దు శుక్రవారం. ఆదివారం నాడు ఇక్కడి నుండి అందరమూ బయలుదేరుతాము. ఆ మరునాడే పెళ్లి. ఆ పొద్దే అక్కడినుండి బయలుదేరి మరునాటి తెల్లవారికి ఇక్కడకు వచ్చేస్తాను. అన్నాళ్లు ఓర్చుకోలేరా? " చెప్పినాడు నాగరాజన్.

"ఏమోరా అబ్బా. ఇది సరిగా లేదు అని పిస్తా ఉంది నాకు" అని శ్రీనివాసన్ అంటా ఉండగానే ఇద్దరూ నడవడం మొదలుపెట్టినారు. ఆపైన నాకు ఏమీ వినిపించలేదు. ఆ రెయ్యంతా నాకు కునుకే పట్ట లేదు. 'చూసినావా నాగరాజ్‌ని తిట్టని

అనువాదం :

**ఓట్ర పురుషోత్తం**

తిట్టు తిట్టకుండా తిట్టినావే పాపీ. అతనంత మంచోడు ఈ లోకాన ఉండాడా' అని నన్ను నేనే తిట్టుకొన్నాను. ఇంక దిగులు లేదు. అయిదునాళ్లయితే ఏమి? పదినాళ్లయితే ఏమి? నాగరాజన్ పట్టు వదలనివాడు. చెప్పినట్టుగానే చేసేస్తాడు. ఇంక రుక్మిణికి ఏ కొదవా లేదు అనుకొని కుదుటపడినాను.

ఆదివారం నాడు వీళ్లంతా మన్నారు కోయిల్‌కు బయలుదేరబోతున్నారని తెలుసుకొన్న ఊరంతా అల్లకల్లోలం పడింది. రామస్వామి అయ్యరునూ, జానకినీ తిట్టుకోని వాళ్లే లేరు. కానీ వాళ్లను పిలిచి ఎదురుగా నాలుగు మంచిమాటలు చెప్పేవాళ్లు మటుకు ఎవరూ లేకపోయినారు. అట్ల ఎవరయినా చెప్పినా వాళ్లు కట్టుబడేవాళ్లు కూడా కాదు లేండి. వాళ్లు బయలుదేరేటప్పుడు ఊర్లోనే ఉండి కంటితో చూస్తే కడుపుమంట ఇంకా ఎక్కువ అవుతుందని అనుకొన్న కామేశ్వరయ్యారూ, మీనాక్షమ్మా శనివారం నడిపొద్దులోనే బయలుదేరి మనపారైకు పొయ్యేసినారు. ఇంట్లో రుక్మిణికి ఆమె మేనత్త సుబ్బులక్ష్మి తోడుగా ఉంది. శనివారం మాపు (సాయంత్రం) అయింది. ఊరు మెల్లమెల్లగా అణగతా ఉంది.

గంట తొమ్మిదీ తొమ్మిదిన్నర అయి ఉండచ్చు. నాగరాజన్ ఒంటరిగా గుంట కట్ట దగ్గరకు వచ్చినాడు. వచ్చి వేపమాను కింద కూచుని ఏదో తలపోస్తా ఉండాడు. కాసేపటికి దూరంగా ఒక ఆడకూతురి రూపు కనిపించింది. ఆ రూపు గుంటకట్ట దగ్గరకే వస్తా ఉంది. అయితే అడుగుకొకసారి ఆగి వెనక్కి తిరిగి చూసుకొంటా వచ్చింది. చివరకు నాగరాజు కూచుని ఉండే చోటుకు వచ్చి నిలబడినప్పుడే ఆ రూపు రుక్మిణిదని నేను తెలుసుకొన్నాను. వెంటనే ఏమి జరగబోతోందో చూద్దామని కన్నులు తుడుచుకొని ఒన్నిం పు (ఏకాగ్రత)గా చూడసాగినాను. అయి దు నిమిషాల వరకూ నాగరాజన్ రుక్మిణిని చూసినాడు. చూస్తానే కొయ్యబారిపోయినాడు. వెంటనే తేరుకొని-

"రుక్మిణీ ఈ పొద్దులో, పైగా ఒంటరిగా నువ్వు రావచ్చా? " అని అడిగినాడు.

"మీరు ఉండే చోటులో నేను ఒంటరిని ఎందుకవుతాను" అని మారుపలికింది రుక్మిణి. రెండు మూడు నిమిషాల వరకూ ఎవరూ నోరు తెరవలేదు.

చివరికి నాగరాజన్ "ఈ పొద్దులో మనం ఇక్కడ ఉండేది తెలిస్తే ఊరివాళ్లు ఏదేదో చెప్పుకొంటారు. రా, ఇంటికి పోదాం" అన్నాడు.

అప్పుడు రుక్మిణి "మీతో నాలుగు మాటలు చెప్పుకోవడానికి అనుమతి ఇవ్వండి" అనింది.

నాగరాజన్ "చెప్పు" అనగానే రుక్మిణి మొదలు పెట్టింది. "మీ దగ్గర ఏం చెప్పు కోవాల్నో కూడా నాకు తెలియడం లేదు. ఈ మూడు నెలలుగా నా మనస్సు పడే పాటు ఆ అఖిలాండేశ్వరికే తెలుసు తప్ప మనుషులకు తెలియదు. పేట నుండి మీ రు వస్తానే నా కలతలన్నీ తీరిపోతాయని అనుకొన్నాను. అత్తగారూ, మామగారు ఏమి చేసినా మీరు మట్టుకు నా చేయిని విడువరని నమ్ముకొని ఉండినాను. కానీ మీరు కూడా నన్ను వదిలేస్తే ఇంక ఎవ రిని నమ్ముకొని బతికేది? కంచే చేనును మేస్తే ఆ చేను గతి ఏమయ్యేది? ఇప్పటి వరకూ జరిగినదంతా నా హృదయాన్ని విరిచేసింది. మీరే దానిని అతికించాలి. లే కపోతే నా బతుకు అంతే. అందులో అను మానమే లేదు" ఈ మాటల్ని అనేటప్పుడు రుక్మిణి కళ్లలో నుండి నీళ్లు కారినాయి.

ఈ నాలుగు మాటలనూ అని నిలి పింది. నాగరాజన్ ఏమీ మాట్లాడలేదు. కాసేపు ఎదురు చూసిన రుక్మిణే మరలా నోరువిప్పి "రేపే మీ పయనం పెట్టుకొ న్నట్టు ఉండారు. మీరు పోతుండారు కదా? " అని అడిగింది.

నాగరాజన్ కాసేపు ఆలోచించి "అవు ను. పోదామనే అనుకొంటుండాను" అన్నా డు. అతను అట్ట అంటానే రుక్మిణికి ఏడు పు ఉబికి వచ్చింది. ఒళ్లంతా గడగడ వణి కింది. కళ్లు నీళ్లతో నిండిపోయినాయి. కానీ బయటకు రానీయకుండా పళ్ల బిగు వున అదిమి "అయితే మీరు నా చెయ్యి విడిచేసినారు కదా? " అని అడిగింది.

అందుకు నాగరాజన్ "రుక్మిణీ! నేను నీ చేతిని విడవడమా? ఒక్కనాటికీ జరగదు. కానీ అమ్మానాయనలను తృప్తిపరచడం కూడా నా గడమ (బాధ్యత) కదా? అయి నా నువ్వు దిగులు పడొద్దు, నిన్ను ఎన్న టికీ వదలను" అన్నాడు.

రుక్మిణి తట్టుకోలేకపోయింది. "మీరు ఇంకొక పెళ్లి చేసుకోవడం, నేను దిగులుప డకుండా ఉండడం- ఎన్నటికీ నా చేయిని విడవరు. కానీ మీ అమ్మా నాయనా చెప్పే వాటి నుండి తప్పుకోరు. నేను చెప్పగలి గింది ఇంక ఏముంటుంది? నా గతి ఇంతేనేమో" అంటా అట్నే కూచునింది.

నాగరాజన్ ఏమీ మాట్లాడడం లేదు. పెళ్లిని ఆపేస్తాను అనే మాట ఒక్కటి త ప్ప ఇంకే మాటను చెప్పి రుక్మిణి మనస్సు కి ఓదార్పును ఇవ్వగలడు? ఆ మాటను అనడానికి అతను ఇష్టపడడం లేదు. అం దుకే అతను నోరు తెరిచి ఏమీ మాట్లాడ కుండా తన గుండెల్లోని ప్రేమనూ ఆదర వునూ చేతాకిడితో మట్టుకే చూపించినా డు. ఆమె చేతిని తన చేతులతో తీసుకొని ఒడిలో పెట్టుకొని సుతిమెత్తగా పట్టుకొ న్నాడు. పసిబిడ్డను తట్టి ఓదార్చినట్టుగా ఆ మె భుజాన్ని ప్రేమగా తడిమినాడు. అ ప్పుడు ఆమె తలవెంట్రుకలు అతని చేతికి తగిలినాయి. వెంటనే ఆశ్చర్య పోతా -

"ఏమిటి రుక్మిణి, తల ఇట్ట అట్టకట్టుకొని పోయిందే. ఇట్నేనా చేసుకొనేది? నిన్ను ఈ వాలకంలో చూడాలంటే నా మనస్సు ఒప్పుకోవడం లేదే! ఏదీ నీ మొకాన్ని చూ పించు. అయ్యో! కళ్లంతా ఎర్రబారిపోయి ఉండాయే! మొకంలోని మెరుపంతా మరు గయిపోయిందే! నా కన్నువంటి దానివే, ఇట్ట ఉండద్దు. నిన్ను నేను వదిలిపెట్టను అనేది సత్తెంగా నమ్ము. కొంచెం కూడా ది గులు పెట్టుకోవద్దు. నేను నిండు గుండెతో చెబుతుండాను. నిన్ను ఈ నిలవరం (పరి స్థితి)లో చూడలేకపోతుండాను నేను. చిన్నప్పటి నుండీ మన నడుమ ఉండిన ఒద్దికను మరిచిపోయినానని కలలో కూడా అనుకోవద్దు. బాగా పొద్దుపో యింది. రా పోదాం. మనం ఇంకా ఇక్కడ ఉండకూడదు" అంటూ ఓదార్చినాడు.

రుక్మిణి పైకి లేవనేలేదు. మూగనోము పట్టిన దాని మాదిరిగా కూచునే ఉంది.

అది చూసి నాగరాజన్ కళ్లు నీళ్లతో నిండి పోయినాయి. అప్పుడు తన లోపల దాచు కొన్న ఆ గుట్టును ఆమెతో చెప్పేద్దామని అతనికి అనిపించినట్టుగా ఉంది. పాపి, చెప్పేసి ఉండచ్చు కదా! కానీ అతనికి అత ని ఆటే పెద్దదిగా అనిపించింది. అందుకనే ఆ గుట్టును బయటపెట్టనే లేదు అతను. కానీ ఈ మాదిరిగా జరగతాదని అతను మటుకు ఎందుకు అనుకొని ఉంటాడు? ఇంత ఈడు పైన బడిన నాకే తెలియలేదే. ఆ పొద్దులో అతనికి మటుకు ఎట్ట తెలి సుంటాది? అట్నే దిగులుగా కూచుని ఉండిన రుక్మిణిని నాగరాజన్ మెల్లగా పువ్వును లేపినట్టుగా పైకిలేపి గుండెలకు అదుముకొని-

"ఏమిటి, ఏమీ మాట్లాడనంటున్నావే రుక్మిణీ, నేనేమి చేసేది? " అని కనికరంతో జాలిగా అన్నాడు.

రుక్మిణి తన తలను లేపి అతనిని కళ్లెత్తి చూసింది. ఆ చూపుల్లోని వేడుకోలును మీ కు ఎట్ట చెప్పేది? వెల్లువలో చిక్కుకొని ఏటిలో కొట్టుకొనిపోతుండే ఒకడికి, దూరం గా దుంగ ఒకటి తేలిపోతున్నట్టుగా కనబ డితే, అతను దబదబమని ఆబగా దానివై పుకు ఈదుకొని పోయి అబ్బ, బతికినా మురా అనుకొంటా దానిని పట్టుకోబోతే, అయ్యో పాపం, అది దుంగ కాకుండా వట్టి చెత్తకుప్ప అయితే అతని మనస్సు ఎట్ట అంగలార్చి ఉంటుంది. అతని మొహం ఏమయిపోయి ఉంటుంది. అట్ట ఉండింది రుక్మిణి మొకమూ, ఆ మొకంలో కదలాడి కనిపించిన ఆమె మనస్సూ, ఎల్లలు లేని వగపు (దుఃఖం), తత్తరపాటు ఆ చూపు ల్లో కనిపించినాయి. అప్పటికీ నాగరాజన్ ఏమీ మాట్లాడకుండా ఉండడం చూసిన రుక్మిణి మెల్లగా అతనికి దూరం జరిగి-

"ఇంక నేను చెప్పగలిగేది ఏమీ లేదు. 'మన్నార్ కోవిలుకు పోవడంలేదు' అనే మాట మీ నోటినుండి రావడం లేదు. నేటితో నా తలరాత తీరిపోయింది. నన్ను ఇట్ట విడిచిపెట్టేయాలని మీరు తెగించినాక ఇంకమీదట నేను ఎవర్ని నమ్ముకొని ఎవ రికోసం ఊపిరి నిలబెట్టుకోవాల? మీ మీ ద నాకు కోపం లేదు, మీ మనస్సు ఈ పనికి ఒప్పుకొనుండదు. నా తలరాత, నా తల్లిదండ్రుల అగచాటే మిమ్మల్ని ఇదంతా చెయ్యమని చెపుతుండాది. ఇంకమీదట, రుక్మిణి అని ఒకతె ఉండేది. అది మనమీ ద ఎల్లలులేని ప్రేమను పెట్టుకొని ఉండే ది. ఊపిరిని వదిలేటప్పుడు కూడా అది న న్నే తలుచుకొంటా ఊపిరిని వదిలింది అ ని ఎప్పుడయినా తలుచుకోండి. ఇదే నేను మిమ్మల్ని చివరిగా కోరుకొనేది" అంటా నాగరాజన్ కాళ్లమీద పడి కాళ్లను గట్టిగా పట్టుకొని కుమిలి కుమిలి ఏడిచింది.

నాగరాజన్ వెంటనే ఆమెను పైకిలేపి "పిచ్చిదానా, అట్టంతా ఏమీ చేయకూడదు. నువ్వుపోతే నా ఊపిరి కూడా నిలవదు. అప్పుడు ఎవరు ఎవర్ని తలుచుకొనేది? తుంపర పడతా ఉంది. మిన్నంతా కారుచీ కటి అయిపోయింది. ఇంకాసేపటికి కుండ పోతగా కురిసేటట్టు ఉంది. రా ఇంటికి పోదాం" అని ఆమె చేతిని పట్టుకొని రెండ డుగులు ముందుకు వేసినాడు.

మిన్నులో చందమామా, చుక్కలూ కన బడడంలేదు. అంతా ఒకటే చీకటి. కాసే పటికి ఒకసారి మొయిలు (మేఘాన్ని) ను కత్తితో నరుకుతున్నట్టుగా మెరుపుతీగలు మెరుస్తుండాయి. కానీ వెంటనే గబ్బు చీకటి ముసురుకొంటా ఉంది. నేలంతా గడగడ వణికేటట్టుగా మిన్నును చీలస్తా పిడుగులు పడతుండాయి. గాలి అయితే తిప్పించి మల్లించి కొడతా ఉంది. వాన కురిసే చప్పుడు దూరం నుండి పెరగతా వచ్చి దగ్గర పడింది. ప్రళయకాలం లాగా ఉండిన ఈ హోరులో రుక్మిణీ నాగరాజూ పోతా మాట్లాడుకొన్న మాటలు నాకు సరిగ్గా వినిపించలేదు. వాళ్లు కూడా ఇంటి

వైపుకు బిరబిరా పోతా ఉండారు. మెరుపు వెలుగుల్లో రుక్మిణి ఇంటికి పోవడానికి ఒప్పక వెనకడుగులు వేయడం, నాగరాజు ఆమెను ముందుకు తీసుకొనిపోవడం నా కంటపడింది. వాళ్ల మాటలు కూడా ఒకటి రెండు నా చెవిన పడినాయి.

".. ఊపిరి ఉండదు... అమ్మ మనసు తనివితీరా.. శుక్రవారం తెల్లవారి.. ఆడవా ళ్ల.. పగిలిపోతుంది.. చెప్పద్దు.. పెట్టిపు ట్టింది కదా.. ఆ పడుచునయినా బాగా చూసుకోండి.. నిండుగుండెలతో దీవిస్తుం డాను.. ఆనాడు తెలుసుకొంటావు... చివ రి దండాలు.. వరకూ ఓర్చుకో.." ఈ మా టలే ఉరుముల సందడిలో గాలి సవ్వడిలో వాన చప్పుడులో నాకు వినబడినాయి. వాన కుండపోతగా కురవసాగింది. రుక్మిణీ నాగరాజూ మరగయిపోయినారు. మరు నాడు తెల్లవారింది. వాన వెలిసింది. అయితే మిన్ను ఇంకా తేట పడలేదు. మొ యిలు నలుపు తొలగలేదు. గాలి అయితే ఓదార్చేవాళ్లు లేక వెక్కెక్కి ఏడ్చే పసివాడి లాగా ఆపకుండా అరస్తానే ఉంది. నా మ నస్సంతా ఒకటే గజిబిజి. ఎంత ఓదార్చు కొంటున్నా నెమ్మ ది కలగడం లేదు. ఏమి టిది, ఎంత అణుచుకొన్నా ఎన్నడూ ఎరగ నంత ఏడుపు పొగిలిపొగిలి వస్తా ఉందే, కారణం తెలియడంలేదే? అని నాలోనేను అనుకొంటా ఉండేటప్పుడు-

"ఏమ్మో! ఇక్కడొక కోక తేలాడతా ఉంది" అని అరిచింది మీనా.

వెంటనే ఆత్రుతతో ఆ పక్కకు తిరిగి నాను. గుంటలో మునగతా ఉండిన ఆడ వాళ్లందరూ అట్నేతిరిగి చూసినారు. చూసేసి చెవులు కొరుక్కొంటా గుసగుసగా మాట్లాడుకోసాగినారు. నా అయిదూపిర్లూ నిలిచిపోయినాయి. కోకను చూస్తే అది

మీనాక్షమ్మ కోకమాదిరిగా ఉంది. అయ్యో, అమ్మానాయనల గుండెల్లో రాయిని వేసేసి రుక్మిణి వచ్చి గుంటలో పడిపోయినట్టుగా తెలుసుకొన్నాను. అంతవరకే తెలుసు, సొమ్మసిల్లిపోయినాను. మరలా కాసేపటికి కానీ నాకు తెలివి రాలేదు. ఆసరికి గుంట కట్టంతా గుంపుతో నిండిపోయి ఉంది. జానకినీ, రామస్వామి అయ్యరునూ ఆడిపోసుకోని వాళ్లు లేరు. ఇంక తిట్టినా ఒకటే, తిట్టకపోయినా ఒకటే. ఊరి నయగారాన్నీ, తల్లిదండ్రుల బతుకునూ, నా ప్రేమనీ అంతా ఒకటిగా చేసి కట్టగట్టుకొని ఒకే నిమిషంలో ఎగిరిపోయిందే నా రుక్మిణి. కింద, ఆ మల్లెగుబురు పక్కనే ఆమెను పడుకోబెట్టింది.

ఆమె పసిడిచేతులతో ఎన్నిసార్లు ఆ మల్లెమొగ్గలను కోసుంటుంది! పసిబిడ్డగా ఉండినప్పుడు ఆమె అడుగులు పడని తావు ఈ గుంటకట్టమీద ఎక్కడుంది! ఆమె చేయి సోకని మానోమాకో ఉందా! ఆ లేత చేతులు, ఆ సొగసయిన పాదాలు అంతా వాడి వాలిపోయి ఉండాయి. కానీ ఆమె మొకంలోని కళ మటుకు తగ్గనే లేదు. అంతకుముందు ఉండిన ఏడుపు గురుతులన్నీ చెరిగిపోయి అచ్చెరువుగొలిపే శాంతం ఆ మొకంలో పరచుకొనింది. దీన్నంతా కూడా కాసేపు మటుకే చూడగలిగినాను. ఆ సరికే "నాగరాజన్ వస్తుండాడు" అని కలకలం పుట్టింది గుంపులో నుండి. అవును నిజమే, అతను కన్నూ మిన్నూ తెలియకుండా దెబగుబ పరిగెత్తి వస్తా ఉండాడు. వచ్చేసినాడు. మల్లెగుబురు దగ్గరకు వస్తానే గుంపునుగానీ గుంపులోని తల్లిదండ్రులనుగానీ పట్టించుకోకుండా

"రుక్మిణీ ఏమి చేసినావే... రుక్మిణీ!" అని అరస్తా నరికిన మానులాగా కిందకు పడినాడు. గుంపులోని గోల గప్పని అణిగిపోయింది. అందరూ నాగరాజన్నే చూస్తా ఉండిపోయినారు. చాలాసేపటి వరకూ అతను అట్టనే నేలమీద సొమ్మసిల్లి పడి ఉండినాడు. రామస్వామి అయ్యరు బెదిరిపోయి అతని మొకం మీద నీళ్లు చల్లి వీవనతో విసరతా ఉండగా కడకు అతను తెప్పరిల్లి కళ్లు తెరిచినాడు. కానీ నాయనతో ఒక్కమాటయినా మాట్లాడలేదు. ఊపిరిలేని రుక్మిణి మేనును చూసి-

"రుక్మిణీ, నా తలపులను తుడిచేసి జూలియట్ లాగా ఎగిరిపోయినావే. శ్రీనివాసన్ చెప్పినట్టే అయిందే! పాపిని నావల్లనే కదా నువ్వు ఉసురు తీసుకొన్నావు. నేనే నిన్ను చంపిన పాతకుడిని. నిన్ననే నేను నీతో గుట్టునంతా చెప్పేసి ఉంటే, ఈ పొద్దు మనకు ఈగతి పట్టుండదే! 'కుసుమ సదృశం... సత్యః పాతి ప్రణయి హృదయం' అనే లోతయిన మాటలను పైపైన చదివినానే తప్ప అందులోని సత్యాన్ని తెలుసుకోలేకపోయినానే! ఇంక నాకు ఏమి మిగిలింది? రుక్మిణీ నువ్వేమో తొందరపడి నన్ను వదిలేసి పోయినావు. నాకు ఇంక సంసారపు బతుకు వద్దు. ఇదిగో సన్యాసం తీసుకొంటాను!" అంటా ఎవరయినా అడ్డుకోవడానికి ముందుగానే తను కట్టుకొని ఉండే పంచెనూ, పైవల్లెనూ పీలికలు పీలికలుగా చింపేసినాడు. అతని తల్లిదండ్రులు నోరే తెరవలేదు. వాళ్లు ఆ వెప్పరపాటు నుండి తేరుకొనే లోపల్నే నాగరాజన్ వాళ్ళ కాళ్ళమీద పడి మొక్కేసి ఎవరితోనూ మాట్లాడకుండా గోచిగుడ్డతోనే బయలుదేరి పొయ్యేసినాడు. ఇట్ట తీరిపోయింది నా రుక్మిణి కత.

నా అనుగు బిడ్డల్లారా! ఆడవాళ్ళ మనసు నొచ్చుకొనేటట్టుగా ఇంకమీదట ఏదయినా చెయ్యాలనుకొన్నప్పుడు ఈ కతను తలుచుకోండి. ఆటపట్టించడం కోసం కూడా ఆడదయి పుట్టినోళ్ల మనస్సులను నలపద్దండి. ఏ ఆట ఏ కర్మను మోసుకొస్తుందో ఎవరు చెప్పగలరు? V

కెనడా కథ

- నోబెల్ గ్రహీత
**ఆలిస్ మన్రో**

# వృక్షాలు

**మే**రీ మెకేడ్ మాఇంటికొచ్చింది. ఆమె తెలియదని కాదు. కాని గుర్తుపట్టనట్టే నటించాను. "నేను నీకు గుర్తు లేదంటే పాతవిషయాలేవీ నీకు గుర్తులేనట్టే. మొన్న వేసవి సెలవుల్లో మీ అమ్మమ్మ వాళ్లింటికెళ్లిన విషయం కూడా మర్చిపోయే వుంటావు" అంది మేరీ.

తాతయ్య ఇంకా బతికే వున్నాడు. అయినా దాన్ని అమ్మమ్మ ఇల్లనే అంటాం. తాతయ్య ఇప్పుడు తన పడగ్గదికి పరిమిత మయ్యాడు. ఆగదికెప్పుడూ పరదాలు వేసి వుంటాయి. వెలుగు తాతయ్య కళ్లమీద పడకుండా జాగ్రత్తలు తీసుకున్నారు. తెల్లటి జుత్తుతో, శుభ్రంగా పసిపిల్లాడిలా వుంటాడు. తాతయ్య - తెల్లటి నైట్ షర్ట్‌లో, తెల్లటి దిండుమీద తలపెట్టి పడుకుం టాడు. ఆ గదిలో తెల్లయూనిఫాంలో నాక్కనిపించిన మరో వ్యక్తి మేరీ. సూప్ కలుపుతున్నప్పుడు వచ్చే శబ్దం చేస్తుంది ఫ్యాన్. దానిముందర కూర్చుంది మేరీ. ఏదైనా అల్లుకుంటూ కాలక్షేపం చెయ్యాల నిపించి వుండవచ్చు. కాని చీకటిగా వున్న గదిలో అలాంటి పనులు సాధ్యం కావు.

నేనప్పుడు చాలా చిన్నదాన్ని. పడిపో కుండా అటుఇటూ దిళ్లు వేసి పడుకోబెట్టే వాళ్లు (నా గురించి ఇంత శ్రద్ధ తీసుకుంది మా ఇంట్లోకాదు మా అమ్మమ్మ యింట్లో). నా గదిలో ఫ్యాన్ లేదు. బైటనుండి కళ్ల మీద పడుతున్న ఎండ - నీళ్ల మీద పడి మెరుస్తున్నదేమో, మరింత తీవ్రంగా వుందా వెలుగు. అలాంటి గదిలో ఎవరి కైనా నిద్రపడుతుందా అసలు? మా అమ్మ, అమ్మమ్మ, ఆంటీల గొంతులు రికార్డు లాగ వినిపిస్తూనే వున్నాయి. ఇంటికప్పు చాలా ఎత్తుగా వుండేది. ఎక్కడ చూసినా, చీకటిగా ఖాళీ గా వున్న స్థలమే. నిద్రప ట్టని నాకు ఇవన్నీ పరిశీలించటమే కాల క్షేపం. చెమటతో ఒళ్లంతా జిడ్డు పట్టింది. తెల్లటి యూనిఫాంలో పెద్ద ఐస్‌దిమ్మెలాగ మేరీ మెకేడ్. ఇంట్లోని ఈ వాతావరణానికి బాధ్యత ఆమెదే అనుకున్నాను.

మొత్తంమీద ఆమెవరో నాకు తెలియ నట్టే నటించాను. ఇప్పుడామె తెల్లటి యూనిఫాం వేసుకోలేదు. అంటే ఆమె అధికారాన్ని ప్రదర్శించే సమయం ఇంకా రాలేదు. ఎర్రటి మొహం మీద ఓట్‌మీల్‌లా తెల్లటి మచ్చల్తో దేనిగురించో ఫిర్యా దు చేస్తున్నట్టుగా మాట్లాడుతుంది. "ఈ బట్టలన్నీ నేనొక్కదాన్నే వుతకాలా? " అంటూ అరిచింది నా వైపు చూస్తూ. నేనామె వెంట పెరట్లో కెళ్లాను. బట్టల బుట్టను నేలమీద ధామ్మని పెట్టి "ఒక్కొ క్కటే అందించు. జాగ్రత్తగా కాలర్ పైకొ చ్చేటట్టు ఎత్తి పట్టుకోవాలి. క్లిప్పులు కూడా ఇవ్వు. ఈ గాలిలో నేనింతసేపు నిలబడ కూడదు. నాకు బ్రాంకియల్ సమస్య వుం ది" అంది. జంతువులా తలొంచుకుని, బు ద్ధిగా ఆమె చెప్పినట్టే చేశాను. ఆ మార్చి నెల చలిలో (కథ నేపథ్యం కెనడాలోని ఆంటేరియోలో, మార్చిలో అక్కడ విపరీత మైన చలి) ఆమె కాస్త బరువు తగ్గినట్టని పించింది. వాసన కూడా వెయ్యలేదు. ఇం

ట్లో ఉన్నప్పుడు ఆమె దగ్గర గాఢమైన వాసనవేసేది - ఆమె గదిలో లేనప్పుడు కూడా. ఆమె వాసన ఎలా ఉండేది? (లోహాలూ, లవంగాలూ కలిసినట్టుగా). ఆమెకు పంటినొప్పి ఉండేది. జలుబు చేసినప్పుడు, నా ఛాతీమీద ఆ మిశ్రమాన్నే రుద్దేది.

ఈ విషయం అమ్మతో చెబితే, "పిచ్చిపిచ్చిగా మాట్లాడకు. నా దగ్గర వాసనవేస్తోందా? లేదే? " అనేది. వాసన గురించే వినకపోతే రుచి గురించి ఎవరు వింటారు? అసలిదంతా మేరీ వంటలోనే వుంది. ఉదయం బ్రేక్‌ఫాస్ట్ పారిడ్జ్‌లో, బంగాళా దుంప వేపుడులో, బ్రెడ్డులో, వెన్నలో, మధ్యాహ్నం చప్పరించటానికిచ్చిన చక్కెర గోలీల్లో - ఏదో వాసన. అందరికీ ఇదొస్తూనే వుంటుంది. కాని తెలియనట్టుగా వుంటారు. ఏడాది క్రితం ఇంట్లో ఈ వాసన రాలేదే.

బట్టలారేశాక, మోకాళ్లమీద చేతులు పెట్టుకుని వేడినీళ్ల బేసిన్‌లోకి వంగి తృప్తిగా వూపిరి తీసుకుంది.

"నువ్వు నర్సువా? " అనడిగాను.

అమ్మ, అప్పటికే నాకా విషయం చెప్పింది. అయినా మరోసారి అడిగాను.

"అవును. కాకపోయినా బాగుండేది"

"నువ్వు నా ఆంటీవా? "

"నేను నీ ఆంటీనైతే, మరి నువ్వు నన్ను 'ఆంట్ మేరీ' అనాలి గదా! కాని అలా పిలవ్వు. నేను నీ కజిన్ని, మీనాన్న కజిన్ని. అందువల్లే, మరో నర్సుకు బదులుగా నన్ను పిలిపించుకుంటారు. బంధువుల్లో ఎవరు జబ్బు పడినా నేను వెళ్లాల్సిందే. ఇక నాకు తీరికెక్కడ? "

నేను నమ్మలేదు. రమ్మని ఆమెనెవరు పిలిచారు? తనకై తానే వచ్చింది. వంట చేస్తుంది. వస్తువులన్నీ తనకు నచ్చిన పద్ధతిలో సర్దుతుంది. అందరిమీదా తన అథారిటీ చలాయిస్తుంది. ఆమె రాకపోతే అమ్మమంచం పట్టేదే కాదు.

డైనింగ్ రూంలో అమ్మకు పడక ఏర్పాటుచేశారు - అలా చెయ్యటం వల్ల మేరీకి మెట్లెక్కే పని తప్పుతుంది. అమ్మ జుత్తు రెండు సన్నటి జడలంత మాత్రమే వుంది. చెక్కిళ్లు పీక్కుపోయాయి. మెడ వెచ్చగా ఉంటుంది. ఎప్పటిలాగే కిస్‌మిస్‌ల వాసన వేస్తుంది. కాని, దుప్పటి కింద మిగతా శరీరమంతా బలహీనమైన, పెద్ద, మిస్టీరియస్ 'వస్తువు'లా మారిపోయింది. కదిలించాలంటే కష్టం. తన గురించి తాను పరాయి మనిషిలా మాట్లాడుతుంది.

"జాగ్రత్త! అమ్మకు దూరంగా వుండు. 'అమ్మ' కాళ్లమీద కూర్చోకు" ఆమె 'అమ్మ', అన్నప్పుడల్లా నేను వణికిపోతాను. నాకూ, ఆమెకూ మధ్య ఎంత దూరమో! ఆమె 'అమ్మ' అంటే అదేదో కనిపించని 'జీసస్' అని వుచ్చరించినట్టుగా వినిపిస్తోంది. ఇది మా 'అమ్మ' నా 'అమ్మ'. ఆ వెచ్చని మెడకు నేను వాటేసుకున్న అమ్మ. 'జీసస్' లాంటి అమ్మకాదు. నన్ను కని, పెంచిన 'మనిషి' అమ్మ. మమ్మల్ని విడదీసిన బ్రహ్మరాక్షసి ఎవరు? దేవుడితో ఫిర్యాదు చేశాను. సహజంగానే మనిషిలో దుష్టత్వం వుందనుకున్నా, నేనలాంటి పనులేమీ చెయ్యలేదు.

అమ్మ వంకాయ రంగు దారంతో లేసు లల్లుతున్నది. కొన్ని దారప్పోగులు బెడ్ షీట్ల మీద పడిపోతున్నా పట్టించుకోలేదు. అల్లిక ముగించి, పక్కనపడేసి దాని గురించి పూర్తిగా మరచిపోతుంది. రాజకుమారుల గురించీ, రాజకుమార్తెల గురించీ తను చెప్పిన కథలన్నీ ఇప్పుడు మరచిపోయింది. తన బాల్యం గురించి కూడా ఇప్పుడామెకేమీ గుర్తు లేదు. నా ఒక్కదానికేనా, బాల్యం అందరికీ అద్భుతమే. మేరీ పర్యవేక్షణలో వున్న అమ్మ ఆమెను చిన్న పిల్లలా అడుగుతుంది. "మేరీ, కాస్త నా వీపు మీద మర్దన చెయ్యవూ!", "మేరీ, నాకో కప్పు టీ యివ్వవటే. ఇంకా తాగితే భళ్లున వాంతి చేసుకుంటానని తెలుసు.

కాని నాకు టీ అంటే ప్రాణం"

"సపోర్టు పట్టుకుని లేచి కూర్చో వాంతి కాదు.." అంటుంది మేరీ నవ్వుతూ. ఆ తర్వాత, నన్ను దూరంగా జరగమని, బలంగా బెడ్ షీట్లు దులుపుతుంది.

'నీవల్లే అమ్మకు అలసట పెరుగుతున్నది. బైట హాయిగా వుందిగా. ఎందుకు యిక్కడే తచ్చాడుతుంటావు!" అంటుంది మేరీ నావైపు సీరియస్‌గా చూస్తూ.

'పాపం, ఒంటరిగా వుందేమో. తోచటం లేదు కాబోలు' అంటుంది అమ్మ.

"బైటకూడా 'ఒంటరి'గా వుండొచ్చుగా" అని నావైపు కోపంగా చూస్తూ. "నీ ఆట సామాను తీసుకు పరిగెత్తు. వెళ్లు. ఫో" అం టుంది మేరీ.

మేరీ రాకతో నాన్నలో కూడా మార్పొచ్చింది. ఆయన భోజనానికి కూర్చోగానే జోక్ చెప్పటానికి సిద్ధపడుతుంది మేరీ.

**అనువాదం : ముక్తవరం పార్ధసారధి**

మొహం ఎర్రబారుతుంది. గులకరాళ్లలా గున్న గట్టి తెల్లటి బీన్స్ గింజల్ని సూప్‌లో వేసి నాన్న వాటిని ఎలా తినగలడో పరీక్షిస్తుంది. నీళ్లగ్లాసులో ఈగలా కనిపించే వస్తువేదో వేస్తుంది. ఒక పన్ను విరిగిన ఫోర్క్ టేబుల్‌మీద పెడుతుంది. నాన్న మేరీ వైపు గిరాటేస్తాడు. అదామెకు తగలదు గాని నేను వులిక్కిపడతాను.

అమ్మా, నాన్నా భోజనం చేస్తూ నెమ్మదిగా మాట్లాడుకుంటారు. మా నాన్న వైపు వాళ్లకు మేరీలాగ ట్రిక్స్ చేయటం అలవాటే. రబ్బరు పురుగుల్ని పక్కవాళ్లమీదకి విసిరి వాళ్ల రియాక్షన్ చూస్తారు. లావుగా వున్నవాళ్లకు విరిగిన కుర్చీలు ఆఫర్ చేస్తారు. "నీ వయసెంత? " అని సూటిగా అడగరు- దానికే ఏవేవో చిక్కులూ, పజిల్సు వుంటాయి. మేరీని చూడగానే నాన్నకు పాతఅలవాట్లు తిరిగివచ్చాయి. వేయించిన బంగాళా దుంపలే సర్వస్వంగా, కొద్దిపాటి మాంసం తింటూ, అల్యూమినియం పాత్రల్లోంచి చిక్కటి, నల్లటి టీ తాగుతూ, "మేరీ, మగాళ్లకు వండిపెట్టటమెలాగో నీకు బాగా తెలుసు" అంటూ పొగిడేవాడు. అంతటితో ఆగుతుందా వ్యవహారం. "ఎన్నాళ్లింకా వెయిట్ చేస్తావు! పెళ్లి చేసుకుంటే ఓపనైపోతుంది గదా!" అంటూ ఏడిపించేవాడు. చిరుకోపంతో, చేతిలో వున్నదేదో నాన్నమీదికి విసిరేస్తుంది మేరీ.

మేరీకి మొగుళ్లను వెదకటం గురించే నాన్న టీజింగ్.

"జోక్‌కాదు సీరియస్‌గా నీ కోసమో కుర్రాణ్ణి వెదికాను మేరీ"

నోరు విప్పకుండా పెదాలు బిగపట్టి నవ్వుతుంది మేరీ. మొహం కందగడ్డలాగవుతుంది- చూస్తేగాని నమ్మలేం. అంత ఎర్రబడటం సాధ్యమా అనిపిస్తుంది. నోటిలోంచి చిన్న, చిన్న శబ్దాలు వస్తాయి.

ఎవరో గిల్లినట్టుగా శరీరం కాస్త కంపిస్తుంది. ఈ మాటలకామె సంతోషంతో వుబ్బితబ్బిబ్బయినట్టే. 'పెళ్లి' ఊహల్లో ఊహాభర్తతో పరిష్వంగాలు. పెళ్లికాని మధ్య వయస్కురాల్ని యిలాంటి కబుర్లతో మభ్యపెట్టటం 'క్రూరం, అమానుషం' అంటుంది అమ్మ. కాని నాన్న వైపు వాళ్లకు యిలాంటి జోకులు మామూలే. ఇప్పటికెంతమంది ఎన్నిసార్లు ఆమెను ఏడిపించారో! లావెక్కి, మొరటుగా మారిన కొద్దీ మేరీని ఏడిపించడం పెరిగింది. ఇలాంటివాటికి బాధపడితే, -అమ్మలాగ- నువ్వు చాలా 'సెన్సిటివ్' అని తమను తాము సమర్థించుకుంటారు. నాన్నవైపు ఆంటీలు, కజిన్స్, అంకుల్స్ అందరూ యిలాంటి క్రూరమైన జోకులకు మొద్దుబారినవాళ్లే. ఎవరికైనా అంగవైకల్యమున్నా, దాని గురించి కూడా ఆటపట్టిస్తారు.

సాయంత్రం, భోజనం సమయానికి చీకటిపడింది. అప్పటికి మాకు కరెంటు రాలేదు. ఆ తర్వాత ఏడాది కొచ్చివుంటుంది. టేబుల్‌మీద ల్యాంప్ వెలుగుతోంది. ఆ దీపం నీడలో, నాన్న, మేరీల నీడలు కలిసిపోతున్నాయి. నేను మనుషుల్ని కాక నీడల్ని చూశాను. నావైపు చూసి 'కలగంటున్నావా ఏమిటి? ' అన్నాడు నాన్న. నేను కలగనటం లేదు. రాబోయే ప్రమాదాన్ని వూహించుకుంటున్నాను.

"పొలంలో బోనులు" పెట్టాను. చూడ్డానికి నా వెంట వస్తావా? " అని అడిగాడు నాన్న. నది ఒడ్డువెంట తిరిగే మస్కరాట్స్ అనేది ఒక తరహా ఎలుకల జాతి. అవి పేరుకు ఎలుకలే అయినా పెద్ద సైజు పందికొక్కుల్లాంటివి. వాటి కోసం పెట్టిన బోన్లు అవి. యవ్వనంలో వున్నప్పుడు, రాత్రింబగళ్లు, వారాలతరబడి, అడవుల్లో మస్కరాట్స్ కోసం వేటాడాడు నాన్న. వహనాష్ కౌంటీలోని బొరియలన్నీ ఆయనకు సుపరిచితమే. ఆ తర్వాత, ఎర్రటి నక్కలు, అడవి మింక్‌లు, మార్టెన్‌లులాంటి బొచ్చున్న జంతువులను, వాటి బొచ్చుకోసం ఆయన వేటాడుతాడు. అయితే, వసంతకాలంలో మస్కరాట్స్ మాత్రమే లభ్యమవుతాయి. పెళ్లిచేసుకుని, స్థిరపడి, వ్యవసాయం చేసుకుంటున్నా పాత అలవాటు మరచిపోలేక, మస్కరాట్స్‌ను మాత్రం బోన్లు పెట్టి పట్టుకుంటున్నాడు గత కొన్ని సంవత్సరాలుగా. బహుశా యిదే చివరిసారీ కావచ్చు.

గతేడాది దున్నిన పొలంలో నెమ్మదిగా నడిచాం. నాగేటిచాళ్లలో సన్నటి మంచు పేరుకుపోయి కాలుతీసి కాలువేసినప్పుడల్లా పట పటమంటూ పగిలింది. నాన్న వెనకే జాగ్రత్తగా అడుగువేశాను- ఆయన బూట్లనే చూస్తూ. విప్పినప్పుడు వంటింట్లో ఒక మూలన నిల్చుంటాయవి. ఎరువు, మెషీన్‌ఆయిల్, అట్టలు కట్టిన బురద అంటుకుపోయి ఉంటాయవి. వాటి నుంచి కుళ్లిపోతున్న ఆకూ, అలమూ కలిసిన ఒక వాసన గదిలో నిండుతుంది. అవి ఆయన శరీరంలో ఒక భాగమే అన్నట్టుగా వుంటాయి. విప్పినప్పుడు కూడా అవి ఆయన పాదాలకోసమే నిరీక్షిస్తుంటాయి. నాన్న జోకులు వేస్తాడు. ఆప్యాయంగా వుంటాడు. కాని మొహంలో ఓ కరకుదనం, కాఠిన్యం కూడా వుంటుంది. బూట్లూ అలాగే వుంటాయి. అయితే, ఆ కాఠిన్యం నన్ను ఆశ్చర్యపరచదు. ఎక్కడెక్కడ తిరిగినా, నాన్న అమ్మ దగ్గరకు, నా దగ్గరకు తిరిగి వస్తాడు.

బోనులో కదిలింది మస్కరాట్. మొదటి చూపుకది నీటివైపు వంగిన మొక్కలా కనిపించింది. నాన్న దాన్ని బైటికి లాగాడు. అది కదలటం మానేసింది. దూరం నుండి మొక్కలా కనిపించింది దాని తోక. నోటిలో పళ్లు వాడిగా వున్నాయి. తలమీద కళ్లు మెరుస్తున్నాయి- నీళ్లతో కడిగితీసిన గులకరాళ్లలాగ. ఒక దాన్ని విదిలించాడు నాన్న. చల్లటి మంచు తుంపరపైకి చిమ్మింది. "బాగుంది పెద్ద ఎలుక. తోక చూశావా!" అన్నాడు దాన్ని పైకెత్తి చూపిస్తూ. ఆ తర్వాత బోను ఎలా పనిచేస్తుందో వివరించాడు. మరోసారి దాన్ని బోనులో వేసి, నీళ్లలో ముంచి పైకి లేపాడు. ఎలుకను ముట్టుకోవాలనుకున్నాను. కాని ధైర్యం చాల్లేదు. నీళ్లలో నాని బిగుసుకుపోయింది ఎలుక. మృత్యువంటే యిదేగద. వడలిపోయిన ఆపిల్ ముక్కల్తో మళ్లీ బోను పెట్టాడు నాన్న. ఆ తర్వాత, ఎలుకను సంచిలోవేసి, సంచిని భుజానికేసుకున్నాడు వ్యాపారిలాగ. ఆపిల్‌ను కోస్తున్నప్పుడు ఆయన స్కిన్నింగ్ కత్తిని చూశాను. వాడిగా వుంది. ఎలుకల తోళ్లు తీసేది దానితోనే.

వహానాష్ తీరం వెంట నడిచాం. నది నిండుగా ప్రవహిస్తున్నది. ఎండ పడిన

చోట తళుక్కుమని మెరుస్తున్నది. అక్కడ క్కడా నీరు సుడి తిరుగుతున్నది. ఒడ్డున నడిచాం గాని పక్కన లోతుగా వుంది. అడవి మొక్కలున్నాయి. కాలు జారుతున్న ది. ప్రవాహం పెద్దగా చప్పుడు చేయటం లేదు గాని అదేదో నదీగర్భం నుండి వస్తు న్నట్టుగా వుంది- భూమిలో నీరు వుబికిన రహస్యప్రదేశం నుండి వస్తున్నదా శబ్దం.

నది మలుపు తిరిగింది. ఎటువైపు నడ వాలో తెలియలేదు. బోనుల్లో బోలెడన్ని ఎలుకలు కనిపించాయి. వాటిని తీసి, విది లించి, సంచీలో వేసుకుని బోన్లు తిరిగి అమర్చాం. గాలికి, మొహం, చేతులు చల్ల బడ్డాయి. కాని నాన్నతో చెప్పలేదు. ఒడ్డున జాగ్రత్తగా నడవాలని ఆయన నన్నెప్పుడూ హెచ్చరించలేదు. ఆ మాత్రం తెలివితేటలు నాకుంటాయనే ఆయన నమ్మకం. ఎందా కా పోతున్నామో, మరెన్ని బోన్లు వున్నా యో నేనడగలేదు. కాసేపటికి అడవి దా టాం. చీకటి పడింది. మా యింట్లోంచి కనిపించే అడవి యిదేనన్న విషయం చాలా సేపటిదాకా నాకు అర్థం కాలేదు.

చిన్నమొక్కలు కాదు. నాకన్నా ఎత్తు పెరిగిన చెట్లున్నాయక్కడ. జాగ్రత్తగా, జారకుండా, దారి చూసుకుంటూ అడు గులో అడుగువేశాను. నాన్న నదిలోకి దిగి బోన్లు అమర్చుతున్నప్పుడు కాసేపు నాకు కనిపించలేదు. అయితే, అల్లంతదూరాన మరో ఆకారం కదిలింది. ఎవరో మా వైపే నడిచివస్తున్నారు. రాళ్లు, దుబ్బులు వున్నా, దారి బాగా తెలిసినవాడిలా గబగబా నడుస్తున్నాడు. మొదట తలా, భుజాలూ కనిపించాయి. పెద్ద నుదురు, బాగా పెరి గిన జుత్తు, సన్నగా, పొడుగ్గా వున్న కాళ్లు, అన్నింటి కన్నా ముఖ్యం చేతిలో గొడ్డలి.

ఈ అపరిచితుడి గురించి నాన్నను హె చ్చరించాలనే ఊహ కూడా రాలేదు నాకు. అతడు మమ్మల్ని దాటుకుని ముందుకె ళ్లిపోయాడు. భయంతో కాళ్లూ చేతులూ ఆడలేదంటారే అలాంటి పరిస్థితి. నేను స్థాణువులా నిల్చుండిపోయాను- పిడుగుప డినట్టనిపించింది. ఏంచెయ్యాలో కూడా తోచలేదు. అది భయం కాదు. అతడెవరో తెలుసు. తప్పించుకోలేనప్పుడేం చేస్తాం?

అలా ఇన్నాళ్లూ, నాకు కనిపించనంత దూరంగా ఎక్కడో వున్నాడని తెలుసు. కాని యిప్పుడు నా కళ్ల ముందు నడిచివె ళ్లాడు. నెగెటివ్ ఫిల్ములో లాగుంది నా పరిస్థితి. నేపథ్యంగా నల్లటిఆకాశం. పరిచ యస్తుడిలా నాన్న వైపు నడిచివెళ్లాడు.

అతడు సమీపించిన విషయం నాన్న గుర్తించలేదు. నాకూ, నాన్నకూ మధ్య నిల్చున్నాడతడు. పాత స్నేహితుడిలా మాట్లాడుతున్నాడు నాన్న.

"హల్లో, చూసి చాలా కాలమైంది" అతడు మాట్లాడలేదు.

"నేను జో, బెన్ జోర్డాన్‌ని. బోన్లు కో సం వచ్చాను. ఈసారి బోలెడన్ని ఎలుకలు దొరికాయి. మాంచి బలిసిన ఎలుకలు"

అతడు నాన్న మాటల్ని నమ్మనట్టుగా బోన్లు వైపు చూశాడు"

"నువ్వు కూడా బోన్లు పెడితే ఎంతో కొంత సంపాదించవచ్చు" జవాబు లేదు. గొడ్డలి గాలిలో కదిలింది.

"ఇప్పటికే ఆలస్యమైందిలే. నదిలో నీరు తగ్గుమొహం పట్టింది" నాన్న ఎలుకల వేట వీలుపడదు అని చెప్పాడు.

అతి ప్రయత్నం మీద, మాటలు ఒత్తి పలుకుతూ, 'బెన్‌జోర్డాన్' అన్నాడతడు.

"ఇప్పటికి గుర్తుపట్టావా, జో? " అన్నాడు మా నాన్న.

"నువ్వనుకోలేదు. సైలాస్ అనుకుని పొరబడ్డాను"

"నేను బెన్‌జోర్డాన్‌నని చెబుతూనే వున్నానుగా"

"సైలాస్ మనుషులు నా చెట్లు నరికేస్తు న్నారు. కంచెలు కూల్చి వేస్తున్నారు. నా యిల్లు తగలబెట్టారు"

# చిన్నకథకు పెద్ద దిక్కు



"నవల నాకు అర్థం కాదు. అంత పెద్దపుస్తకంలో ఉత్కంఠ కోసం ఎక్కడ వెదకాలి? కథలో ఉత్కంఠ కోసం వెదకడం సులభం. కథ బాగా వస్తుందో, లేదో ప్రారంభించగానే తెలిసిపోతుంది. కథలో ఒక విస్ఫోటనం ఉంటుంది. దానికోసమే, దానివైపే కథ నడుస్తుంది. అయితే మరీ చిట్టి, పొట్టి కథల్లో చెప్పదలుచుకున్నదంతా చెప్పడం కష్టం. అందుకే కాస్త పెద్ద కథలంటేనే నాకు ఇష్టం" అంటుంది ఆలిస్ మన్రో.

'కథంటే నవలకు సంక్షిప్తరూపం' అన్న దురభిప్రాయాన్ని తొలగించి కథాప్రక్రియకు నిర్దుష్టత(పర్‌ఫెక్షన్) తీసుకొచ్చింది అని 'మాస్టర్‌ఆఫ్ ది కాంటెంపరరీ షార్ట్ స్టోరీ' అనే తన సైటేషన్‌లో ఆలిస్ మన్రోని ప్రశంసించింది స్వీడిష్ అకాడమీ. కేవలం కథలు మాత్రమే రాసి ఈ ఏటి నోబెల్ బహుమతికి ఎంపికైన తొలివ్యక్తి ఆలిస్. ఈ అత్యున్నత పురస్కారాన్ని అందుకున్న పదమూడో మహిళ, తొలి కెనడియన్ ఆలిస్సే. డిసెంబర్ 10న స్వీడన్‌లోని స్టాక్‌హోమ్‌లో జరిగే వేడుకలో ఆమె ఈ బహుమతిని అందుకోనున్నారు.

నైరుతి అంటేరియోలోని లేక్‌హరన్ పక్కనున్న కుగ్రామంలో 1931లో జన్మించింది ఆలిస్. ఆమె తండ్రి సిల్వర్‌ఫాక్స్ రైతు. అంటే మెరిసే తెల్లబొచ్చున్న నక్కల్ని పెంచి వాటి చర్మాలను అమ్మడం అతడి వృత్తి. తల్లి స్కూలు టీచరు. ఆలిస్ రెండేళ్లపాటు యూనివర్సిటీ ఆఫ్ వెస్ట్ అంటేరియోలో చదివింది. ఏ ఆర్థికసహాయమూ లభించకపోవడంతో వెయిట్రెస్‌గా, పొగాకుతోటల్లో ఆకులు కోసే కార్మికురాలిగా, గ్రంథాలయ గుమస్తాగా పనిచేసింది. సహవిద్యార్థి జేమ్స్ మన్రోను పెళ్లి చేసుకుంది. తల్లిగా, ఇల్లాలుగా బాధ్యతలు మీద పడ్డాయి. 1972లో జేమ్స్ నుండి విడిపోయిన ఆలిస్, 1976లో భౌగోళిక శాస్త్రవేత్త గెరాల్డ్ ఫ్రెమ్లిన్‌ను పెళ్లి చేసుకుంది.

ఆలిస్ తొలికథ 'ది డైమెన్షన్స్ ఆఫ్ ఎ షాడో' 1950లో అచ్చయింది. తొలి కథా సంకలనం 'డాన్స్ ఆఫ్ ది హాపీ షేడ్స్' 1968లో కెనడా అత్యున్నత సాహితీ పురస్కారమైన గవర్నర్ జనరల్స్ ప్రైజు గెలుచుకుంది. తరువాతి మరో రెండు సంకలనాలు 'హూ డూ యూ థింక్ యు ఆర్'(1978), 'ది ప్రోగ్రెస్ ఆఫ్ లవ్' లకు కూడా ఈ గౌరవం దక్కింది. 2009లో ఆలిస్‌కు మాన్ బుకర్ ఇంటర్నేషనల్ వారి జీవన సాఫల్య పురస్కారం లభించింది.

"విన్నాను"

"నువ్వనుకోలేదు జోర్డాన్, భయపెట్టటానికి గొడ్డలి వెంటతెచ్చాను. నువ్వుంటావని తెలిస్తే గొడ్డలి ఎందుకు తెస్తాను. నేనుండేదిక్కడే"

నన్ను పిలుస్తూ "నా పిల్ల వెంటవచ్చిందివ్వాళ" అన్నాడు నాన్న.

"గుడ్! ఇద్దరూ మాయింటికి రండి. కాస్త వెచ్చగా వుంటుంది" అన్నాడు జో.

అతడి వెనకే నడిచాం. సరదాగా, గొడ్డలితో గాలిలో విన్యాసాలు చేస్తూనే వున్నాడు. చెట్ల వల్ల చలి మరింత పెరిగింది. కింద మంచు పేరుకుపోయింది.

మరింత ముందుకు వెడితే, పొగవస్తున్న పొగగొట్టం కనిపించింది. అదే ఇల్లు. మెట్లుదిగి సెల్లార్‌లోకి ప్రవేశించాం. ఇల్లంటూ వేరుగా లేదు. సెల్లారే ఇల్లు.

"ఫరవాలేదే. బాగానే వుంది, జో" అన్నాడు మా నాన్న.

"నేలలో వుంటుంది కనుక, సహజంగానే కాస్త వెచ్చగా వుంటుంది. ఉన్న ఇంటిని తగలబెట్టారు. మళ్లీ కొత్త ఇంటిని కట్టుకోవటమెందుకు? ఏం చేసుకోను? ఈ మాత్రం చోటు నాకు సరిపోతుంది. సుఖంగానే ఉంది" అంటూ మెట్ల కింది తలుపు తెరిచాడు.

"తల జాగ్రత్త. జంతువుల్లా అందరూ ఇలాంటి కొంపల్లో వుండాలనటంలేదు. భార్యాపిల్లలుంటే అదో పద్ధతి. నాకు పెళ్లి చేసుకునే వుద్దేశం లేదు" అంటూ నవ్వాడు.

సెల్లార్ కిటికీల్లోంచి కొద్దిగా వెలుగు వస్తోంది. కిరోసిన్ దీపం వెలిగించి టేబుల్ మీద పెట్టాడు.

"ఇప్పుడు కనిపిస్తోందా!"

ఒకే గది. నేల మీద అట్టలు పరిచారు. ఒక ప్లాట్‌ఫాం మీద స్టౌ వుంది. టేబుల్. కోచ్. కుర్చీలు, కిచెన్ కప్‌బోర్డ్. గుర్రాల మీద కప్పుతారే- అలాంటి బ్లాంకెట్లు. ఇంత దుర్గంధం లేకుండా వుంటే, ఇలాంటి చోట వుండటానికి నాకు అభ్యంతరముం డేది కాదు. హిమపాతం ఎక్కువైనప్పుడు, కలపతో, వంటచెరుకుతో నేనూ ఇళ్లు కట్టాను- వరండాలో. మురికిగా వున్న కోచ్ మీద కూర్చోబుద్ధి కాలేదు.

"బాగుంది, జో" అంటూ టేబుల్ పక్కన కూర్చున్నాడు నాన్న. అక్కడే వుంది గొడ్డలి.

"మంచు కరగకముందు నువ్విక్కడికి రావాల్సింది. ఈ పొగ గొట్టం తప్ప మరేమీ కనిపించేది కాదీ పరిసరాల్లో"

"ఒంటరిగా వున్నట్టనిపించదూ? "

"నాకలా ఎప్పుడూ అనిపించలేదు జోర్డాన్. ఎందుకంటే నాకు తోడుగా ఓ పిల్లి వుంది. ఎక్కడికి పొయ్యిందీ.. ఆ.. ఇదిగో స్టౌ వెనక్కి నక్కింది. నాలాగే దానికీ ఎవరి కంపెనీ నచ్చదనుకుంటాను" అంటూ పిల్లిని బైటికి లాగి, "నువ్వేమేం చేయగలవో చూపించు" అంటూ ఒక పెద్దజార్ లోంచి ఏదో సాసర్‌లో పోశాడు.

"జో! పిల్లులు విస్కీ తాగవు" అన్నాడు నాన్న.

"కాస్త ఓపికపట్టు. అదేం చేస్తుందో చూడు"

ఒళ్లు విరుచుకుని నెమ్మదిగా నడిచి వచ్చి సాసర్లోదంతా తాగేసింది పిల్లి.

"నీట్ విస్కీ. నీళ్లు కూడా కలపలేదు"

"ఇలాంటిదెప్పుడూ నువ్వు చూడలేదు కదూ. నువ్వు చూడాలన్నా మరెక్కడా కనిపించదు. నా పిల్లికి విస్కీ ఇష్టం. అది పాలు తాగదు. పాల రుచి కూడా మరచి పోయింది. ఓ డ్రింక్ కావాలా జోర్డాన్? "

"ఎలాంటి విస్కీయో ఏమో? వద్దులే. ధైర్యం చాలటంలేదు" అన్నాడు నాన్న.

'డ్రింకు' తాగడం ముగించిన పిల్లి, తడబడుతూ నాలుగడుగులు నడిచి, ముడుచుకుని పడుకుంది.

"జో, దానికా అలవాటు చెయ్యకు"

"పిల్లికేం కాదులే. సరేగాని, చిన్నపిల్లకేం ఇవ్వనూ? "

ఏమీ వుండదనుకున్నానుగానీ, ఒక టిన్నులోంచి క్రిస్మస్ కాండీలు తీశాడు. అవి అనేకసార్లు కరిగి, గట్టిపడి రూపు మార్చుకుని రంగురంగుల గీతలతో వింతగా కనిపించాయి. తుప్పు పట్టిన మేకుల రుచితో వున్నాయవి.

"సైలాస్ మనుషులతో నాకు బేజా రెత్తిపోతున్నది బెన్ జోర్డాన్. రాత్రనకా, పగలనకా నన్ను వేధిస్తున్నారు. ఈసారి వాళ్లు నీక్కనిపిస్తే నా చేతిలో వాళ్లకు మూడిందని చెప్పు" అంటూ గొడ్డలితో ఆయిల్ క్లాత్ మీద ఒక్క వేటు వేశాడు.

"నా దగ్గర షాట్‌గన్ కూడా వుంది"

"ఇక నిన్ను వేధించరనే అనుకుంటు న్నాను, జో"

"లేదులే. బాగా అలవాటు పడ్డారు. వాళ్లెందుకు మానతారులే"

"వాళ్లను పట్టించుకోకు జో. విసుగొచ్చి వాళ్లే రావటం మానేస్తారు"

"నిద్రపోతున్నప్పుడెప్పుడో యిల్లు తగలపెడతారు. ఇదివరలో ఓసారి బెడ్ మీద ఉండగానే నన్ను కాల్చెయ్యాలని చూశారు"

నాన్న మాట్లాడలేదుగాని, గొడ్డలి ఎంత వాడిగా వుందో వేలితో తాకి చూశాడు. కోచ్ కింద పిల్లి కదలకుండా పడుకుంది అలసటతో, చలి తర్వాత దొరికిన వెచ్చదనంతో.

నమ్మలేని దృశ్యాలు చూడటంతో నిద్ర ముంచుకొచ్చింది నాకు. కళ్లు మూతలు

పడ్డాయి. "లేచావుగా నడు. ఈ సంచీతో, నిన్నెత్తుకుని నడవలేను" అన్నాడు నాన్న.

అప్పటికి కొండపైకి చేరుకున్నాం. చీకటి దట్టంగా అలుముకుంది. వవానాష్ నది ప్రవహిస్తున్న ప్రాంతమంతా- దుబ్బులు, చెట్లు, మంచు కప్పిన నేల, అక్కడక్కడా ఎండిన గడ్డి- తమాషాగా కనిపించింది.

"అదెవరి ఇల్లు? " అని అడిగాడు నాన్న నన్ను తట్టి.

ఒక నిమిషం తరువాత తెలిసింది- అది మా యిల్లే. మరోవైపు నుండి వచ్చాం గనక త్వరగా గుర్తు పట్టలేకపోయాను. చలికాలం- నవంబర్ నుండి ఏప్రిల్ దాకా ముందు ద్వారం అసలు తియ్యాం. తూరుపు గాలి చొరకుండా, తలుపు కింద అడ్డంగా గుడ్డలు కూడా పెడతాం.

"కొండ దిగామంటే ఇల్లు చేరుకోవచ్చు. పరిగెత్తు. డైనింగ్ రూంలో అమ్మ ఏం చేస్తోందో చూద్దాం పద"

దారిలో, "అతని దగ్గర గొడ్డలెందుకుంది నాన్నా? " అని అడిగాను.

"ఓ మాట విను. వింటావా? ఆ గొడ్డలితో ఎవరికీ ఏ అపకారమూ తల పెట్టలేదాయన. దాన్ని దగ్గర వుంచుకో వటం అలవాటు మాత్రమే. ఇంట్లో, అమ్మకూ, మేరీకి ఈ విషయం చెప్పకు. భయపడిపోతారు. మనకంటే భయం లేదు గాని అందరూ అలా వుండరుగా!"

కాసేపటికి, "చెప్పవుగా! ఏం చెప్పవో చెప్పు" అని మళ్లీ అడిగాడు.

"గొడ్డలి గురించి"

"నువ్వు భయపడ్డావా? "

"లేదు. అతని ఇంటిని ఎవరు తగలబె డతారట? "

"ఎవరూ తగలబెట్టరు. ఆ విషయం అతడు చూసుకుంటాడులే" ఇంటికొచ్చేశాం.

"సైలాస్ మనుషులంటే ఎవరు? "

"ఎవరూ లేరు. అంతా వుట్టిదే"

"నీ కోసమో కుర్రాణ్ణి చూశాను, మేరీ, ఇంటికి తీసుకొస్తే బాగుండేది" అన్నాడు మేరీ వంక చిలిపిగా చూస్తూ.

"నువ్వు వవానాష్ నదిలో కొట్టుకుపో యావనుకున్నానులే" అంటూ హడావిడిగా నా బూట్లూ, మేజోళ్లూ విప్పింది మేరీ.

"ఆ అడవిలో జో ఫిప్పెన్ వుంటాడు, చూడు"

"ఇల్లు తగలబెట్టుకున్నాడు. నాకు తెలుసు..." కోపంగా చూసింది మేరీ.

"కరెక్ట్. ఇప్పుడు సెల్లార్‌లో వుంటున్నా డులే. పందుల్లాగా వెచ్చగా పడుకోవచ్చు లోపల"

"మురుగులోనే బతుకుతాడనుకుంటా ను" అంటూ నాన్నకు భోజనం వడ్డించింది మేరీ. ఆమెకు జో ఫిప్పెన్ కథ వినిపిం చాడు నాన్న. నేల పరచిన అట్టలు, గొడ్డ లి, విస్కీ, పిల్లి గురించి మాత్రం ప్రస్తావిం చలేదు. మేరీకి కోపం నషాళానికి అంటడా నికి ఆ సమాచారం చాలు"

"అలాంటి వాణ్ణి లాకప్‌లో పెట్టాలి"

"కావచ్చు. కాని అదంత త్వరగా జరగ దులే" అన్నాడు నాన్న.

"తిను" అంది మేరీ నా మీదికి వంగి. ఆమెను చూస్తే ఇప్పుడు భయం కలగటం లేదన్న విషయం నేను గ్రహించలేదు.

"పిల్లను చూడు. కళ్లు తేలేస్తున్నది. ఎ క్కడెక్కడ తిరిగిందో, ఏమేం చేసిందో? దీ నిక్కూడా విస్కీ తాగించాడేమిటి వాడు? " అంటూ నాన్న వైపు చూసింది మేరీ.

"లేదు. లేదు" అంటూ నా కళ్లలోకి చూ శాడు నాన్న. మాయలు, మంత్రాల కథ ల్లోని పిల్లల తల్లిదండ్రులు నరరూప రాక్ష సులతో రహస్య ఒప్పందాలు చేసుకుంటా రు. మన భయాలన్నీ, తెలిసిన వాస్తవం నుండి పుట్టినవే. అయినా, రహస్యాలను దాచుకుని ఏమీ ఎరగనట్టుగా రోజువారీ పనులు చేసుకుంటూనే వుంటాం. అక్కడ నేను చూసిన విషయాల గురించి ఒక్క మాట మాట్లాడితే ఒట్టు. V

బెంగాలీ కథ - పరశురాం

# తుంటరి లేఖలు

**మా**స్టర్స్ డిగ్రీ పూర్తిచేసిన కొద్దికాలానికే పి.హెచ్‌డి - సంపాదించిన మణిపూస సుకాంతదత్తు. సింద్రీలోని ఎరువుల ఫ్యాక్టరీలో ఉద్యోగం సంపాదించి ఏడాదిగా అక్కడే పనిచేస్తున్నాడు. చిన్నతనంలోనే తల్లిదండ్రులను పోగొట్టుకొన్న సుకాంత్ పినతల్లి పోషణలో పెరిగాడు. ఈ ఉదయమే పినతల్లి భర్తనుండి ఉత్తరం వచ్చిందతనికి.

"సుకాంత్!

విజయలక్ష్మి కాటన్‌మిల్స్ అధిపతియైన బిజయ్ ఘోష్‌గారి అమ్మాయితో నీ వివాహం నిశ్చయించాను. వారిది ప్రసిద్ధికెక్కిన కుటుంబం. బిజయ్‌బాబు శంకరపారాలో నివసిస్తున్నాడు. నిజానికి మన పొరుగువాడే. వారి అమ్మాయి కూడా చాలా అందంగా ఆకర్షణీయంగా ఉంటుంది. ఆమె బీఎస్సీ పరీక్ష తప్పినప్పటికీ తెలివైనదే. ఈ ఉత్తరంతో ఆమె ఫొటో జతపరుస్తున్నాను. నీవు ఆధునిక యుగం వాడవైనందున నీవు అమ్మాయిని చూసి ఇష్టపడ్డ తర్వాతే వివాహం నిశ్చయం కావలసి ఉన్నా, ఆ భారాన్ని- నా మీద, నా భుజాలమీద ఎందుకుంచావో ఊహించలేకపోతున్నాను. ఏమైతేనేం? నా శక్తివంచన లేకుండా ప్రయత్నించి ఈ అమ్మాయిని నీకు స్థిరపరచాను. నా ఎంపిక నీకు అంగీకారమనుకొంటాను. ఈ ఫాల్గుణమాసం 23వ తేదీ అనగా ఈనాటి నుండి సరిగ్గా ఐదు వారాల నాటికి నీ వివాహ ముహూర్తం నిశ్చయించాం. ఏ విధంగానైనా పదిహేను రోజులు సెలవుకు ప్రయత్నించు. కనీసం పెండ్లికి రెండు రోజుల ముందైనా నీవు ఇక్కడికి చేరాలి" ఇదీ ఉత్తరంలోని విషయం.

తన బాబాయి పంపిన ఆ ఉత్తరాన్ని సుకాంత్ జాగ్రత్తగా తిరిగి తిరిగి చదివాడు. ఆ ఉత్తరంతో వచ్చిన ఫొటోను కూడా నిశితంగా చూశాడు. కాసేపు ఆలోచించి- తన రంగుల పెట్టెను తెచ్చాడు. ఒక కాగితం ముక్కమీద మూడు నాలుగు రంగుల గీతలను గీచాడు. తన ఎడమచేతి మణికట్టు దగ్గర ఆ కాగితం ముక్కనుంచి తన ఒంటి రంగుకు సరిపోయే రంగు కోసం ప్రయత్నించాడు. మరికొంతసేపు జాగ్రత్తగా ఆలోచించి ఉత్తరం రాయడం మొదలుపెట్టాడు.

"కుమారి సునందాఘోష్ గారికి!

మహిళా మణీ! మీ వివాహం నాతో నిశ్చయమైంది. మీరు అందగత్తెవని ఇప్పుడే అందిన మా బాబాయిగారి ఉత్తరం ద్వారా తెలిసింది. కానీ నా శరీరం చామనఛాయ. నలుపు అనేది అపార్థాలకు దారితీసే పదం అని మీకు తెలిసే ఉంటుంది. దాన్ని తెలియజేయడానికి ఎన్నో రకాల రంగులను వాడతారు. అందుకని నా ఒంటిరంగును యధాతథంగా తెలియజేయడం నా విధి. రంగు సరిపోయిన కాగితం ముక్కలను పంపుతున్నాను. అది నా ఎడమచేతి మణికట్టు రంగుకు సరిగా సరిపోతుంది. నాలాంటి నల్లని రంగుగల భర్తను పొందడం మీ కిష్టమైతే "ఆక్షేపణ లేదు" అని ఇందులో పంపిన నా సొంత చిరునామా గల కవర్లో మరుక్షణం జవా

బు ఇవ్వండి. మీకు నచ్చకపోయేటట్లయితే ఏ విధమైన జవాబు నివ్వనవసరం లేదు. ఐదు రోజుల్లో మీ వద్ద నుండి జవాబు రాలేదంటే మీరు నిరాకరిస్తున్నారని తలుస్తాను. అప్పుడు నాకీ సంబంధం ఇష్టం లేదని మా బాబాయి గారికి తెలియజేసి వేరొక సంబంధం నిశ్చయించమని కోరుతాను.

మీ విశ్వాసపాత్రుడు,
సుకాంత్.

జవాబు నాలుగునాళ్ళలో అందింది.

"డాక్టర్ సుకాంత్ దత్ గారికి!

ఆర్యా! నాకు అక్షేపణ లేదు. కానీ అసలు విషయం మీకు పూర్తిగా తెలియదు. నిజానికి మీకంటే నేను నల్లగా ఉంటాను. నా ముఖానికి ఆకర్షణీయమైన రంగు రుద్ది మీ బాబాయికి నన్ను చూపి వారిని మోసగించారు. కానీ మీలాంటి నిజాయితీపరుణ్ణి, విశ్వాసపాత్రుణ్ణి నేను మోసగించలేను. నా దగ్గర రంగులపెట్టె లేనందుకు చింతిస్తున్నాను. కానీ మీరు పంపిన నమూనా కాగితం కొద్దిగా కత్తిరించి దానిపై నీల్‌కాల్ సిరా చుక్కను అలికి మీకు పంపుతున్నాను. ఇది నాశరీర కాంతికి సరిపోతుంది. వరుడు నలుపుగనున్నారని ఎవరూ బాధపడరు. కానీ వరుడు అందమైన అమ్మాయిని ఇష్టపడతాడు. తానెంత నల్లగా ఉన్నప్పటికీ అప్సరస లాంటి అందమైనది, బాగా చదువుకొన్నది కావాలని వారు కోరుకుంటారుగదా! మీరు నా శరీరచ్ఛాయను ఇష్టపడకపోతే, ఈ సంబంధాన్ని నిరాకరించే పక్షంలో ఐదు రోజులలోగా సంతోషంగా మీ అభిప్రాయాన్ని తెలియజేయండి.

మీ విశ్వాస పాత్రురాలు,
సునంద"

సునంద నుండి ఉత్తరం రాగానే సుకాంత్ రాయడం మొదలుపెట్టాడు.

"మీ శరీరచ్ఛాయ నా శరీరచ్ఛాయకంటే నల్లగా ఉండడం నేను పట్టించుకోను. కానీ మీ ఆకతాయితనానికి మొదట్లో ఒకింత ఆందోళన చెందానన్నమాట కాదనలేను. భర్త స్థితిని, ప్రతిష్ఠను అధికం చేయడానికి దోహదం చేసే అసలైన ఖజానా వంటిది అందమైన భార్య అని తలచేవాణ్ణి. కానీ ఆ విధమైన భావం నా తెలివితక్కువతనాన్ని సూచిస్తుందని త్వరలోనే గ్రహించాను. మీ ఫొటో చూసిన తర్వాత మీ ఒంటిరంగు ఎలాగున్నా మీలోని ఆకర్షణ ఏమాత్రం తక్కువ కాదని- అభిప్రాయపడ్డాను. అంతే చాలు. నల్లపిల్ల అయినంత మాత్రాన అందవిహీనురాలు కానక్కరలేదు.

కానీ నాకున్న దురలవాటును మీకు చెప్పదలిచాను. నేను దినానికి పదిహేను నుండి ఇరవై సిగరెట్లు ఊదేస్తుంటాను. పొగ పీల్చడం వల్ల నా దగ్గర సహింపరాని పొగవాసన- అది ఊపిరి వదలడం వల్ల బయటికి వస్తుందని- సిగ్గుతో మహిళలు ఆ విషయాన్ని బహిర్గతం చేయలేక పోతున్నారని మా వదినగారొకరు చెప్పగా విన్నాను. కానీ బ్రిటిష్ స్త్రీలను అనుకరిస్తూ పొగపీల్చడం ఈ మధ్య అలవాటు చేసుకొన్న కొద్దిమంది బెంగాలీ యువతుల విషయంలో నిజం కాకపోవచ్చు. మీరు మాత్రం ఆ తెగవారిలో చేరియుండరని నాకు గట్టి నమ్మకం. నేను పొగపీల్చే విషయంలో మీకు ఏమాత్రం అభ్యంతరమున్నా తిరుగుటపాలో నాకు తెలియజెయ్యి. నేను ఈ సంబంధం మీకు కుదరకుండా చేస్తాను.

నీ నిష్కపటియైన
సుకాంత్"

నాలుగునాళ్ళ తర్వాత సునంద నుండి జవాబు అందింది.

"మాడిన పొగవాసన విషయంలో నాకు అభ్యంతరం లేదు. కానీ సిగరెట్లు కాల్చడం వల్ల కాన్సర్ వ్యాధి వస్తుందని విన్నాను. అలాంటప్పుడు మీరు హుక్కా ఎందుకు



పీల్చకూడదు. హుక్కా వాసనకూడా నాకే మి ఇబ్బందికరం కాదు. ఇప్పుడు- నాకున్న చెడ్డ అలవాటును కూడా మీ ముందు ఒప్పుకోవడం సమంజసమని తలుస్తాను. నేను రోజుకు ఇరవైనుండి ఇరవైఐదు వరకు బీడాలను పొగాకు మిశ్రమంతో లాగించేస్తుంటాను. కాబట్టి నా పండ్లు ఎంత గారపట్టి పోయి ఉంటాయో ఊహించగలరనుకొంటాను. ఎక్కువ తమలపాకులను, పొగాకును నమిలేవాళ్ళు ఊపిరి విడిచినప్పుడు ఎంత దుర్వాసన వెలువడుతుందో జనం చెప్పుకోగా విన్నాను. చిన్నవాడైన మా తమ్ముడు లంబూ స్వల్పమైన వాసనను కూడా కనిపెట్టడంలో కుక్క కంటే అధికుడని చెప్పవచ్చు. కృష్ణసాహినీ దేవి రేడియోలో కార్యక్రమాలను తెలియజేస్తున్నప్పుడు ఆమె నోటి నుండి వెలువడే దుర్వాసనను పసిగట్టగలనని ధీమా వ్యక్తం చేస్తుంటాడు. ఉస్తాద్ బడేగులాం ఆలీఖాన్ రికార్డును వినిపిస్తున్నపుడు కూడా వెల్లుల్లి వాసనను పసిగట్టగలుగుతాడు. నేను తమలపాకులు నమలడం మీకు ఇబ్బందికరం కానప్పుడు ఆ విషయం తెలియజేయండి. లేకుంటే ఈ సంబంధాన్ని నిలిపివేయడానికి ఆలోచిస్తాను.

నిష్కపటియైన
సునంద"

సుకాంత్ జవాబు ఇలా నడచింది.

"నేను పొగ పీల్చడాన్ని మీరు పట్టించుకోనప్పుడు మీ తాంబూల సేవనాన్ని నేనూ సహిస్తాను. పైగా మా ఫ్యాక్టరీలో అమ్మోనియా ఎక్కువగా తయారవుతుంది.



కాబట్టి ఆ ఘాటు వాసనకు అల వాటు పడ్డా ను. మీరు ప్రతిపా దించిన హుక్కా పీల్చడాన్ని గురించి ఆలోచిస్తాను. ఏ విధంగానైనా మిమ్మల్ని మోసం చేయదలచలేదు. కాబట్టి నాకున్న మరో తప్పిదాన్ని మీ ముందుంచుతున్నా ను. మరో మగాడితో పరిచయంలేని కన్య ను భర్త కోరుకొన్నట్లే, మరో స్త్రీతో పరిచ యంలేని పురుషుడ్ని స్త్రీ కూడా కోరుకొం టుంది. ఈ విషయంలో నాది పరిశుభ్ర మైన హృదయం కాదని ఒప్పుకొంటు న్నాను. ఒకమాటలో చెప్పాలంటే నాది నిష్కళంకమైన హృదయం కాదు. నేను మొదట్లో సురంగి అనే యువతిని ప్రేమిం చాను. ఆమె కమిషనర్‌గారైన లాలా తాపీ చంద్ జోప్రాగారి కుమార్తె. వారి తల్లిదం డ్రులకు మా వివాహాన్ని గురిం చి ఏ విధమైన ఆక్షే పణ లేదు. కానీ సురంగి చివరి నిముషంలో తన అభి ప్రాయాన్ని మార్చుకుంది. ఈ మధ్యనే వాణిజ్యశాఖలో పనిచేస్తున్న హనుమం తయ్య అనేవాడిని వివాహమాడింది. అతడు కారునలుపుతో యమదూతలా కని పిస్తాడు. కానీ నా జీతంకంటే మూడురె ట్లు ఎక్కువ జీతం సంపాదిస్తాడు. నా హృదయంలోని గాయం ఇప్పుడిప్పుడే మా

నుకొన్తోంది. మనం వివాహం చేసుకొన్న తర్వాత అది శాశ్వతంగా మాయమవుతుం దని నా నమ్మకం. సురంగి ఫోటో ఒకటి నా వద్ద ఉంది. మీ సమక్షంలోనే దాన్ని కాల్చివేస్తాను. సురంగి వివాహం చేసుకొన్న తర్వాత కాలం వృథాచేయకుండా నేను కూడా వివాహం చేసుకోవడం సమంజస మని గ్రహించాను.

నా ఖాళీ సమయంలో బొమ్మలు గీయడం, ఫోటోలు తీయడం, శాస్త్రీయ ప్రయోగాలు చేయడం నా అభిరుచి. ఒక ఇల్లాలు ఉండి ఇంటి విషయాలు చూసుకొంటూ, నా భుజాల నుండి భారాన్ని తగ్గించగలిగితే, నా అభిరుచులను మరింత సమర్థవంతంగా నిర్వహించగలను. ఉన్నట్లుండి ప్రేమలో పడడం తెలివితక్కువ పని. భార్యాభర్తలు ఒకరినొకరు అర్థం

అనువాదం :
**శ్రీకాశ్యప**

చేసుకొని జీవించినందువలన క్రమంగా ప్రేమ అభివృద్ధి చెందుతుంది. తనకు సంతానం కలగనంతవరకు ఆ కలగబోయే బిడ్డను గురించి తెలియదు. కానీ సంతానం కలిగిన తర్వాత ఆ బిడ్డను ప్రేమించడం తల్లిదండ్రులు కష్టమని భావించరు. అలాగే ఒకవ్యక్తి తన కాబోయే జీవిత భాగస్వామిని ముందుగా చూడకపోయినప్పటికీ అడ్డంకి కాదు. ఆ ఉద్దేశంతోనే ఆ విషయాన్నంతా మా బాబాయిగారికి వదిలేశాను. ఇప్పుడు నన్ను, నా స్వభావాన్ని, శీలాన్ని గురించి తెలియజేశాను. వీటన్నిటినీ మీరు సమ్మతించే పక్షంలో నాకు తెలియజెయ్యండి.

నీ విశ్వాసపాత్రుడైన
సుకాంత్"

అందుకు సునంద జవాబు ఇలా సాగింది.

"మీ శీలము, మీ స్వభావము, మీ అభిప్రాయములను గురించి నాకు అభ్యంతరం లేదు. మీ ఉత్తరాలను బట్టిచూస్తే మీరు అభ్యుదయ వాదులుగా తెలుస్తోంది. కాబట్టి నా బలహీనతను కూడ మీకు తెలియజేయడానికి బాధపడటం లేదు. పవన్‌కుమార్ అనే ఒక పోస్టుగ్రాడ్యుయేట్ విద్యార్థితో నేను కూడ ప్రేమలో పడ్డాను. కానీ అతడు బాధురి. అంటే బ్రాహ్మణుడు. కాబట్టి పురాతనాచారాలు గల అతని తల్లిదండ్రులు నన్ను కోడలిగా స్వీకరించడానికి అంగీకరించలేదు. ప్రస్తుతం పవన్ ఉన్నతమైన పదవిలో బెంగుళూరులో పని చేస్తున్నాడు. కానీ మీలాంటి మహోన్నత భావాలుగల వారిని భర్తగా పొందినపుడు అతనిని మరచిపోగలననే ధైర్యం నాకున్నది. నా ఉద్దేశ్యంలో సురంగి, పవన్‌గార్ల ఫోటోలను అగ్నికి ఆహుతి చెయ్యడంలో అర్థంలేదు. అందుకు భిన్నంగా వారి ఫోటోలను ఒకే ఫ్రేములో చేర్చి మన పడకగదిలో ఉంచడం భావ్యమేమో! అది విషానికి విరుగుడుగా పనిచేస్తుంది. అది మంచి అభిప్రాయమని తెలపలేరా! ఇందుకు మీరేమంటారో తెలియజెయ్యండి.

మీ విశ్వాసపాత్రురాలు,
సునంద"

సుకాంత్ ఇలా బదులు రాశాడు.

"సునందా! మన మధ్య ఏ రహస్యాలూ లేవు. కాబట్టి ఇప్పుడు మిమ్మల్ని మీ పేరుతో సంబోధిస్తున్నాను. అంతేకానీ మన ఇద్దరి మధ్య అంతరం తగ్గిందని కాదు. నేను కొంచెం తీవ్రవాదినని లోకుల అభిప్రాయం. మీరు బిఎస్సీ పరీక్ష తప్పినప్పటికీ తెలివైనవారేనని మా బాబాయిగారు రాశారు. మీ భావాలు, నా భావాలు ఒకదానికొకటి అతికినట్లున్నవి. మానసిక వేత్తల సిద్ధాంతం ప్రకారం ఇది ఆదర్శప్రాయమైన విషయం. నిజానికి ఇది మన

జీవితగమనానికి తగినది కదా! ఈనాడు ఫాల్గుణం పదహారవరోజు. మన వివాహానికి ఆరురోజుల వ్యవధి మాత్రమే. నా భావనలో- మీ సమక్షంలో పులకరిస్తున్న శరీరంతో ఆనందాన్ని అనుభవిస్తున్నట్లున్నది.

ఎల్లప్పటికీ మీవాడైన
సుకాంత్"

సునంద చివరి ఉత్తరం కొద్దిరోజులకే చేరింది.

"నేను చాలా తీవ్రమైన డోలాయమానస్థితిలో పడ్డాను. పవన్‌బాధురి అకస్మాత్తుగా మారాడు. నన్ను చూడడానికి నిన్న వచ్చాడు. 'సునందా! నా మాట విను. నేనిప్పుడు స్వతంత్రుడను. మంచి జీతం సంపాదిస్తున్నాను. మా తల్లిదండ్రుల మాటలు వినవలసిన అవసరం నాకు లేదు. నీవు నాతో బెంగుళూరు వచ్చేయ్. అక్కడ రిజిష్టరు పెండ్లితోనైనా లేదా హిందూ సాంప్రదాయకంగానైనా నీ ఇష్టం వచ్చిన విధానంలో ఒకటవుదాము' అన్నాడు.

ఇవి తాజా పరిణామాలు. మీరు నా పరిస్థితిని అర్థం చేసుకొన్నారనుకొంటా... అతన్ని వ్యర్థంగా వెళ్ళమని చెప్పలేకపోయాను. నిజానికి మీ పెళ్ళికి రెండురోజుల ముందుగా నేను అతనితో వెళ్ళుతున్నాను. కానీ మీ విషయంలో కూడా నా బాధ్యత నెరవేర్చవలసి ఉంది. మీకు ఏవిధమైన ఏర్పాటు చేయకుండా నేను వెళ్ళను. నా చెల్లెలొకటి నందా అని నాకంటే రెండేళ్ళు చిన్నది. అది కూడా చూడటానికి నాలాగే ఉంటుంది. కానీ నాలాకాకుండా తెల్లని రంగు గలది. అది కూడా బీఎస్సీలో డుమ్మా కొట్టింది. అది పొగాకుగానీ, తమలపాకులు గానీ వాడదు. కాబట్టి దాని పండ్లు ముత్యాల్లా మెరిసిపోతుంటాయి. అది ఇంతవరకు ఎవరితోనూ ప్రేమలో పడలేదు. మీరు రాసిన ప్రతి ఉత్తరాన్ని అది చదివింది. ఆపై మీపై మోజు పెంచుకొంది. నిజం చెప్పాలంటే మిమ్మల్ని పెండ్లి చేసుకోవాలని పడిచస్తోంది.

సుకాంత్‌గారూ! ఈ విషయాన్ని గురించి రభస చేయకండని మిమ్మల్ని వేడుకొంటున్నాను. ఎవరికీ ఈ విషయాన్ని తెలియజేయవద్దని ప్రార్థిస్తున్నాను. మీరు బంధుమిత్ర సమేతంగా అనుకొన్న ప్రకారం పెండ్లికి తరలిరండి. పురోహితుడు చెప్పినట్లు వేదమంత్రాల్ని వల్లెవేయండి. మా తండ్రి నందాను కన్యాదానం చేసి మీ వివాహం జరిపిస్తాడు. ఆమె మిమ్మల్ని సంతోషపరచగలదని నేను నమ్ముతున్నాను. ఇంటి బాధ్యతలను మీ భుజాలనుండి తొలగించి భరించడమే గాకుండా నందా పనులన్నీ చేసిపెడుతుంది.

సొంత చెల్లెల్ని గురించి ఇంతగా ప్రశంసించడం బాగుండకపోవచ్చు. ప్రతి విషయంలోను నందా నన్ను ఓడించగలదు. ప్రస్తుతానికి నమస్తే! నేను భవిష్యత్తులో మిమ్మల్ని కలుసుకోవడం తటస్థిస్తే స్వయంగా క్షమాపణలు చెప్పుకుంటాను.

మీ విశ్వాసపాత్రురాలు
సునంద"

ఆ ఉత్తరం చూడగానే సుకాంత్ కలవరపడ్డాడు. అదే సమయంలో కోపోద్రిక్తుడయ్యాడు. అంతలోనే శాంతించాడు. అతడు తార్కికుడు. సహేతుకంగా ఆలోచించేవాడు కాబట్టి సునంద ప్రతిపాదనను పనికిమాలినదిగా తోసిపుచ్చలేకపోయాడు. తాను ముఖ్యంగా ఆలోచిస్తున్న ఇంటిపనుల నిర్వహణలో ఎవరినైనా వివాహం చేసుకోవచ్చనే అభిప్రాయానికి వచ్చాడు.

సుకాంత్ బాబాయి గారింటికి చేరాడు. అక్కడంతా ప్రశాంతంగానే ఉంది. బంధుమిత్ర సమేతంగా పెండ్లికి తరలివెళ్ళి పెళ్ళి విడిదిలో బసచేశారు. ఏ రకమైన అలజడి కనిపించలేదు. పదహారేళ్ళ పిల్లవాడొకడు అతిథులకు బీడాలు, సిగరెట్లు అందించడం చూశాడు సుకాంత్. అక్కడివారు అతణ్ణి

'లంబూ' అని పిలుస్తున్నారు. ఆ పిల్లవాణ్ణి దగ్గరకు పిలిచి "నీవు సునంద తమ్ముడివా? " అని ప్రశ్నించాడు.

"అవును" లంబూ జవాబు.

"విశేషాలేమిటి? "

"అంతా సక్రమంగానే ఉంది. అక్కయ్యను సువాసినులందరూ అలంకరిస్తున్నారు. కార్యక్రమం మరికొంతసేపట్లో ప్రారంభమవుతుంది"

"సునంద అప్పుడే వెళ్ళిందా? "

"ఏంటి మీరనేది? అర్థం కావడం లేదు. పెళ్ళికూతురు ఎక్కడికి పోతుంది? "

"మీ మరో అక్కయ్య నందా విషయమేమిటి? " ప్రశ్నించాడు సుకాంత్.

"చాలా తమాషాగా మాట్లాడుతారండీ మీరు. నాకున్నది ఒక్కటే అక్కయ్య ఆమెనే మీరిప్పుడు వివాహమాడబోతున్నారు"

"ఓహ్!" అన్నాడు సుకాంత్ కళ్ళు తిప్పుతూ..

ఆ రాత్రి అందరూ భోజనాలకు విడిదిని విడిచివెళ్ళారు. ఒంటరిగానున్న ఆవిడతో "మీరు నందా? సునందా? " అని అడిగాడు సుకాంత్.

"రెండూనూ! నా అసలు పేరు సునంద. అందరూ 'నందా' అని పిలుస్తారు"

"ఉత్తరాల్లో అబద్ధాల మాటలనెందుకు దొర్లించావు? "

"నాకు ఏ ఉద్దేశమూ లేదు. ఎంత మాత్రం నా పరీక్షకు నిలువగలరనే కుతూహలం కొద్దీ సత్యవంతుడు, ఉదారహృదయుడైన నా కాబోయే భర్తను పరీక్షించాను" అని కళ్ళలో నీళ్ళు తిరుగుతుండగా తల వాల్చి జవాబు చెప్పింది సునంద.

"నీ పవన్ ఏమయ్యాడు? "

"ఉష్‌కాకి! గాలిలో కలసిపోయాడు. అలాంటి పేరుగల మనిషి ఎక్కడా సజీవిగా లేడు. కానీ అందమైన హనుమాన్ చిత్రం మాత్రం ఒకటుంది. దాన్ని మీ 'సురంగి' ఫొటోతో చేర్చి పటంలో బిగిద్దాం" అన్నది నవ్వుముఖంతో.

"నీవొక కొంటెపిల్లవు. అందుకే పరీక్షల్లో ఈకలు పీకావు"

"సరే! అలాగైతే 'జునోమిట్టర్' క్లాసులో అందరికంటే తెలివైందిగా ఎట్లా రాణిస్తోంది? అది నా కంటే కొంటెది"

"నిజంగానా? "

"నేను లెక్కల్లో మొద్దును. 'మాక్స్‌వెల్ సిద్ధాంతమే' నాకు రాదు. అందుచేతనే పరీక్ష తప్పాను"

"ఎందుకలా? అది సాధారణ విద్యుదయస్కాంత సిద్ధాంతం కదా! దాన్ని గురించి వివరిస్తా. అది V= 10- 7 wb..."

"ఆగండాగండి! పెళ్ళిపందిరిలో లెక్కలను గూర్చి చర్చించడం భయంకరమైన అపశకునం" సునంద అడ్డుచెప్పింది.

"మంచిది. అయితే రేపే చెప్తాను"

"రేపు కాళరాత్రి, రేపంతా నేను మిమ్మల్ని చూడకూడదు. ఇక ఎల్లుండి రాత్రి పూలశయ్య దగ్గరే పునర్దర్శనం"

"సరే! ఎల్లుండి రాత్రే బోధిస్తాను"

"ఓరి భగవంతుడా! మన పూలపాన్పు దగ్గర రాత్రి లెక్కలను గురించి మాట్లాడుకోవడం పాపమని మీకు తెలియదా? మా నాన్నమ్మ అన్ని విషయాలు ఆరా తీస్తుంటుంది! శోభనపు రాత్రిని మనవడు మన వరాలికి లెక్కలు నేర్పడానికి ఉపయోగిస్తున్నాడని తెలిస్తే ఆవు పంచితంతో మీ నోరు శుభ్రం చేయిస్తుంది. ఇప్పుడు లెక్కలకు తొందర ఏమొచ్చింది? నేనెక్కడికి పారిపోవడంలేదే? సంవత్సరం దాటనీ, ఆ పైన తీరిగ్గా మీరు నాకు పాఠం చెప్పొచ్చు"

"నీవు చెప్పేది నిజమే! నీవు చాలా అందంగా కనిపిస్తున్నావు"

"నిజమా! మీ దృష్టి నిశితమైందే" అంది సునంద.

"నేను వాంఛించేది..."

"మీ వాంఛలకు ఇప్పుడేం తొందరలేదు. ప్రస్తుతానికి నిద్రపొండి. సరేనా? " V

తెలుగు కథ

- ఆర్.వి.చలపతి



# ఏదీ నీ కల?

"ఫాదర్ గారు ప్రభువు సన్నిధి చేరు కున్నారు రామం!" అని పీటర్ ఫోన్ చేసి నప్పుడు నాకు నోట మాట రాలేదు.

'ఆయన వయస్సు ఎనభై ఏండ్ల పై మాటే కాబట్టి తొందరగా పోయారని చెప్ప లేము. కానీ ఆ వయస్సులోనూ ఆయన సంపూర్ణ ఆరోగ్యంతోనే ఉండేవారు. ఇంకా కొంతకాలం ఉండి ఉంటే ఆ జ్యోతి మరి కొన్ని జ్యోతులను వెలిగించి ఉండేది కదా!' అనిపించింది నాకు.

మొదట నాకు ఫాదర్ ఎడ్విన్‌గారు పరిచయమయింది పీటర్ ద్వారానే. అప్పట్లో నేను ఇంకా ఉద్యోగంలో చేరలేదు. విశ్వవిద్యాలయంలో నాతోబాటు చదువుకున్న స్నేహితులను కలుసుకోవడం, ఒకరి ఇంటికి ఒకరు రావడం, పోవడంతో కాలం గడుపుతుండేవాళ్ళం. పీటర్, జోసెఫ్, స్టాన్లీ అందరికన్నా సన్నిహితులు నాకు. ప్రతి క్రిస్‌మస్‌కూ వాళ్ల ఇళ్లలో ఎవరో ఒకరి ఇంటికి వెళ్ళడం, సరదాగా వాళ్ళ కుటుంబంలో ఒకడిగా పండుగ వేడుకల్లో పాలు పంచుకోవడం, దీపావళి, సంక్రాంతిలాంటి పండుగలప్పుడు వాళ్ళను మా ఇంటికి పిలువడం తప్పనిసరిగా జరిగేది. కానీ నాకు మాత్రం ఎందుకో నేను వాళ్ళింటికి వెళ్ళినప్పుడు ఆ కుటుంబంలో వాళ్ళ పద్ధతికీ, వాళ్ళు వచ్చినప్పుడు మా ఇంట్లో వాళ్ళ పద్ధతికీ చాలా తేడా కనిపించేది.

వాళ్ల పండుగ రోజుల్లో వాళ్ళతోబాటు ఉదయాన్నే నన్ను కూడా చర్చికి తీసుకువెళ్ళేవారు. అక్కడి నుండి రాగానే ఇంట్లో విందుభోజనం. అందరూ కలిసి కూర్చుని చేసేవాళ్ళం. పరాయివాళ్ళ ఇంట్లో ఉన్నానన్న భావం కలిగేది కాదు నాలో. అదే వాళ్ళెవరైనా మా ఇంటికి వచ్చినప్పుడు మా ఇంట్లోవాళ్లు అంత కలివిడిగా ఉండేవాళ్ళు కాదు. అయినా పాపం వాళ్లు పట్టించుకునే వాళ్ళు కాదు. అందువలన మా స్నేహానికి ఏ విధమైన ఆటంకమూ ఏర్పడలేదు.

ఆ రోజుల్లోనే నాకూ మార్గరెట్‌కూ నడుమ ప్రేమ అంకురించింది. స్టాన్లీ అక్క మార్గరెట్. అతనికన్నా అయిదేళ్లు పెద్దది. స్టాన్లీ కన్నా ఒక యేడు పెద్దవాడినయిన నాకూ, మార్గరెట్‌కూ నాలుగేళ్లు తేడా. వాళ్ల తల్లితండ్రులకు మార్గరెట్, స్టాన్లీ ఇద్దరే సంతానం. వాళ్ల నాన్న డెప్యూటీ కలెక్టర్‌గా పనిచేసి పదవీవిరమణ చేశారు. ఇప్పుడు నాకు ఇరవై నాలుగేళ్లు. మార్గరెట్‌కు ఇరవై ఎనిమిదేళ్లు. అప్పటివరకు ఆమెకు మూడు సంబంధాలు చూశారు. అందులో ఒకరికి మార్గరెట్ నచ్చలేదు. మిగిలినవారు మార్గరెట్‌కు నచ్చలేదు.

"మనుష్యుల రూపాలను చూసి వాళ్ళ గుణగణాలను అంచనా వేయగలమా? ఈ నచ్చడం, నచ్చకపోవడం వేరేవిధంగా ఆలోచించాల్సిన విషయం అనుకుంటాను" అన్నాను ఓరోజు మార్గరెట్ వాళ్ల నాన్నతో..

"అదీ నిజమే! మనం వివాహం చేసుకోదలచుకున్న వాళ్ళతో వారం, పది రోజులు గడిపితేగానీ వాళ్ల గురించి పూర్తిగా అర్థం చేసుకోలేం. దురదృష్టవశాత్తు మన దేశంలో ఇతర దేశాల్లోలాగా 'డేటింగ్' చేసే పద్ధతి లేదు" అన్నాడు వాళ్ళ నాన్న డేవిడ్.

"డేటింగ్ చేసినంత మాత్రాన పూర్తిగా అర్థం చేసుకున్నట్టు కాదు. ఆ వారం, పది రోజుల్లోనూ తమ ప్రవర్తనను మార్చుకొని, తరువాత తమ అసలు రూపం బయట పడితే ఏం చెయ్యగలం? " అని వాదించింది మార్గరెట్.

"అయితే జీవిత భాగస్వామిని ఎన్నుకోవడానికి వేరే మార్గం ఏముందంటారు? " అడిగాను నేను.

"మ్యారేజెస్ ఆర్ మేడ్ ఇన్ హెవెన్" అని నవ్వింది మార్గరెట్.

ఆ నవ్వు నన్ను వివశుణ్ణి చేస్తుంది. ఎందుకో మార్గరెట్ నవ్వితే మళ్లీ మళ్లీ చూడాలనిపించేది. అంతకుమించి వేరే అభిప్రాయమేదీ లేదు. ఆమెను ఆరాధనగా చూసేవాడిని. నా కళ్ళల్లో భావాన్ని చదివినట్లు ఆమె కళ్ళు చిలిపిగా నవ్వుతూండేవి. మా ఇద్దరి మధ్య జరిగే ఈ చూపుల భావ ప్రకటనలు ఇతరుల దృష్టికి అందేవి కావు.

★ ★ ★

ఒకరోజు బాగా వర్షం పడుతున్న సాయంత్రపు వేళ... వర్షం ధాటికి తట్టుకోలేక దగ్గరలోనే ఉంది కదా అని స్టాన్లీ వాళ్ళింటికి వెళ్లాను. ఆ సమయంలో స్టాన్లీ ఇంట్లో లేడు. వాళ్ల తల్లితండ్రులు కూడా

ఎవరిదో పెళ్ళికి వెళ్ళారు.

"అరె! ముద్దగా తడిసిపోయావేమిటీ? " అని నన్ను కూర్చోమని చెప్పి, తువ్వాలు తెచ్చి నా తల తుడవసాగింది మార్గరెట్. అలా తుడుస్తున్నప్పుడు ఆమె వక్షోజాలకు నా మొహం ఆనింది. సన్నటి పరిమళం వస్తున్న ఆ వెచ్చని, మెత్తని ప్రదేశానికి నా మొహం తగులుతూంటే హాయిగా ఉన్న ట్టు అనిపించింది. అది కామోద్రేకం మా త్రం కాదు. ఏదో ఫలానా అని చెప్పలేని ఒక వింత అనుభూతి! తలను తుడవడం పూర్తిచేసిన మార్గరెట్ నా మొహాన్ని రెం డు చేతులతోనూ పట్టుకొని రెండు క్షణాలు సూటిగా నా కళ్ళలోకి చూసింది. మరు క్షణం ఆమె మెత్తటి పెదవులు నా పెదవు లతో కలిసిపోయాయి... నా చేతులు అప్ర యత్నంగా ఆమెను చుట్టేసి దగ్గరకు లా క్కున్నాయి. అయిదారు క్షణాలు పరిసరా లను మరచిపోయిన నేను ఉన్నట్టుండి ఆమెను బలవంతంగా వదిలించుకున్నాను. అప్పటికే నా శరీరం సన్నగా కంపిస్తోంది. తప్పు ఎవరిదని ఆలోచించలేదు. జరిగినదా నికి నేనూ బాధ్యుడినే కనుక తల వంచుకు న్నాను.

"తప్పయిపోయింది.." అన్నాను నంగి నంగిగా.

మార్గరెట్ నవ్వి "ఏమంత తప్పు జరిగిం దంటావు? " అని అడిగింది.

నేను సమాధానమిచ్చేలోగానే హఠాత్తు గా నన్ను మళ్లీ దగ్గరకు లాక్కుని నా పెద వులను సుతారంగా కొరికి ముద్దుపెట్టు కుంది. కాసేపు నిస్సత్తువగా కూర్చుండిపో యిన నేను ఉన్నట్టుండి లేచి మార్గరెట్ పిలుస్తున్నా వినిపించుకోకుండా అక్కడి నుండి వేగంగా బయటపడ్డాను.

ఆ రాత్రంతా నేను నిద్రపోనేలేదు. ఆలో చనల సుడిగుండంలో చిక్కుకుని అల్లాడిపో యాను. ఆ సమయంలో స్టాన్లీగానీ, వాళ్ల తల్లితండ్రులు గానీ వచ్చి ఉంటే పరిస్థితి ఎలా ఉండేది? అన్న భయం ఒకవైపు, ఆ వెచ్చని, తీయని అనుభవం మళ్ళీ మళ్ళీ కావాలనే ఆరాటం ఒకవైపు.. ఈ ఆలోచన లతో రెండు రోజులపాటు వాళ్ళింటికి వెళ్ళనే లేదు. మూడో రోజు స్టాన్లీ వెతు క్కుంటూ వచ్చాడు.

"ఏరా! రెండు రోజులుగా ఏమైపో యావు? ఈ రోజు మా అమ్మా, నాన్నల పెళ్ళిరోజు. నిన్ను తీసుకువెళ్దామని వచ్చా ను. బయలుదేరు.." అన్నాడు.

మౌనంగా బట్టలు మార్చుకుని వాడి వెంట నడిచాను. ఆహూతులు చాలా మంది వచ్చారు. వచ్చిన వాళ్ళకు పరిచ ర్యలు చేయడం, ఫలహారాల ప్లేట్లు, కాఫీలు అందించడం లాంటి పనుల్లో నేనూ, నా మిత్రులూ పాలుపంచుకున్నాం.

అందరూ వెళ్ళిపోయాక డేవిడ్, ఆయన భార్యా కూడా వాళ్ళ గదిలోకి వెళ్ళిపో యారు. పీటర్‌నూ, జోసెఫ్‌నూ వాళ్ల ఇళ్ళ దగ్గర వదిలి వస్తానని స్టాన్లీ వెళ్ళిపో యాడు. మా ఇల్లు దగ్గరే కనుక నన్ను మాత్రం తను వచ్చేదాకా ఉండమని చెప్పి వెళ్ళాడు. నేనూ మార్గరెట్ మాత్రం మిగి లాము. నేను మాట్లాడకుండా తలవంచు కొని కూర్చున్నాను.

"రామం! నువ్వు మా మతం పుచ్చుకుం టావా? " హఠాత్తుగా అడిగింది మార్గరెట్.

నేను ఉలిక్కిపడ్డాను. అటువంటి ప్రస్తా వన వస్తుందని ఊహించలేదు నేను. నేను మౌనంగా ఉండటం చూసి "నేను వద్దా నీకు? " అనునయంగా అడిగింది.

ఆ రోజు జరిగింది కేవలం వయస్సు పొంగువల్ల అనుకున్న నాకు, ఆమె నిజం గానే నన్ను కోరుకుంటోందని తెలియగానే గుండెలోంచి ఆనందం పొంగుకొచ్చింది.

"మీరు నన్ను ఇష్టపడుతున్నారా? " అని అడిగాను. నాకన్నా నాలుగేళ్లు పెద్దదయిన ఆమెను ఏకవచనంలో పిలవడానికి జంకు గా అనిపించి...

"కాబోయే భార్యను ఎవరైనా 'మీరు' అని పిలుస్తారా? " చిలిపిగా అడిగింది మార్గరెట్.

కాస్త ధైర్యం చేసి "కాబోయే భర్తను మాత్రం ఏకవచనంలో పిలుస్తారా? " అన్నాను.

"ప్రేమికుల నడుమ అటువంటి మన్ననలు ఉండవు కదా!" నా చేతులను పట్టుకొని తన నడుం చుట్టూ వేసుకుంటూ అందామె.

మొదటిసారి ఉన్న భయం ఆ రోజు కలగలేదు నాకు. ఇక ఆపుకోలేక ఆమెను దగ్గరకు లాక్కుని బుగ్గలమీదా, పెదాల మీదా మళ్ళీ మళ్లీ ముద్దు పెట్టుకున్నాను.

రోజులు గడిచేకొద్దీ మా బంధం బలపడసాగింది. అయితే ఎవరికీ మా గురించి అనుమానం కలిగేలా ప్రవర్తించలేదు మేము. నాకు ఉద్యోగమంటూ ఏమీ లేకపోవడంతో మా వివాహ విషయంలో ఏ నిర్ణయానికీ రాలేకపోతున్నాను. మార్గరెట్ కూడా తొందరపడలేదు.

ఆరోజు సెలవు రోజు కావడంతో నాన్న, ఇద్దరు చెల్లాయిలు కూడా ఇంట్లోనే ఉన్నారు. అందరం కూర్చుని టీవీలో ఏదో భక్తి సినిమా వస్తుంటే చూస్తున్నాం. ఆ సినిమాలో చాలా విషయాలు అసహజంగా కనిపించసాగాయి. నారదుడు పెట్టిన తగవుతో లక్ష్మి, పార్వతి, సరస్వతి తమలో తాము ఎవరు గొప్ప? అని తేల్చుకోవడానికి పంతాలకు పోతారు.

"ఈ ఎక్కువ, తక్కువ తారతమ్యాలూ, రాగద్వేషాలూ మనుష్యులకులాగే దేవతలకూ ఉంటే, వాళ్ళు మనకన్నా ఏవిధంగా గొప్ప వాళ్ళవుతారు? " అన్నాను నేను.

"ఏదైనా మనం చూసే దృష్టిలో ఉంది. దేవతలు కోపతాపాలు ప్రదర్శించినా అవి లోకకల్యాణార్థం వాళ్లు ఆడిన నాటకంగానే చూడాలి. ఏ దేవతల కోపమైనా మరో దేవతకు కీడు చేసినట్టు విన్నామా? " అన్నారు నాన్నగారు.

"లక్ష్మీదేవి అలిగి వైకుంఠాన్ని వదిలి వచ్చేస్తే, ఆమెను వెదుక్కుంటూ మహావిష్ణువు తిరుమల గిరులపైకి వస్తాడు కదా! అందులో...." నేను పూర్తిచేయక మునుపే అమ్మ అందుకొంది "అందులోనూ వకుళ పూర్వజన్మ వృత్తాంతమూ, వేదవతి పూర్వజన్మ వృత్తాంతమూ ముడివడి ఉందని తెలుసా? మిడిమిడి జ్ఞానంతో మన పురాణాలను మనమే తేలిక చేసి మాట్లాడకూడదు"

"వేద శాస్త్రములు చదివిన వారే ఎరుగరు సృష్టి విలాసం! అల్ప బుద్ధితో జ్ఞానదాతనే సలుపకు పరిహాసం" అని రాగం తీసింది పెద్ద చెల్లెలు పద్మ.

"నేనేమీ పరిహాసం చేయడం లేదు. చేసే వాళ్ళ గురించి చెబుతున్నాను. ఈ సినిమాల్లో కొంతమంది దేవతలను పిరికివాళ్ళుగా, ఒక్కోసారి వెకిలివాళ్ళుగా చూపిస్తూంటారు. ఆ సినిమాలన్నీ మీలాంటి వాళ్ల వల్లే కదా పెద్ద పెద్ద లాభాలు సంపాదించేది. పత్రికల్లో చూడరాదూ దేవుళ్ళను అపహాస్యం చేస్తూ కార్టూన్లూ, వాటిని చూసి కడుపుబ్బ నవ్వుకున్నామని పాఠకులు ఉత్తరాలూ! మనస్ఫూర్తిగా చెప్పండి. వేరే ఏ మతం వాళ్ళయినా వాళ్ళ దేవుళ్ళను అపహాస్యం చేస్తూ కార్టూన్లు వేయడం, సినిమాలు తీయడం చేస్తున్నారా? ఎవరైనా చేసినా ఊరుకుంటారా? మనవాళ్ళకే తగింది అది. ఏదీ వేరే ఏ మతం దేవుళ్ళనయినా ఇలా కమెడియన్‌గా చిత్రిస్తూ ఒక సినిమా తీయమనండి. లేదా ఒక కార్టూన్ గీయమనండి. ప్రపంచ వ్యాప్తంగా ఎన్ని కలవరాలు జరుగుతాయో, ఎన్ని నిరసనలు వెలువడుతాయో చూద్దురు" అన్నాను ఆవేశంగా.

"ఉన్నట్టుండి మతాల మీద నీకు ఇంత అవగాహన ఎలా ఏర్పడిందో? ఎవరి ప్రభావమో? " అంది చిన్నచెల్లెలు శాంతి.

✍ కన్నడ కథ : **మునెమ్మ**
మూల రచయిత : **ఈశ్వరచంద్ర**
అనువాదం : రంగనాథ రామచంద్రరావు

✍ మలయాళ కథ : **జడివానలో..**
మూల రచయిత : **అంబికాసుతన్ మాంగడ్**
అనువాదం : డా. హెచ్. ఎస్. ఎమ్. కామేశ్వరరావు

✍ ఇంగ్లండ్ కథ : **మెరుపు తపాలా**
మూల రచయిత : **జెఫ్రీ ఆర్చర్**
అనువాదం : ఉప్పు రాఘవేంద్రరావు

జనవరి **విపుల** లో..

"ఎవరి ప్రభావమూ కాదు. తార్కికంగా ఆలోచించమంటున్నా!" అన్నాను కోపంగా.

రెండు రోజుల తరువాత పీటర్‌ను కలిసినప్పుడు చెప్పాను- "పీటర్! నేను మీ మతం పుచ్చుకుందామనుకొంటున్నాను"

పీటర్ నా వైపు అపనమ్మకంగా చూశాడు.

"మీ పెద్దవాళ్ళకు తెలుసా? " అని అడిగాడు.

"ఇది నాకు సంబంధించిన విషయం. నేను వేరే ఎవరి అనుమతీ తీసుకోనక్కర్లేదు" అన్నాను.

"మనం ఫాదర్ ఎడ్విన్ గారి దగ్గరకు వెళ్దాం. ఏం చేయాలో ఆయన నీకు వివరంగా చెబుతారు" అని నన్ను తీసుకువెళ్ళి ఫాదర్ గారికి పరిచయం చేశాడు పీటర్.

నాకు ఆయన్ను చూడగానే గౌరవం కలిగి, మనస్ఫూర్తిగా నమస్కారం చేశాను.

పీటర్ విషయం చెప్పగానే ఆయన భ్రుకుటి ముడిపడింది.

"నువ్వు ఏదైనా పని ఉంటే వెళ్ళి చూసుకో పీటర్! నేను ఇతనితో మాట్లాడుతాను" అన్నారు.

పీటర్ నా భుజం తట్టి సెలవు తీసుకున్నాడు.

"బాబూ! మీ నాన్నగారు ఏం చేస్తుంటారు? " అడిగారు ఫాదర్.

"ఆర్ట్స్ కాలేజీలో తెలుగు లెక్చరర్‌గా పని చేస్తున్నారండీ" అని చెప్పాను వినయంగా.

"నీకు తోడబుట్టిన వాళ్ళు? "

"నేనొక్కడినే మగ సంతానం. నా తరువాత ఇద్దరు ఆడపిల్లలున్నారు. వాళ్ళు ఇంకా చదువుకుంటున్నారు"

"ఒక మాట సూటిగా చెప్పు. మా మతంలో నిన్ను అంతగా ఆకర్షించిందేమిటీ? "

నేను మౌనంగా ఉన్నాను. నాకేం తెలుసని!

"పోనీ! మీ మతంలో నీకు నచ్చని అంశం ఏమిటీ? " మళ్ళీ అడిగారు ఫాదర్.

ఏం సమాధానం చెప్పాలో అర్థం కాలేదు. అయినా "మా వాళ్ళలో ఉన్న మూఢ నమ్మకాలూ, ఇంకా..." పూర్తి చేయ లేకపోయాను.

"ఊఁ.. ఇంకా? ఏం చెప్పాలో నీకే అర్థం కావడం లేదన్న మాట. మూఢనమ్మకాలు ఇతర మతాల్లో లేవనుకుంటున్నావా? " సూటిగా అడిగారాయన.

"నువ్వేం చదివావు? "

"ఇప్పుడే ఎం.ఏ. ఇంగ్లీషు పూర్తి చేశా నండీ. ఉద్యోగాల వేటలో ఉన్నాను"

"అంటే ఇంకా నీ కాళ్ల మీద నువ్వు నిల బడలేదనేగా! అప్పుడే అంత స్వతంత్రించి మతం మార్చుకునే నిర్ణయానికి వచ్చావంటే బలమైన కారణం ఉండాలే!"

నేను మౌనంగా తల వంచుకున్నాను.

"ఏదైనా ప్రేమ వ్యవహారమా? "

నేను మాట్లాడలేదు.

"ఆ అమ్మాయి క్రిస్టియన్ మతానికి చెందినదా? "

తల ఊపాను.

"నువ్వు మతం మారకుంటే ఆ అమ్మాయి నిన్ను పెళ్ళి చేసుకోదా? "

"వాళ్ల పెద్దలు ఒప్పుకోరని సందేహం"

"అంటే వాళ్ల పెద్దవాళ్లను ఒప్పించడం కోసం ఆ అమ్మాయి నిన్ను మతం మార మందా? మీ పెద్దవాళ్ళను ఒప్పించడానికి నువ్వేం చేయబోతున్నావు? ఆ అమ్మాయికి పెద్దవారి మీద ఉన్న గౌరవం నీకు నీ తల్లి తండ్రుల మీద లేదనుకోవచ్చా? " సూటిగా అడిగారాయన.

వాడైన అమ్ములా నా మనస్సును తాకిం దా ప్రశ్న. నా తల్లితండ్రుల మీద నాకు గౌరవం లేదా? ప్రేమ గుడ్డిది అనుకోవడా నికైనా మార్గరెట్‌ను నిజంగా ప్రేమిం చానా? ఆమె నవ్వితే మళ్లీ మళ్లీ చూడాల నిపించేది. అందమైన దేన్ని చూసినా మళ్లీ చూడాలనిపించేది సహజమే కదా! అది ప్రేమ అవుతుందా! బహుశా ఆమె నన్ను ప్రేమించి ఉండవచ్చు. కేవలం పెదవుల రుచి చూసి, వయస్సు పొంగులు చూసి తనను ప్రేమిస్తున్నట్టు భ్రమపడ్డానా?

"కేవలం ఆ అమ్మాయి కోసం నువ్వు మతం మారాలని అనుకుంటున్నావు. అవునా? " అడిగాడు ఫాదర్.

"అలా కాదు..."

"నువ్వు మీ మత గ్రంథాలు చదివావా? పోనీ బైబిల్‌ను ఎప్పుడైనా స్టడీ చేశావా? వివేకానందుని ఉపన్యాసాలు చదివావా? వివిధ మతారాధనలన్నీ భగవతత్త్వాన్ని తెలిపే వివిధ మార్గాలు అని చెప్పారా యన. ఏ మతాలూ మూఢ నమ్మకాలను సమర్థించవు. అన్ని మతాలలోనూ మూఢ నమ్మకాలుంటాయి. నువ్వు ఒక మతానికి చెందినవాడివి కావడంతో నీకు అందులోని కొన్ని నమ్మకాలు మూఢంగా కనిపిస్తు న్నాయి. ఇతర మతాలలోని మూఢ నమ్మ కాల గురించి నీకు తెలియదు. తెలిసినా వాటిని నువ్వు విమర్శించకూడదు. అలా చేస్తే నువ్వు పరమత ద్వేషివి అంటారు. భగవంతుడ్ని ఆరాధించడానికి కొన్ని కొన్ని సమూహాలు, కొన్ని కొన్ని పద్ధతులను ఎన్నుకుంటాయి. పాము, సాలెపురుగు, ఏనుగు, బోయవాడు వాళ్ళ వాళ్ళ పద్ధ తుల్లో శివుని పూజించినట్టు చదువుకోలేదా నువ్వు? మాంసం తెచ్చి ప్రసాదంగా... అదే నైవేద్యంగా పెట్టాడని తిన్నడిని ఆగ్ర హించాడా ఆ శివుడు?

'రుచీనాం వైచిత్ర్యాదృజుకుటిల నానాపథ జుషామ్

నృణామేకో గమ్యస్త్వమసి పయసామర్ణవ ఇవ' అని శివ మహిమ స్తోత్రం తెలుపు తుంది. వివిధ ప్రదేశాలలో పుట్టిన నదు లు సముద్రంలో కలుస్తున్నట్లు, వివిధ భా వాలతో మనం అవలంబించే ఆరాధనా మార్గాలు సరైనవైనా, వక్రమైనవైనా అవి

సర్వేశ్వరుడినే చేరుతున్నాయి అని ఆ స్తోత్ర సారాంశం. ఏసు పుట్టక మునుపు క్రైస్తవ మతం లేదు. బుద్ధుడు పుట్టక మునుపు బౌద్ధ మతం లేదు. హిందూయిజం అన్నది ఒక్క మతం కాదు.. అన్ని మతాల కలయిక. అందుకే హిందూ దేశంలో పుట్టినవాళ్ళందరూ హిందువులయ్యారు. మొదట ఈ మతాలకు ముందు ఉన్నదంతా ఒక ధర్మం మాత్రమే. ఆ ధర్మాన్ని అవలంబించడానికి కొందరు ఎన్నుకున్న మార్గాలు కొన్ని మతాల ఆవిర్భావానికి దారితీశాయి. ఎవరైనా మా మతంలోకి మారుతామంటే వారిని ఆహ్వానించి ప్రోత్సహించడం నా కర్తవ్యమే. దానిని నేను కాదనడం లేదు. అయితే ఏ మతం గురించీ అవగాహన లేకుండా కేవలం స్వార్థం కోసం ఒక మతంలోంచి మరో మతంలోనికి మారడం కన్నతల్లిని త్యజించి ఇంకో స్త్రీని తల్లిగా స్వీకరించడం వంటిది. ముందుగా నీ మతాన్ని గురించి పూర్తిగా తెలుసుకో. తరువాత నీకు ఉత్తమమైనదని తోచిన మతాన్ని గురించి అధ్యయనం చెయ్. అప్పుడు నువ్వు తీసుకునే నిర్ణయం సరైనదిగా ఉంటుంది. హర్షించదగినదిగా ఉంటుంది. అదేదీ చేయడానికి నీకు ఓపిక లేకుంటే కనీసం ఒక విషయాన్ని నమ్ము. మనం ఏ దేవతారూపాన్ని అర్చించడానికి ఇష్టపడతామో అలాంటి స్థిరమైన శ్రద్ధను భగవంతుడే కలిగిస్తున్నాడు. దాన్నే భగవద్గీతలో శ్రీకృష్ణుడు ఇలా అంటాడు.

'యోయో యాంయాం తమం భక్తాః
శ్రద్ధయార్చితు మిచ్ఛతి
తస్య తస్యాచలాం శ్రద్ధాం
తామేవ వరదామ్యహమ్॥'

అదంతా వదిలెయ్. నువ్వు మీ తల్లితండ్రులకు కొడుకుగా పుట్టినందుకు మొదట నీ కర్తవ్యాన్ని నిర్వర్తించాలి. ఇద్దరు చెల్లెళ్లు అంటున్నావు. నీ దారి నువ్వు చూసుకుంటే వాళ్ళకు రేపు పెళ్ళిళ్ళెలా అవుతాయి? ఎవరో అపహాస్యం చేస్తున్నారని నువ్వు నీ దేవుళ్ళను ద్వేషించకు. నిజానిజాలు తెలుసుకో. తరువాత ఏ నిర్ణయానికైనా రా. నువ్వెప్పుడు వచ్చినా స్వాగతమే. అయితే నిజమైన క్రిస్టియన్‌గా ఉండాలి. లేదా నిజమైన హిందువుగా ఉండాలి. లేదా చిత్తశుద్ధి కలిగిన ముస్లింగా ఉండాలి..."

ఆయన చెబుతుంటే నా కళ్ళకు కమ్మిన పొరలు విడిపోయినట్టయింది. మతం మారడం అంటే మాటలు కాదు. మన స్వార్థం కోసం మతం మారడం అంటే ఆ రెండు మతాలకూ మనం ద్రోహం చేస్తున్నట్టే అని అర్థమయింది. ఫాదర్ ఎడ్విన్ గారి వైపు చూశాను. నాకిప్పుడు ఆయన ఒక క్రైస్తవ ఫాదర్‌గా కాకుండా అపర ఏసు క్రీస్తులా, ఆది శంకరాచార్యునిలా, మహమ్మద్ ప్రవక్తలా కనిపిస్తున్నారు.

★ ★ ★

నేనూ, మార్గరెట్ పెళ్ళి చేసుకున్నాం. వాళ్ళ తల్లితండ్రులు మొదట ఒప్పుకోకున్నా చివరికి అంగీకరించక తప్పలేదు. ఏ మత సాంప్రదాయమూ పాటించకుండా మేము రిజిస్ట్రాఫీసులో వివాహం చేసుకున్నాం. మా పేర్లు మార్చుకోలేదు. మేము ఇప్పుడు ఏ మతానికీ చెందని వాళ్లం. మాకిప్పుడు ఏ మతమైనా సమ్మతమే. దేవుడు మాత్రం ఒక్కడే. అతని పేరు రాముడు. అతని పేరు జీసస్. అతని పేరు అల్లా. అతని పేరు సిద్ధార్థుడు. అతని పేరు...

మేము ఇద్దరమూ పనిచేస్తున్న అనాథ శరణాలయమే మా దేవాలయం. ఇక్కడ ఎందరో రాముళ్ళూ, జీసస్‌లూ, అల్లాలు ఉన్నారు. అందరు దేవుళ్ళ సేవలో మా జీవితాలను సఫలం చేసుకొంటున్నాం.

'లెట్ హిజ్ సోల్ రెస్ట్ ఇన్ పీస్' అనుకున్నాను. ఫాదర్‌ని తలచుకొని, సర్వాంతర్యామీ, సర్వనామధేయుడూ అయిన భగవంతుణ్ణి తలచుకొని ప్రార్థిస్తూ. V

అస్సామీ కథ



# ఓ పసివాడి కథ

- లక్ష్మీనాథ్ బెజుబరువా

సుకుమార్ గొప్పింటి బిడ్డ. దేనికీ లోటులేదు. ఆ కుర్రాడు బుద్ధిమంతుడు. కానీ చదువంటే గిట్టదు. పద్నాలుగేళ్లు వచ్చినా ఇంకా ఆంగ్ల మాధ్యమం నాల్గవ క్లాసులోనే ఉన్నాడు. "ఒరే.. చదవరా... చదువుకోరా" తండ్రి తెగ నసపెడ్తాడు వాడి వెంటపడి. పుస్తకం తెరిచికూర్చున్నా, వాడి బుర్ర మాత్రం ఏ చెట్టుకి మామిడి పండు బాగా మగ్గింది? ఏ చెట్టుపై ఉన్న పక్షి గూట్లోని పిల్లల్ని తెచ్చి పెంచుకోవాలి? చేపల్ని ఎలా పట్టాలి? కుక్క, పిల్లి, జింకపిల్లల్తో ఎప్పుడు ఎక్కడ ఆడాలి?

అనే ఆలోచిస్తుంది. స్కూలు పుస్తకాలకి వాడి బుర్రలో అస్సలు స్థానం ఉండదు. పొద్దున్నే అమ్మ పెట్టిన వేడివేడి అన్నం తిని ఠంచన్‌గా స్కూలుకి హాజరవుతాడు. క్లాసులో ప్రశ్నలకు జవాబీయకపోటంతో బాగా తిట్లు తిని సాయంత్రం ఇల్లు చేరుతాడు. ఇంటికి రాగానే తల్లి ప్రేమగా చిక్కని గేదెపాలలో నానేసిన ప్రత్యేక బియ్యంతో టిఫిన్ చేసి తినిపిస్తుంది. అంతే, స్కూలులో చివాట్లు, చెంపదెబ్బలు మర్చిపోయి హాయిగా పిల్లల్తో బైట కేరింతలు కొడ్తుంటాడు. మాస్టారు "ఏమండీ! మీవాడు అస్సలు చదవటంలేదు. కాస్త శ్రద్ధ తీసుకోండి" అని చెప్పటంతో ఆ రోజు తండ్రి వాడికి బడితెపూజ చేశాడు. ఆ దెబ్బకి ఇంట్లోంచి పారిపోయి చింతచెట్టెక్కి రాత్రికి కూడా ఇల్లు చేరలేదు. అమ్మ గుండెలు బాదుకుని ఏడ్వసాగింది. నాన్న పశ్చాత్తాపంతో "అరె సుకుమార్. ఇంక నిన్ను కొట్టనురా" అని ఎక్కడ వెతికినా కనపడలేదు.

ఆ మర్నాడు ఆకలి దప్పుల్తో చెట్టు దిగి అమ్మని చేరాడు. అమ్మా నాన్న ప్రేమగా చేరదీసి అక్కున చేర్చుకున్నారు. సుకుమార్ తండ్రి కాస్త పాత పద్ధతులు, ఆచారాలు పాటించే వ్యక్తి. పిల్లాడికి చదువుపై ఆసక్తి, అవగాహన ఎలా పెంచాలో తెలీదు. ఫీజు కట్టి బడికి పంపుతున్నాను. అధ్యాపకులే వాడిని సర్వవిశారదా పారంగతుడిగా చేస్తారు అనే నమ్మకం ఆయనది. ఆయనకి నేటి విద్యా విధానం గూర్చి అంత అవగాహన లేదనే చెప్పాలి. పవిత్ర విద్యాదానం చేసే పాఠశాలలు లేవు అనేది తెలీదాయనకి. కుర్చీలు, బెంచీలు, చౌకీదారు హంగులున్న పాఠశాలలు... గురుశిష్యుల మధ్య అనుబంధం లేని వ్యాపార కేంద్రాలుగా, ర్యాంకులు పొందే కర్మాగారాలుగా ఉన్నాయని గ్రహించలేదు ఆ తండ్రి! విద్యార్థుల మానసిక, వ్యక్తిత్వ వికాసం, విచక్షణా జ్ఞానం పెంచే చదువు బదులు మరలో బియ్యం, గోధుమల్ని ఆడించి పిండి చేస్తున్నట్లుగా నేటి స్కూళ్లున్నాయి. యంత్రాల్లాగా పాఠాలు చెప్పే అధ్యాపకులు, జ్ఞాపకశక్తితో మక్కీకి మక్కీ బట్టీపట్టి మార్కులు పొందే విద్యార్థుల కాలం ఇది. ఈ విషయం తెలీక, సుకుమార్‌ని చావబాదేవాడు తండ్రి. సంధికాలం ఇది. అందుకే భీతావహ వాతావరణం ఏర్పడింది. ప్రాచీన సభ్యత-అసభ్యత, ఆధునిక నాగరికత-అనాగరికతల సంధియుగంలో నిలబడ్డ సుకుమార్ తండ్రి నేటి పరిస్థితుల్ని, తన కొడుకు మానసికస్థితిని సరిగా బేరీజు వేయలేక తాను బాధపడ్తూ వాడ్ని హింసిస్తున్నాడు శారీరకంగా, మానసికంగా కూడా!

ఆయన పెద్ద కొడుకు దేవకుమార్ కలకత్తాలో చదివి డిబ్రూగఢ్‌లో వకీలుగా పని చేస్తున్నాడు. అతనికి పేరు - ప్రతిష్ఠలు, డబ్బు కూడా బానే వచ్చి పడ్తున్నాయి. తమకన్నా వాడే ఎక్కువ, గొప్ప అని అమ్మానాన్నల భావన. దేవకుమార్ కూడా తల్లిదండ్రులంటే ప్రేమ, గౌరవం చూపుతాడు. ఆర్నెల్లకో, ఏడాదికో ఓసారి వచ్చి వారిని చూసి పోతుంటాడు. అన్న వస్తున్నాడంటే చాలు సుకుమార్ ఎగిరి గంతులేస్తాడు. వాడికి అన్నంటే ఎంతో ఇష్టం, ప్రేమ కూడా. కానీ ఓ పక్క అన్న రాక వాడికి భయం కూడా కల్గిస్తుంది!

దేవకుమార్ రావటంతోనే "ఏరా! బాగా చదవటంలేదుటగా!" అని చీవాట్లేస్తాడు.

"ఒరే పెద్దాడా! ఎందుకురా పాపం వాడ్ని ఆడిపోసుకుంటావు? నువ్వు వస్తున్నావని తెల్సి పాపం వాడు ఎంత సంబరపడ్డాడో తెల్సా? నీవు గడపలో కాలు పెడ్తూనే వాడ్ని తిడ్తావు, సాధిస్తావు" అని తల్లి అనేది.

"అబ్బబ్బ! అసలు నీవూ, నాన్న వాడ్ని

విపరీతమైన గారాబం చేసి చెడగొడ్తున్నారమ్మా! అందుకే వాడు ఆడింది ఆట, పాడింది పాటగా అయి పధ్నాలుగేళ్లు వచ్చినా నాల్గో క్లాసులోనే ఉన్నాడు. చదువు రాకపోతే బర్రెలు, గొర్రెలు కాసుకోవల్సిందే. లేదంటే ఇతర్ల ఇళ్లల్లో కూలీ నాలీ చేసుకుని పొట్ట పోసుకోవాలి. వీడింకెలా బ్రతుకుతాడు? " అంటే మౌనంగా కన్నీరు కార్చేది తల్లి.

ఈసారి దుర్గాపూజ సెలవుల్లో పెద్దాడు వచ్చాడు. వస్తూనే అన్నాడు "ఈ దున్నపోతుగాడ్ని నాతో తీసికెళ్లి అక్కడ చదివిస్తా. మీ దగ్గరుంటే సర్వనాశనం అవుతాడు. మీ గారాబం వల్లే చెడిపోతున్నాడు. వాడి బట్టలు, సామాన్లు సర్దు" అని తల్లికి పురమాయించాడు. రేపే ప్రయాణం. తల్లి కన్నీరు కారుస్తోంది. తండ్రికి ఏం చేయాలో పాలుపోటంలేదు. పెండ్యులం లాగా మనసు ఊగుతున్నా పెద్దకొడుకు మాటలకి ఒప్పుకోక తప్పలేదు.

అమ్మా నాన్న తనను పంపిస్తారనే ఊహే సుకుమార్‌కి రాలేదు. పాపం వాడి గుండె బేజారైంది. అమ్మా నాన్నల్ని విడిచిపెట్టి ఉండాలా? హమ్మో! అన్నయ్య చండశాసనుడు! కానీ వాడికింక తప్పించుకునే మార్గాలన్నీ మూసుకుపోయాయి అనే విషయం అర్థమైపోయింది. కసాయి వాడి వెంట గొర్రెలాగా తలొంచుకుని అన్న వెంట బయలుదేరక తప్పదు అన్న చేదు నిజం ఆ పసివాడ్ని కలచివేస్తోంది.

చింత, మామిడి, పనస చెట్లని పరామర్శించటానికి బైలుదేరాడు. నిర్మల ఆకాశం, ఎగిరే సీతాకోకచిలుకలు, పెంపుడు పక్షులు, ఆవులు, గుర్రాలు, తనతో ఆడే పిల్లలందరికీ బరువైన గుండెతో టాటా-చెప్పాడు. అన్నతో పాటు వెళ్లడమంటే వాడి ప్రాణానికి విదేశం వెళ్లటంలా అన్పించసాగింది. దూరప్రాంతం అంటే వాడి దృష్టిలో పరాయి దేశమే!

అమ్మా నాన్నలకి నమస్కరించి ఇద్దరు

కొడుకులు ప్రయాణమయ్యారు. అన్నయ్య వెంట వెళ్లడానికి మౌనంగా సిద్ధమైన సుకుమార్‌ని చూస్తుంటే ఆ తల్లి కన్నీరాగలేదు.

"నాన్నా సుకుమార్! అన్న చెప్పిన మాట విని బుద్ధిగా చదువుకో తండ్రీ!" అని ముద్దాడింది.

పెద్దాడి చేయి పట్టుకుని "ఒరే బాబూ! వాడ్ని చావచితక గొట్టకు. బానే చదువుకుంటాడులే. నెమ్మదిగా ఆ కొత్త వాతావరణానికి అలవాటు పడాలి. ఒకేసారి నీ కోపతాపాలు, చేయివాటుతనం తమ్ముడిపై చూపకు" అని బ్రతిమాలి మరీ చెప్పింది.

"పిచ్చి అమ్మా! తమ్ముడ్ని గూర్చి నీవేం బెంగ పెట్టుకోకు. ఇప్పటికే నీ గారాబంతో వాడ్ని చెడగొట్టావు. వాడి భవిష్యత్తు బాగుండాలి. దాన్ని గూర్చి ఆలోచించు"

**అనువాదం : అచ్యుతుని రాజ్యశ్రీ**

అని ఓదార్చాడు దేవకుమార్.

డిబ్రూగఢ్‌లో ఇంగ్లీష్ మీడియం స్కూల్లో తమ్ముడ్ని చేర్చి వాడి చదువుని పర్యవేక్షించసాగాడు అన్నగారు. ఆకాశంలో స్వేచ్ఛగా ఎగిరే పక్షి పంజరంలో బందీ అయినట్లు గిలగిలలాడసాగాడు సుకుమార్! వాడి గుండెపై క్రమశిక్షణ, చదువు, ఆప్యాయత కరువు అనే బండ రాళ్లు ఎక్కి కూచున్నాయి. అన్నను ఎప్పుడూ ఎదిరించ వద్దని, అణుకువగా ఉండమని తల్లి చేసిన ఉద్బోధను వాడు గుర్తు చేసుకోసాగాడు. కఠినంగా ఉంటేనే వాడు చదువుతాడని, దార్లో పడతాడని అన్న ఉద్దేశం.

వాడు బాగా చదివితే "చూశావా, నావల్లే వాడికి నాల్గు అక్షరంముక్కలు అబ్బాయి" అని చెప్పుకోవాలని దేవకుమార్ ఆరాటం. కానీ అతని నిర్దయ, కఠిన క్రమశిక్షణతో, చురుకైన తెలివి తేటలు గల చిన్నారి సుకుమార్ భయంతో ప్రతీదీ మర్చిపోసాగాడు. ఏది చెప్పాలన్నా భయంతో ఉన్నది కాస్తా మర్చిపోయేవాడు. రోజంతా పుస్తకం తెరిచి కూచుంటున్నాడు కానీ ఒక్కటీ బుర్రలోకెక్కడంలేదు. వాడు క్రమంగా నీరసిస్తుంటే తిట్లు, దెబ్బల జోరు ఎక్కువైంది.

ఓ రోజు సాయంత్రం తమ్ముడ్ని ప్రతీదీ అడగటం, వాడు ఒక్క జవాబు చెప్పలేక నోరెళ్లబెట్టడంతో చావచితకగొట్టి "వంశానికి చెద పురుగువి రా! నా తమ్ముడివి అని చెప్పుకోవాలంటే నాకు సిగ్గేస్తోంది. గొడ్లు కాచుకుంటూ, పాచిపని చేసుకుని బ్రతకరా అంట్ల వెధవా!" అని ఛెడామడా తిట్టి అతడి మనసును గాయపరిచాడు. విచక్షణారహితంగా కొట్టి ఆ పసివాడి శరీరాన్ని హూనం చేశాడు.

ఆ రాత్రి వదినెతో "ఆకలి లేదు, అన్నం తినను" అనేసి పడుకున్నాడు. అన్న తిట్టినా "నాకు వంట్లో బాగా లేదు" అని మాత్రమే వదినతో చెప్పాడు. ఆ రాత్రి వాడి శరీరం తీవ్రజ్వరంతో కాలిపోయింది.

ఏడు రోజులు గడిచినా జ్వరం తగ్గలేదు. ఆ జిల్లాలో పేరున్న డాక్టరు వచ్చి రోజూ చూసి వెళ్తున్నాడు. వాడి జ్వరం విషయం అమ్మానాన్నలకి తెల్పలేదు. ఎనిమిదవ రోజు డాక్టరు సలహాపై తండ్రికి టెలిగ్రాం ఇచ్చాడు దేవకుమార్. ఆ రోజుల్లో డిబ్రూగఢ్‌కి త్వరగా చేర్చే ప్రయాణ సాధనాలు లేవు. సగం స్పృహలో సుకుమార్ కలవరించసాగాడు...

'అమ్మా, వచ్చావా? నా పిట్టలు, కుక్కపిల్ల, జింక ఎలా ఉన్నాయి? నా కోసం వెతుక్కుంటున్నాయా? అమ్మా నేను వాటితో ఆడుకుంటానే. నేను బాగా చదువుకుని గొప్పవాడ్ని అవుతానే. అన్నా! నన్ను కొట్టకు. మంచి పిల్లాడిగా మారుతా' అని కలవరించసాగాడు. పద్నాల్గవ రోజు పరిస్థితి మరింత క్షీణించింది. అంతే వాడి ప్రాణపక్షి ఎగిరి ముక్తి పొందింది. V

తెలుగు కథ

- మొండెపు ప్రసాద్



# ఇది–చాలా తప్పు సుమా!

వ్యాపారవేత్త విశ్వనాథ్ తన కొడుకు వినయ్ మ్యారేజ్ రిసెప్షన్ హైదరాబాద్‌లోని ఓ పెద్ద హోటల్‌లో చాలా గ్రాండ్‌గా ఏర్పాటుచేసాడు. విందు భోజనంతోపాటు పాటలు, డ్యాన్స్, మిమిక్రీ, మ్యాజిక్ షో వంటి లైవ్ ఎంటర్‌టైన్‌మెంట్ కూడా ఏర్పాటు చేసాడు.

విందు ఆరగిస్తున్న ఒక అతిథి మరొక అతిథితో "వైజాగ్‌లో జరిగిన పెళ్ళిలో ఆడపెళ్లివారు పాతిక రకాల వంటకాలతో భోజనాలు పెడితే మన విశ్వనాథ్ రిసెప్షన్‌లో యాభై రకాల వంటకాలతో భోజనాలు పెట్టి మగపెళ్ళివారి పరువు నిలబెట్టాడు" అన్నాడు.

భారతీయులు సాధారణంగా పెళ్ళిళ్ళు చాలా ఆర్భాటంగా చేస్తారు. పెళ్ళిళ్ళ కోసం తమ శక్తికి మించిన ఖర్చు చేస్తారు. ఈ మధ్యకాలంలో పెళ్ళి భోజనాలలో ఎక్కువరకాల వంటకాలు పెట్టడం ఫ్యాషనై పోయింది. ఒకరికంటే ఒకరు ఎక్కువ వంటకాలు పెట్టాలని పిచ్చిగా పోటీ పడుతున్నారు.

అన్నిరకాలూ రుచి చూడాలనే కోరికతో కొంతమంది అతిథులు ఆ వంటకాలన్నీ ప్లేటులో పెట్టుకొని కొంచెం రుచి చూసి మిగిలిన భాగాన్ని వదిలేస్తున్నారు. తిని పడేసిన ప్రతి డిస్పోజబుల్ ఎంగిలి ప్లేటులో కనీసం ఇద్దరి మనుషుల ఆకలి తీర్చడానికి సరిపడేటంతటి ఆహారపదార్థాలు ఉన్నాయి.

ఎంటర్‌టైన్‌మెంట్ కార్యక్రమాలకి యాంకరింగ్ చేస్తున్న యాంకర్ తన తీయటి గొంతుతో "డియర్ గెస్ట్స్, మే ఐ హేవ్ యువర్ అటెన్షన్ ప్లీజ్! విశ్వనాథ్ గారు ఒక చిన్న అనౌన్స్‌మెంట్ చెయ్యబోతున్నారు" అని చెప్పింది.

ఆ అనౌన్స్‌మెంట్ విని అందరూ అటు వైపు తిరిగారు.

యాంకర్ చేతిలోని మైక్ తీసుకుని విశ్వనాథ్ "లేడీస్ అండ్ జెంటిల్‌మెన్, కొత్తగా పెళ్ళైన నా కొడుకు వినయ్, కోడలు శిరీష హనీమూన్‌కి జర్మనీ వెళ్తున్నారు. వాళ్ళకి తోడుగా నా కూతురు సింధు, అల్లుడు ఆనంద్ కూడా వెళ్తున్నారు. మరో రెండు గంటలలో ఫ్లైట్ బయలుదేరుతుంది. మీరు అనుమతిస్తే వాళ్ళు నలుగురూ ఎయిర్‌పోర్టుకి బయల్దేరుతారు. మనం పార్టీ ఎంజాయ్ చేద్దాం" అన్నాడు.

అందరూ చప్పట్లు కొట్టి వాళ్లు వెళ్ళడానికి అనుమతి తెలిపారు.

★ ★ ★

బెర్లిన్ (జర్మనీ) వెళ్లిన వినయ్, శిరీష, సింధు, ఆనంద్‌లు రీజెంట్ బెర్లిన్ హోటల్లో తమ కోసం ఇండియా నుండే రిజర్వ్ చేసిన రెండు సూట్ రూమ్‌లలో దిగారు. స్నానాలు ముగించి బ్రేక్‌ఫాస్ట్ చేసి ఊరంతా తిరిగి రాత్రికి హోటల్‌కి చేరుకున్నారు. డిన్నర్ చెయ్యడానికి ఫస్ట్ ఫ్లోర్‌లో ఉన్న రెస్టారెంట్‌కి వెళ్ళారు.

రెస్టారెంట్లో చాలా మంది తింటున్నారు. కానీ ఎవరి టేబుల్ మీద చూసినా రెండు మూడు డిష్‌ల కంటే ఎక్కువ లేవు. అది గమనించి ఆనంద్ "జర్మన్‌లు డిన్నర్ చాలా తక్కువగా తింటారేమో!" అన్నాడు.

వినయ్ వాళ్ళ డిన్నర్ టేబుల్‌కి కుడివైపున ఉన్న టేబుల్ దగ్గర ఒక జర్మన్ అమ్మాయి, ఆమెకి ఎదురుగా ఒక జర్మన్ అబ్బాయి కూర్చొని ఉన్నారు. ఆ అమ్మాయి హాలీవుడ్ హీరోయిన్ అంత అందంగా ఉంది. వాళ్ళ టేబుల్ మీద కూడా కేవలం రెండు డిష్‌లు మాత్రమే ఉన్నాయి.

"అంత అందమైన అమ్మాయి నాతో రెస్టారెంట్‌కి వస్తే నేను రెస్టారెంట్లో ఉన్న ఆహార పదార్థాలన్నీ ఆర్డర్ చేసేస్తాను" అన్నాడు వినయ్.

"పెళ్ళైపోయిందిగా. ఇక నీకు అలాంటి అవకాశం రాదు" వెటకారంగా అన్నాడు ఆనంద్.

"నేను కూడా అందంగా ఉన్నానుగా! ఎన్ని రకాల ఆహారపదార్థాలు ఆర్డర్ చేస్తావో చెయ్యి" శిరీష కొంటెగా అంది.

"సరే" అని మెనూకార్డ్ చేతిలోకి తీసుకొని పది రకాల ఆహారపదార్థాలను ఆర్డర్ ఇచ్చి "సరిపోతాయా? " అని అడిగాడు.

"నా అందానికి సరిపోవు. కానీ ఈ రోజు తిన్నవే రేపు కూడా తింటే బోర్ కొడుతుంది. కాబట్టి మిగిలిన ఆహారపదార్థాలను రేపు ఆర్డర్ చేద్దాం" చెప్పింది శిరీష.

"నీ ఇష్టమే నా ఇష్టం" అన్నాడు వినయ్.

"నా ఇష్టమేమిటో ఎవ్వరూ అడగరా? " చిరుకోపం ప్రదర్శిస్తూ అంది సింధు.

మెనూకార్డ్ ఆమె చేతిలో పెట్టి వినయ్ "నీకేమి కావాలో అవన్నీ ఆర్డర్ చెయ్యి" అన్నాడు.

సింధు మరో రెండు ఐటమ్‌లు ఆర్డర్

## మీరు పారేసే ఆహారం.. 80 కోట్ల మంది ఆకలి తీరుస్తుంది

**ప్రపంచ దేశాలకు యూఎన్ఓ చురకలు**

**రోమ్:** ప్రపంచంలోని అన్ని దేశాల్లోనూ ఆహారాన్ని వృథా చేసే సంస్కృతి నానాటికీ ఎక్కువవుతోందని, ఈ విధానానికి ఇప్పటికైనా స్వస్తి పలకాలని ఐక్య రాజ్య సమితి(యూఎన్ఓ) ఉద్ఘాటించింది. ప్రపంచ వ్యాప్తంగా ఉత్పత్తి అవుతున్న ఆహారంలో మూడు వంతులు వృథా అవుతోందని ఆందోళన వ్యక్తం చేసింది. వృథాగా పారేస్తున్న ఆహారంతో సుమారు 84.2 కోట్ల మంది పేదల ఆకలి తీర్చవచ్చని పేర్కొంది. బుధవారం ఇక్కడ జరిగిన ప్రపంచ ఆహార దినోత్సవంలో యూఎన్ ఆహార, వ్యవసాయ సంస్థ (ఎఫ్ఏవో) ప్రతినిధి రాబర్ట్ వాన్ ఆటెర్ డిజ్క్ పేర్కొన్నారు. అదేసమయంలో ప్రపంచ వ్యాప్తంగా పోషకాహార లోపం, స్థూల కాయం విజృంభిస్తున్నాయని తెలిపారు.

**ఆహారపదార్థాల వ్యర్థంపై ఆందోళన వ్యక్తం చేసిన ఐక్యరాజ్య సమితి**

చేసింది.

వినయ్ ఆనంద్‌వైపు తిరిగి "మీరు కూడా మీకు కావలసిన ఐటమ్‌లు ఆర్డర్ చెయ్యండి బావగారు" అన్నాడు.

"సింధు ఆర్డర్ చేసిన వాటిలో ఒకటి తనకిష్టమైనది, మరొకటి నాకిష్టమైనది" కూల్ గా చెప్పాడు ఆనంద్.

★ ★ ★

పావుగంటలో వినయ్ వాళ్ళు ఆర్డర్ చేసిన ఆహారపదార్థాలన్నీ వాళ్ళ టేబుల్ మీదకి వచ్చాయి.

బెర్లిన్‌లో నైట్ లైఫ్ ఎలా ఉంటుందో చూడాలని ముందుగానే ప్లాన్ చేసుకోవడం వలన వాళ్ళు డిన్నర్ అరగంటలో ముగించి, బిల్ చెల్లించి బయటకి వెళ్ళబోయారు. రెస్టారెంట్లో నుండి బయటకి వెళ్ళబోతున్న వాళ్ళు లోపలినుంచి ఎవరో పిలవడంతో వెనక్కి తిరిగారు.

డిన్నర్ చేసినప్పుడు వాళ్ల టేబుల్‌కి కుడివైపు టేబుల్ వద్ద కూర్చొన్న అబ్బాయి వాళ్ళ దగ్గరకి వచ్చాడు.

"మీరు జర్మన్‌లు కాదని తెలుస్తోంది. మీకు ఇంగ్లీష్ అర్థమవుతుందా? " అని ఇంగ్లీష్‌లో అడిగాడు.

"అర్థమవుతుంది" ఇంగ్లీషులోనే జవాబిచ్చాడు వినయ్.

ఆ తర్వాత సంభాషణంతా ఇంగ్లీషులోని కొనసాగింది.

ఆ అబ్బాయి వినయ్ వాళ్ళు డిన్నర్ తిన్న టేబుల్ వైపు చెయ్యి చూపిస్తూ "మీరు చాలా ఆహారపదార్థాలు వృథా చేసారు" అన్నాడు.

ఇంకా క్లీన్ చెయ్యని ఆ టేబుల్ వైపు చూసారు వినయ్ వాళ్లు. ఆ టేబుల్ మీదున్న ప్రతి డిష్‌లోనూ కనీసం మూడో వంతు ఆహారం మిగిలి ఉంది. కొన్ని డిష్‌లలో సగం ఆహారం మిగిలి ఉంది.

"మేము ఆర్డర్ చేసిన ఆహారం మొత్తానికి బిల్ పే చేసాము. కాబట్టి ఎంత తిన్నాము? ఎంత వదిలేసాము? అనే విషయాలు మీకనవసరం" వినయ్ జవాబిచ్చాడు.

అంతలో ఆ జర్మన్ అబ్బాయితో కలిసి డిన్నర్ చేసిన అమ్మాయి లేచివెళ్లి రెస్టారెంట్ మేనేజర్‌ని అక్కడికి తీసుకుని వచ్చింది.

రెస్టారెంట్ మేనేజర్ వినయ్ వాళ్ళతో "మీరు ఆర్డర్ చేసిన ఆహారంలో చాలా భాగం వృథాగా వదిలేసారు. నేను వాటిని ప్యాక్ చేయించి ఇస్తాను. మీతో తీసుకెళ్ళండి" అని వినయంగా అన్నాడు.

"మేము తిన్న ఆహారానికి మాత్రమే డబ్బులు కట్టలేదు. ఆర్డర్ చేసిన ఆహారం మొత్తానికి డబ్బులు కట్టాము. కాబట్టి

ఎంత తిన్నాము? ఎంత వదిలేసాము? అనే విషయాలు మీకనవసరం" వినయ్ కోపంగా జవాబిచ్చాడు.

అంతలో సోషల్ సెక్యూరిటీ ఆర్గనైజేషన్ నుంచి యూనిఫారమ్ వేసుకున్న ఒక అధికారి అక్కడికి వచ్చి, ఫోన్ చేసినది ఆ జర్మన్ అబ్బాయని తెలుసుకొని ఆ అబ్బాయితో, రెస్టారెంట్ మేనేజర్‌తో మాట్లాడి విషయం తెలుసుకున్నాడు. వినయ్ వాళ్ళు డిన్నర్ చేసిన టేబుల్ వద్దకు వెళ్ళి, వినయ్ వాళ్ళు తినకుండా వదిలేసిన ఆహార పదార్థాలని చూసాడు.

వినయ్ వాళ్ళ వద్దకి వచ్చి "మీరు చాలా ఆహారాన్ని వృథా చేసారు. ఆ తప్పుకి మీరు ఫైన్ కట్టాలి" అన్నాడు.

అతను ఇంగ్లీషులో చెప్పిన విషయం అర్థమైనా, రెస్టారెంట్‌లో ఆర్డర్ చేసిన ఫుడ్‌లో కొంత తినకుండా వదిలినందుకు ఫైన్ కట్టడమనే విషయాన్ని జీర్ణించుకోలేక "మేము ఆర్డర్ చేసిన మొత్తం ఆహారానికి డబ్బులు కట్టాము. ఫైన్ ఎందుకు కట్టాలి? " అని వినయ్ అడిగాడు.

"మీరు ఎంత తినగలరో అంత ఆహారాన్ని మాత్రమే ఆర్డర్ చెయ్యండి. అవసరం లేకపోయినా ఎక్కువ ఆహారాన్ని ఆర్డర్ చేసి, తినకుండా వృథా చెయ్యకండి" చెప్పాడా అధికారి.

"డబ్బులు కట్టేది మేము. మేము ఆర్డర్ చేసిన ఆహారమంతటికీ మేము డబ్బులు కడుతున్నప్పుడు మధ్యలో మీకొచ్చే నష్టమేమిటి? " కోపంగా అడిగాడు ఆనంద్.

"డబ్బున్న వాళ్ళు డబ్బుంది కదా అని అవసరానికంటే ఎక్కువగా ఆహారపదార్థాలు కొని వృథా చెయ్యడం వలన ఆహార పదార్థాలకి డిమాండ్ పెరుగుతుంది. డిమాండ్ పెరగడం వలన ఆహార పదార్థాల రేట్లు పెరుగుతాయి. పెరిగిన రేట్లకి ఆహార పదార్థాలు కొనలేక పేద, మధ్య తరగతి ప్రజలు ఇబ్బంది పడతారు. డబ్బున్న వాళ్ళందరూ మీకులా ఆహారపదార్థాలు వృథా చేస్తే, కొన్నేళ్ళకి ఎంత డబ్బు చెల్లించి కొందామన్నా ఆహారపదార్థాలు దొరకని రోజు వస్తుంది. ప్రపంచంలో ప్రతీ సంవత్సరం ఐదు మిలియన్ల మంది పిల్లలు తినడానికి తిండి దొరకక చనిపోతున్నారనే విషయం మీకు తెలుసా? డబ్బులు మీవే. కాని ఆహారపదార్థాలు తయారుచెయ్యడానికి ఉపయోగించే వనరులు సమాజానివి. వాటిని వృథా చేసే హక్కు ఎవ్వరికీ లేదు" అని చెప్పి ఆ అధికారి యాభై మార్కులు ఫైన్ విధించిన రశీదు వినయ్ చేతిలో పెట్టాడు.

కేవలం ఎనభై మిలియన్ల జనాభా మాత్రమే కలిగి, ఆ జనాభాలో పదిహేను శాతం మంది మాత్రమే దారిద్ర్యరేఖకు దిగువన ఉన్న జర్మనీలో ఆహార పదార్థాలు వృథా కాకుండా ఉండటానికి ప్రభుత్వం, ప్రజలు ఎంతో శ్రద్ధ చూపిస్తున్నారు. కాని పన్నెండు వందల డెభ్భై మిలియన్ల జనాభా కలిగి, ఆ జనాభాలో ముప్ఫై శాతం మంది దారిద్ర్యరేఖకి దిగువన ఉన్న భారతదేశంలో నిత్యం జరుగుతున్న ఆహారపదార్థాల వృథా గురించి, దాని దుష్పరిణామాల గురించి సరైన అవగాహన లేకపోవడం విచారకరం.

ఫైన్ రశీదు తీసుకున్న వినయ్‌కి తన పెళ్ళిలో, మ్యారేజ్ రిసెప్షన్ పార్టీలో అనవసరంగా వృథా చేసిన ఆహారపదార్థాలు గుర్తొచ్చాయి. యాభై మార్కులు చెల్లించాక రశీదు మీద "డబ్బులు మీవే కాని ఆహార వనరులు సమాజానివి. ఆహారం వృథా చేయకండి" అని రాసి, పర్స్‌లో జాగ్రత్తగా దాచుకున్నాడు.

★ ★ ★

భారతదేశానికి వచ్చాక ఆ రశీదుని కాపీలు చేయించి, లామినేట్ చేయించి జర్మనీ నుండి తెచ్చిన బహుమతిగా తన స్నేహితులందరికీ పంచాడు వినయ్ Ⓥ




అది రెండో ప్రపంచ యుద్ధకాలం.

బెల్జియం, జర్మనీల సరిహద్దులోని ఆబెన్ అనే గ్రామంలో పాతికేళ్లుగా ఫ్రిట్జ్ వింకెన్ ఓ బేకరీని నడుపుతున్నాడు. వేడి వేడి బన్స్, తాజా బ్రెడ్‌తో పాటు అతను చిరునవ్వులని కూడా తన కస్టమర్స్‌కి ఇస్తూంటాడు. అతడు తన పన్నెండో ఏట నించే బ్రెడ్‌ని తయారు చేస్తున్నాడు. తన తండ్రి నించి ఆ విద్యని నేర్చుకున్నాడు. మూడు తరాలుగా వాళ్ళది ఇదే వ్యాపారం.

డిసెంబర్ నెల వచ్చింది. ఆ గ్రామం పక్కనే ఆర్డెన్నెస్ అడవి ఉండడం వల్ల చలి పెరిగింది. ఎనభై ఎనిమిదేళ్ళుగా నడు

స్తున్న వారి బేకరి ఓ బాంబింగ్ రెయిడ్‌లో నాశనమైంది. దాంతో అతను బ్రెడ్‌ని ఇంట్లోంచే తయారు చేసి అమ్ముతున్నాడు. మూడు రోజులకి ఓసారి గ్రామస్థులు వచ్చి బ్రెడ్‌ని కొనుక్కు వెళ్తాంటారు. మంచు కురుస్తూంటే, అతనే సైకిల్ మీద అందరిళ్ళకీ వెళ్ళి బ్రెడ్ సరఫరా చేసి వస్తూంటాడు.

బ్రెడ్ చేయడానికి అవసరమైన ఆహార పదార్థాలు యుద్ధం వల్ల గత రెండువారాలుగా లభ్యం కావడం ఆగిపోయింది. దాంతో వాళ్ళ వ్యాపారం దాదాపు మూతపడినట్లే. అమెరికా సైన్యం యూరప్‌లోకి ప్రవేశించిందని, జర్మన్ సైనికులు వెనక్కి మళ్ళారని, త్వరలో యుద్ధం ముగుస్తుందని ఫ్రిట్జ్ వింకెన్ రహస్యంగా బిబిసి వార్తల్లో విన్నాడు. ఆ మంచి రోజు కోసం అతను, అతని భార్య ఎదురు చూస్తున్నారు.

అనువాదం :
**మల్లాది వెంకటకృష్ణమూర్తి**

1944 డిసెంబర్ పదహారుకల్లా ఆర్డెన్నెస్ అడవి మిత్ర సైన్యాలకి, జర్మన్ సైనికులకి మధ్య యుద్ధరంగంగా మారింది. ఆబెన్ గ్రామస్తులకి తరచు తుపాకి, ఫిరంగి మోతలు వినపడసాగాయి.

అది క్రిస్మస్ ఈవ్ సాయంత్రం. డిసెంబర్ ఇరవై నాలుగు. తుపాకీల మోత ఎప్పటికన్నా అధికంగా వినపడసాగింది. ఫ్రిట్జ్, అతని భార్య ఎలిజబెత్, వారి పిల్లలు రాత్రి భోజనానికి కూర్చున్నారు. ఉడకబెట్టి వెన్న రాసిన బంగాళదుంపలు, ఓట్ మీల్ మాత్రమే వారి బల్ల మీద ఉన్నాయి. తినబోయే ముందు వారు దైవప్రార్థన చేస్తూండగా మనుషుల కంఠధ్వని వారి ఇంటి బయటి నించి వినపడింది. ఎవరో నెమ్మదిగా మాట్లాడుకుంటున్నారు. దాంతో ఎలిజబెత్ కొవ్వొత్తులని ఆర్పేసింది. ఆ కుటుంబ సభ్యులంతా భయంగా వేచి చూడసాగారు. అకస్మాత్తుగా తలుపు మీద ఎవరో కొట్టిన చప్పుడు వినిపించింది.

ఎలిజబెత్ లేచి వెళ్ళి తలుపు తెరిచింది. బయట ఇద్దరు నిలబడి ఉన్నారు. వారు వేసుకున్న యూనిఫారాలని అంతదాకా చూడకపోవడంతో వాళ్లు అమెరికన్స్ అయి ఉండవచ్చు అనుకుంది. వాళ్లు ఆవిడకి అర్థం కాని భాషలో ఏదో చెప్పి, దూరంగా మంచులో కూర్చుని ఉన్న మూడో వ్యక్తి వంక చూపించారు. అతని పిక్క మీద బుల్లెట్ దిగి గాయమైంది. ఆ ముగ్గురూ చలికి వణుకుతున్నారు.

ఎలిజబెత్ కొద్ది క్షణాలు సందేహించింది. తర్వాత వాళ్లని లోపలికి రమ్మన్నట్లుగా సైగ చేసింది. తమ పదహారేళ్ళ కొడుకు వంక చూసి చెప్పింది.

"వెళ్ళి పది బంగాళ దుంపలు తీసుకురా"

వాడు ఇంటి వెనుక ఉన్న షెడ్‌లోకి పరుగెత్తాడు. ఆ అమెరికన్ సైనికుల్లో ఒకరికి ఫ్రెంచ్ భాష కొద్దిగా వచ్చు. ఎలిజబెత్‌కి ఫ్రెంచ్ భాష బాగా వచ్చు. చలికి ఫైర్ ప్లేస్ ముందు కూర్చుని చలి కాచుకుంటూ అతను చెప్పాడు.

"మేము అమెరికా నించి వచ్చాము. జర్మన్ సైనికులతో అడవిలో యుద్ధం జరుగుతూండగా మా బెటాలియన్ నించి తప్పిపోయి మూడు రోజులుగా జర్మన్ సైనికుల నించి దాక్కుంటూ అడవిలో తిరుగుతున్నాం. ఆకలితో, అలసటతో ఉన్నాం"

ఎలిజబెత్ తుపాకి గుండు దిగిన సైనికుడి కాలి గాయం చుట్టూ బాధ తగ్గడానికి కాపడం పెట్టింది. తర్వాత అతిథులకి వంట చేయడం మొదలుపెట్టింది.

మళ్లీ ఇంటి తలుపు కొట్టిన చప్పుడైంది. నిస్సందేహంగా వాళ్లు కూడా సైనికులే అని గ్రహించింది. ఎందుకంటే తుపాకి మడమతో కొట్టిన చప్పుడది. ఎలిజబెత్ మళ్లీ వెళ్లి తలుపు తెరిచింది.

ఈసారి జర్మన్ సైనికులు నలుగురు బయట నిలబడి ఉన్నారు. వాళ్ళని చూసి ఎలిజబెత్ భర్త ఫ్రిట్జ్ భయంతో వణికిపోయాడు. ఇరుపక్షాల వారు ఒకరికి మరొకరు ఎదురుపడితే వాళ్ళ ఇల్లు యుద్ధరంగంగా మారుతుంది.

ఐతే ఎలిజబెత్ భర్తలా తత్తర పడలేదు.

"మెర్రి క్రిస్టమస్. లోపలకి రండి. భోజనం తయారవుతోంది" చెప్పి ఆహ్వానించింది.

వాళ్ళు లోపలికి రాక మునుపే మొదటి సైనికుడి భుజం మీద తన చేతిని వేసి ఆపి చెప్పింది.

"నా ఇల్లు శాంతియుతమైంది. దీన్ని రణరంగంగా మార్చకపోతేనే రండి..."

"అలాగే"

"లోపల ఇంకా అతిథులు ఉన్నారు. వాళ్ళని మీరు మిత్రులుగా చూడాలి. ఎందుకంటే ఇది క్రిస్టమస్ ఈవ్..."

ఆ సైనికుల వయసు పదిహేడు నించి పంతొమ్మిదేళ్ళ లోపే. ఇంకా పిల్లవాళ్ళే. దాదాపు తమ తల్లి వయసు ఉన్న ఎలిజబెత్ అంటే ఎంతో గౌరవంతో వాళ్లు సరే అన్నారు.

"మీ ఆయుధాలని షెడ్‌లో దాచండి. క్రిస్మస్ రోజు వాటితో ఏం పని మీకు? "

దానికి కూడా వారు ఒప్పుకున్నారు. ఆవిడకి వాటిని ఇచ్చారు. వెంటనే ఎలిజబెత్ పక్క గదిలోకి వెళ్లి అమెరికన్ సైనికుల ఆయుధాలని కూడా తీసుకెళ్ళి భద్రంగా దాచింది.

మొదట్లో ఒకరినొకరు చూసుకోగానే

శత్రువులైన వాళ్ళ మధ్య వత్తిడి ఏర్పడింది. ఇరుపక్షాల వారి చూపుల్లో కోపం ద్యోతకమైంది. జర్మన్ సైనికుల్లోని పదిహేడేళ్ళ ఒకతనికి కొద్దిగా ఇంగ్లీష్ వచ్చు. అతను మెడికల్ విద్యార్థిగా ఉన్నప్పుడు యుద్ధంలోకి బలవంతంగా లాక్కు రాబడ్డాడు.

ఉన్న భోజనం తక్కువ. అందరూ ఆకలి మీద ఉన్నారని గ్రహించిన ఎలిజబెత్ తన భర్తని బయటికి పంపి కొన్ని వారాలుగా క్రిస్మస్ కోసం దాస్తున్న కోడి పెట్టని తెప్పించింది.

ఓ అమెరికన్ జర్మన్ సైనికులతో చెప్పాడు.

"మెర్రీ క్రిస్మస్"

"వాళ్ళు బదులుగా జర్మన్ భాషలో చెప్పారు.

"ఫ్రాంచె వై నాచ్ టెన్"

అమెరికన్స్ జర్మన్స్‌కి సిగరెట్లని, ఇన్‌స్టంట్ కాఫీపొడిని ఇచ్చారు. జర్మన్స్ బదులుగా తమతో తెచ్చిన రై బ్రెడ్‌ని ఇచ్చారు. గాయపడ్డ అమెరికన్ సైనికుడి కాలుని పరీక్షించి, వైద్యం తెలిసిన జర్మన్ సైనికుడు ఆ బుల్లెట్‌ని లాఘవంగా తీసేసి చెప్పాడు.

"చలి వల్ల ఎలాంటి ఇన్‌ఫెక్షన్ రాలేదు. ఏం కాదు"

క్రమంగా వారి మధ్య గల వత్తిడి మాయమైంది. అప్పటికి ఎలిజబెత్ వంట పూర్తయింది. అంతా కూర్చున్నాక ఎలిజబెత్ గ్రేస్ చెప్పింది. చెప్తూంటే ఆవిడ కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

"మీ తల్లుల నించి మీరు ఈ క్రిస్మస్‌కి దూరంగా ఉన్నారు. నేను మీ తల్లిని అనుకోండి. మిమ్మల్ని నా బిడ్డలుగా భావిస్తున్నాను" చెప్పింది.

వేల మైళ్ల దూరంలోని తమ ఇళ్ళ గురించి ఆలోచిస్తున్న, యుద్ధాలతో అలసిపోయిన వాళ్ళ హృదయాల మీద ఆ మాటలు తేనె చిలుకుల్లా కురిసాయి.

భోజనాలు అయ్యాక సైనికులంతా చలి కోట్లని వదిలి, ఫైర్ ప్లేస్ చుట్టూ ఒకరికి మరొకరు ఆనుకుని కూర్చుని చలి కాచుకుంటూ క్రిస్మస్ పాటలని పాడారు. పాడుతూ నిద్రలోకి ఒరిగిపోయారు. మర్నాడు ఉదయం మళ్ళీ క్రిస్మస్ గ్రీటింగ్స్‌ని ఒకరికొకరు చెప్పుకున్నారు. అంతా కలిసి గాయపడ్డ సైనికుడి కోసం చెక్కలతో ఓ స్ట్రెచర్‌ని తయారు చేసారు.

అమెరికన్స్‌కి వాళ్ళ బెటాలియన్ దగ్గరికి ఎలా వెళ్ళాలో జర్మన్స్ మేప్‌లో దారి చూపించారు. ఎక్కడెక్కడ తమ సైనికులు ఉన్నారో గుర్తుపెట్టి, దానికి చుట్టూ ఎలా తిరిగి వెళ్ళాలో కూడా సూచించారు. ఎలిజబెత్ వాళ్లకి చిన్న చిన్న బహుమతులని ఇచ్చింది. తర్వాత వారి ఆయుధాలని కూడా తిరిగి ఇచ్చేసి, తను వారందరి క్షేమం కోసం ప్రార్థిస్తానని చెప్పింది. ఆ సమయంలో ఎలిజబెత్ వారందరికీ తల్లి అయింది. దుఃఖంతో తమ స్వంత కొడుకులకి వీడ్కోలు చెప్పినట్లుగా వీడ్కోలు చెప్పింది. ఇక తన జీవితకాలంలో తిరిగి వాళ్ళని చూడబోనని ఆవిడకి తెలుసు.

"జాగ్రత్తగా వెళ్ళండి. ఏదో ఓ రోజు మీరంతా జాగ్రత్తగా తిరిగి మీ అమ్మల దగ్గరికి చేరుకోవాలని ప్రార్థిస్తున్నాను. అప్పుడు మీ అమ్మలకి చెప్పండి, జర్మన్, బెల్జియం సరిహద్దుల్లోని అర్డెన్నెస్ అడవుల సమీపంలోని ఆబెన్ అనే గ్రామంలో మీరు మరో తల్లిని కూడా కలుసుకున్నారని"

సైనికులు అంతా ఎలిజబెత్, ఆమె కుటుంబ సభ్యులతో కరచాలనం చేసి చెరో వైపు వెళ్ళిపోయారు. తన జీవిత కాలంలో ఎలిజబెత్ ఎవరితోనైనా ఆ విషయం గురించి చెప్పినప్పుడు ఇలా చెప్పేది.

"ఆ రాత్రి సాక్షాత్తూ దేవుడు మాతో ఉన్నాడు. లేదా మేమంతా తుపాకుల గుళ్ళకి బలయ్యేవాళ్ళం"

(క్రిస్మస్ కానుకగా)

హిందీ కథ

# అమ్మకానికి ఆడపిల్ల

- జస్వంత్ సింగ్ విర్దీ

దూరంగా చాలా మంది మూగి ఉన్నారు.

ఏదో గొడవ జరిగే ఉంటుంది.. ఏం జరిగిందో? గుంపులు గుంపులుగా జనం అక్కడికి చేరుతున్నారు.

"ఈరోజు కూడా నాకు పని దొరికినట్లే.. భగవంతుడు ఎంత దయగలవాడు.. పని లేనివాడికి ఏదో ఒక పని కల్పిస్తాడు. ఆ పని తమాషా చూసేదయినా కావచ్చు లేక మరేదయినా కావచ్చు." నేను ఆలోచిస్తూ అన్ని పనులూ వదిలిపెట్టి ఏం జరిగిందో తెలుసుకుందామని అటువైపు వెళ్లాను. అక్కడ కనిపించిన దృశ్యం చూసి నివ్వెర పోయాను.

చేతిలో పసిబిడ్డతో ఒక ముసలాయన నిలబడి ఉన్నాడు. 'కొనే వారుంటే ముందుకి రండి... ఉన్నారా ఎవరైనా..?' అని అరుస్తున్నాడు. జనం చుట్టూ మూగి ఉన్నారు. అందరూ గాభరాగా చూస్తు న్నారు.

అవును. ఆ వృద్ధుని చేతిలో ఉన్నది పసిబిడ్డే.. తెల్లని గడ్డం ఉన్న ఆ ముసలా యన తనతో తలపడటానికి వస్తాదు ఎవ రైనా ఉన్నారా? అంటూ సవాలు చేస్తు న్నట్లు నా కనిపించింది. కానీ ఆ ముసలా యన వస్తాదులా బలిష్ఠంగా లేడు. బక్క చిక్కి ఉన్నాడు. సన్నగా కనిపిస్తున్నాడు. చెంపలు గుంతలు పడి ఒక రకమైన ఆత్మ న్యూనతతో బాధపడుతున్నవాడిలా ఉన్నాడు. నేను కొంచెం ముందుకెళ్లి అటూ ఇటూ చూసాను. అక్కడ వ్యాయా మశాలంటూ ఏదీ లేదు... మరి ఆ ముస లాయన సవాలు ఎందుకు చేస్తున్నట్టు? నాలో ఆసక్తి పెరిగింది.

"ఆ ముసలాయన చేతిలో ఉన్నది ఎవరి పిల్ల?" నా పక్కన నిలబడ్డ ఓ వ్యక్తిని అడి గాను. ఇంతలో 'ష్... మాట్లాడకు. విను' అంటూ వెనకనుంచి కొందరు అరిచారు. కొన్ని క్షణాలు అక్కడ మౌనం నెలకొంది. నేనూ కాస్సేపు మౌనంగా ఉండిపోయాను. మరేం చేయను? జనం గుమిగూడిన ప్పుడు నిశ్శబ్దంగా ఉండరు. నిశ్శబ్దంగా ఉంటే అది గుంపు ఎందుకవుతుంది? ఆ ముసలాయన నోటి నుంచి వినరానిదేదో వినాల్సి వస్తుందని నాకనిపించింది. జరగ రానిదేదో జరగవచ్చేమోననిపించింది. ఎందుకంటే ఈ రోజుల్లో ఎప్పుడేమవు తుందో తెలియదు. అందరూ ఉత్కంఠతో ఆ ముసలాయనవైపు చూస్తున్నారు.

"ఈ పిల్లని కొనేవారెవ్వరూ మీలో నాకు కన్పించడం లేదు.." తనలో తాను మాట్లా డుకున్నట్లుగా అన్నాడు ముసలాయన.

"ఆ.. ఏంటి నువ్వంటున్నది?" అందరూ ఏకకంఠంతో అన్నారు.

"అవును.. అన్నాను.. నేనే అన్నాను.." కోపంగా చెప్పాడు ముసలాయన.

ఒకరి మొహాలొకరు చూసుకున్నా రంతా. ఆ తరువాత వాళ్ల జేబులవంక చూసుకున్నారు. జేబులు నిండుగా ఉండ డంతో "ఓరిముసలాడా! అదేమన్నా పశువా? అమ్మేందుకు? క్షణాల్లో లక్షలు, కోట్ల బేరసారాలు చేస్తాం... ఇంకా చెప్పా

లంటే ఈ గ్రామాన్ని అమ్మేసి రాజధానిని కొనగలం.. మరి నువ్వు..."

"నేను వాస్తవం మాట్లాడాను" కోపంగా అన్నాడు ముసలాయన. కొన్ని క్షణాల మౌనం తర్వాత అక్కడున్న గుంపుని పరిశీలనగా చూసి నెమ్మదిగా అన్నాడు ముసలాయన - "నేనన్నది నిజమే... నావద్ద ఆడపిల్ల ఉంది. అమ్మకానికి... కానీ మీలో కొనేవారెవరూ కనబడటంలేదు"

"ఏం? ఎందుకని? " అన్నారు జనం.

"ఆడపిల్ల అయినందుకు..." అన్నాడు ముసలోడు.

ఆ ముసలాయన్ని ఎక్కడో ఎప్పుడో చూసినట్టు ఆ క్షణంలో నాకినిపించింది... కానీ ఎక్కడా? నాలో ఆలోచనలు ముసురుకున్నాయి. ఆ ముసలాయనవైపు మరోమారు పరిశీలనగా చూసాను. పలచగా ఎత్తుగా ఉన్నాడు. బట్టలు నలిగి ఉన్నాయి. గడ్డం నెరిసి ఉంది. కాని అతన్ని పోలిన మనుషులు మా ఊర్లో చాలా సందర్భాల్లో తారసపడే ఉంటారు..ఏం చెప్పగలం...?

ఆ ముసలాయన్ని 'నీ పేరేంటి బాబా? ' అని అడుగుదామనిపించి నోరు తెరిచి ఆగిపోయాను.

ఆ ముసలాయన పోలికలు ఉన్న వ్యక్తులు ఎవరైనా ఉన్నారేమోనని కొన్ని క్షణాలపాటు ఊహల్లో మా ఊరంతా కలియతిరిగాను. కానీ ఆయా ఇళ్లల్లో ఆడపిల్లలు గానీ, మనవరాళ్లు గాని లేరు... ఈ విషయం నాకు ముందుగా తట్టనందుకు ఆశ్చర్యపోయాను.

గుంపంతా ఆ ముసలాయన వంక చూశారు. కొందరు ఆ ముసలాయన్ని తిట్టుకోవడం నాకు వినిపించింది. 'ఇతనికి పిచ్చిపట్టలేదు కదా' అంటూ అందరూ ఒకరి మొహాలొకరు చూసుకున్నారు.

'అవును పిచ్చివాడు...'

'కానీ అలా లేడు...'

'ఇంకా ఎటువంటి అకృత్యాలకు దిగుతాడో...'

'అంటే...? '

'అవును. పిచ్చివాళ్లలాగానే చేస్తున్నాడు'

'అలాంటివేవీ కనబడ్డంలేదే...'

"ఈ పిల్ల పిచ్చిదా? " నేను జనాల్లోంచి ముందుకి చొచ్చుకెళ్లి ధైర్యం చేసి అడిగాను.

"కాదు" అని చెప్పాడు ముసలాయన.

"వికలాంగురాలా? "

"కాదు..."

"మరి ఆ పిల్లను ఎందుకు అమ్ముతున్నావు? " అని తీవ్రస్వరంతో అడిగాను.

"ఎందుకంటే ఏం చెప్పను? నిజం చెబితే మీరు నమ్మరు. చెప్పినా అర్థం

చేసుకోరని తెలుసు"

"ఎందుకని? " అడిగాను ఆశ్చర్యంగా.

"మీకు ఆశ్చర్యం అనిపించినా, మీరు నమ్మినా, నమ్మకపోయినా ఇదిమాత్రం వాస్తవం. వినండి" ధైర్యం ప్రదర్శిస్తూ అన్నాడు ముసలాయన.

ఏమిటన్నట్లు చూశారంతా! ఆ సమయంలో మా వెనక వైపు 'గోభీ... ఆలూ... అంగూర్...' అంటూ కూరగాయలు, పండ్లు అమ్మకందార్లు అరుస్తుంటే కొనుగోలుదార్ల కొనడానికి అటూ, ఇటూ తిరుగుతున్నారు. అందుకే ఆ ప్రాంతమంతా సందడిగా ఉంది.

"ఏమిటో చెప్పు" ముసలాయన వంక చూస్తూ ఆత్రంగా అడిగాను.

ముసలాయన చెప్పడం మొదలుపెట్టాడు.

"నా కోడలు ఆడపిల్లని ప్రసవించింది. నా కొడుకు నిరాశ చెందాడు. దీని పీక పిసికి చంపాలని చూసాడు. ఇది చావలేదు. ఈ పిల్లని ఏదో విధంగా వదిలించుకోవాలనుకుని "బయటకి తీసుకెళ్ళి దీని పెదాల మధ్య జిల్లేడుపాలు వేయిచస్తుంది; పీడ విరగడవుతుంది" అంటూ ఈ బిడ్డని నాకందించాడు. నేను దీని పెదాల మధ్య జిల్లేడుపాలు పోసాను. పిల్ల పాలని చప్పరించింది. నెమ్మదిగా గుటక పడింది. అయినా ఇది చావలేదు. దాంతో అమ్మకానికి పెట్టాను"

"ఆడపిల్లని అమ్ముతావా! చంపడానికి సిద్ధపడతావా? అమానుషం. ఈ దుర్మార్గానికి పాల్పడ్డానికి నీకు సిగ్గనిపించటం లేదా? " గుంపులోంచి కొందరు అరిచారు.

"సిగ్గు దేనికి? " అన్నాడు ముసలాయన.

"పసిబిడ్డని చంపడానికి సిద్ధపడినందుకు"

"నేనొక్కడినే కాదు!"

"మరి? "

"ఇంటింటా జరిగేదే..."

"పాపం... శాపం..."

"అదేం కాదు. సవ్యంగానే జరుగుతోంది" అన్నాడు ముసలాయన.

"ఎలా? "

"చెబుతాను. వింటారా? "

"ఆ... వింటాం. చెప్పు"

"కట్నాలూ కానుకలూ ఇచ్చి పెళ్ళి చేసినా ఆడపిల్లలు కూడా తండ్రి ఆస్తిలో భాగం అడుగుతున్నారు..." ముఖంలో భావాలు స్పష్టంగా కనబడనీయకుండా చెప్పాడు ముసలాయన.

"ఎందుకడక్కూడదు? " అంటూ అరిచారు గుంపులోని జనం.

"ఆడపిల్ల అన్నాక ఎప్పటికైనా ఒకయ్య చేతిలో పెట్టాల్సిందే కదా! అత్తారింటికి వెళ్ళిన తర్వాత వాళ్లు పరాయివాళ్ళయిపోతారు. భార్యల ఆస్తిని భర్తలు రకరకాల దుర్వ్యసనాలకు తగలేస్తారు... అంతే కాదు, వాళ్లు సేవలు చేసేది మెట్టినింటివారికే. ఇక పుట్టింటివారికి ఏ విధంగా ఉపయోగముంటుంది? "

"అయితే? అది ఎప్పటినుంచో వస్తున్న ఆచారం..."

"అదేం కాదు. ఇప్పుడు ఆడపిల్లలను కడుపులో వుండగానే చంపేస్తున్నారు.. మీకు తెలీదా? "

"అటువంటప్పుడు మీ ఇంట్లో ఆడపిల్ల ఎలా పుట్టింది? " అంటూ అరిచింది గుంపులో నుంచి ఓ మహిళ.

"వెర్రిదానా! ఈ బిడ్డని గర్భంలోనే అంతం చేయాలని ప్రయత్నించాడు నా కొడుకు. కానీ నా కోడలిలోని మాతృత్వ భావన అందుకు అంగీకరించలేదు"

"మీ కోడలా? "

"అవును నా కోడలికి దూరదృష్టి ఎక్కువ. ఆడపిల్ల అంతం సృష్టికే ప్రమాదమని, బహుశా రేపటిరోజు స్త్రీలు లేని ఈ భూమిమీద మానవజాతి ఆనవాళ్లు మిగలవనే ముందుచూపు ఉంది మా కోడలి

కి.." అంటూ తన కోడలి విజ్ఞతని గుంపు లోని వారందరికీ ప్రశంసాపూర్వకంగా తెలియజేశాడు ముసలాయన.

తన బిడ్డని గర్భంలో నష్టపోకుండా కాపాడుకున్న ఆ మాతృమూర్తి ఎంతో సాహసం గల మహిళగా నా కళ్లముందు సాక్షాత్కరించినట్లయింది. ఆమె సమా జంలో జరుగుతున్న అన్యాయాలను ఎదు ర్కొని నిలబడే ఆదరణీయ మహిళగా నాకనిపించింది.

"అయితే మీ కోడలు ధైర్యం, సాహసం గల మాతృమూర్తి.. అవునా? " అడిగాను.

"ఆc ఏం ధైర్యం? ఆమెని ఊరినుంచి బహిష్కరించారు..."

"ఎందుకని? "

"ఆడపిల్లని కన్నందుకు"

"అది శుభసూచకం. పైగా ఆడపిల్ల ఇంటికి మహాలక్ష్మి..."

"కానీ మా కోడలిని ఊరినుంచి బహి ష్కరించారు..."

"ఆశ్చర్యంగా ఉంది..."

"ఆశ్చర్యపడ్డానికేముంది? ఊళ్లో ఎవరిం ట్లోనూ ఆడపిల్లలు లేరు. ఆడపిల్లని ప్రసవించి మా కోడలు ఊరికి కళంకం తెచ్చింది. మా బాధ మీకు అర్థం అయిం దనుకుంటాను" అంటూ ఆ ముసలాయన గుమిగూడిన జనాలను చూస్తూ "మీరే చెప్పండి? " అన్నాడు.

ఇలా ముసలాయన మాట్లాడుతుండగా నాలో ఆలోచనలు గింగిరాలు తిరుగుతు న్నాయి. ఎక్కువ సంతానం వుండకూడ దని నా చిన్నతనంలో ఊరి పంచాయితీ నిర్ణయించిన విషయం నాకు గుర్తొచ్చింది. ఆ నిర్ణయాన్ని విని అందరూ పడీ పడీ నవ్వారు. ముసలివారు కూడా పగలబడి నవ్వారు. ఆ తర్వాత ఈ సమస్యమీద కూలంకషంగా చర్చ జరగాలని పంచా యితీ తీర్మానించింది. పంచాయతీ పెద్దలు గప్పాలు పలుకుతూ వ్యర్థ ప్రేలాపనలు చేశారు. అయితే వీరు చెప్పినదానికి



ఎవరూ అంగీకారం తెలపలేదు.

"అయితే ఇక రాత్రిపూట ఏకాంత సమ యంలో కూడా పంచాయితీ పెద్దలు భార్యాభర్తల వెంట ఉంటారా? పంచా యితీ భూమిక ఇదేనా? " అంటూ కొందరు పంచాయతీ పెద్దలపై విరుచుకు పడ్డారు. ఊరంతా ఓ రకమైన భయం ఆవరించింది. చిన్నపిల్లల దగ్గర నుంచి కౌమారదశలోని యువతులందరూ పంచాయితీ నిర్ణయం వినడానికి కిటికీ లోంచి చూడసాగారు.

అనేకానేక వాదవివాదాల తర్వాత జన నాల సంఖ్య తగ్గించడానికి ఆడశిశువుల జ నన రేటును తగ్గించాలని పంచాయితీ ఆదేశించింది. ఊళ్లో కలకలం. జనంలో గుసగుసలు. చెవులకి సోకిన మాటలు స్పష్టంగా లేవు. కొందరు దెబ్బలాడుకుం టుంటే మరికొందరు వాళ్లకి సర్దిచెప్పే ప్రయత్నం చేస్తున్నారు. ఏది ఏమైనప్పటికీ ఎవరూ ఏమీ చేయలేకపోయారు. ఇలా నేను ఆలోచనల్లో ఉండగానే..

"ఏంటలా చూస్తున్నారు? ఈ పిల్ల అమ్మకానికుంది... కొనేవారుంటే ముందు కి రండి!" గుంపులో గుసగుసల మధ్య అరిచాడు ముసలాయన.

"కానీ ఇది చాలా చిన్నది" గుంపులోంచి ఓ యువకుడి గొంతు ఖంగుమంది.

"అంతేకాదు. నోరు లేనిది. పాపం మన సులో మాట చెప్పుకోలేదు" గుంపులోంచి

మరోగొంతు మాట్లాడింది.

"అందుకేగా అమ్ముడుపోయేది... పెరిగి పెద్దయితే అమ్ముడవదు... హక్కులకోసం గళం విప్పుతుంది"

"అంటే ఈ అమాయకురాలికి ప్రాథమిక హక్కులంటూ ఏమీ లేవా? " అని నేను అడిగాను.

"ఎందుకులేవు. తప్పకుండా ఉన్నాయి!" అన్నాడు ముసలాయన.

"అయినా అమ్మకానికి పెట్టావా? " అన్నాను.

"నేను వాదవివాదాలు జరపటానికి రాలేదు..." అన్నాడు ముసలాయన.

"అంటే..."

"ఇది బజారు.. గోష్టి గృహం కాదు.." అన్నాడు ముసలాయన.

అనువాదం :
**పాలకోడేటి కృష్ణమూర్తి**

"ఇదింకా బతికే ఉంది... ఊపిరి వుంది..." అన్నాను నేను.

ఈసారి ముసలాయన మాటల్లో ఆగ్రహం తొంగి చూసింది. అతనన్నాడు-

"ఆడపిల్ల జీవించనట్లే... జాగీర్దారీ వ్యవస్థ మళ్ళీ మొదలయ్యింది..."

ముసలాయన ఆగ్రహం భయంకరమైన విషాద బీభత్సాలకు ప్రతీకలా ఉంది. మళ్ళీ మంచుయుగం మొదలవబోతున్నట్లుగా అందరి మనసులు భయంతో ఆందోళనతో నిండిపోయాయి. ఊపిరి బిగబట్టి చూశారంతా.

ఆ ముసలాయన వ్యవహార శైలి నాకు అనుమానం కలిగించింది. అతని మాటలు నమ్మశక్యంగా లేవనిపించింది. ఆయన చెప్పేదాంట్లో ఏది సత్యం? ఏదసత్యం? ఆయన నిజంగా కొడుకుతో కలిసే ఉంటున్నాడా? ఎందుకంటే ఆయన తన కొడుకు కుమార్తెని అంటే మనుమరాలిని మార్కెట్‌లోని వస్తువుగా అమ్మకానికి పెట్టాడా? లేక విధిలేక అసహాయస్థితిలో ఇవన్నీ చేస్తున్నాడా? పరిపరివిధాలా ఆలోచించాను. ఏది ఏమైనప్పటికి పూర్వీకులు కూతుళ్ళు, మనుమరాళ్లు (కుమారుని కుమార్తె), మనుమలు (కుమార్తె కుమారుడు), మనుమరాళ్లు (కుమార్తె కుమార్తె) పట్ల అపూర్వ భావనతో ఉండేవారు. ముఖ్యంగా కుమార్తె కుమార్తెలు ఆదరణీయంగా ఉంటారని ప్రజలు అనేవారు. మరి కుమారుని కుమార్తె మాటేమిటి? ఇలా ఆలోచనలు చుట్టుముట్టాయి నన్ను. చెయ్యి కాల్తే కాల్తుంది. చేతిదేముంది? ఆ ముసలాయన్ని దూరంగా తీసుకెళ్ళి అతని గుండె లోని మంటని ఆర్పుదామనిపించింది.

ఇంతలో గుంపులోంచి "నిన్న ఇక్కడే బంగాళాదుంపల వేలం జరిగింది" అంటూ అరిచారెవరో.

"బంగాళాదుంపలు అమ్ముడుపోయాయా? లూటీ కాబడ్డాయా? " అన్నాను నేను ముసలాయనతో..

"తెలీదు... ఈరోజు ఓ ఆడశిశువు అమ్మకానికుంది.. కొనేవారు ఎవరైనా ఉన్నారా? " ముసలాయన గొంతెత్తి అరిచాడు. ఒక్కక్షణం ఆగి మళ్ళీ ఆ ముసలాయన "ఇది ఆడపిల్లయిపోయింది. అదే బంగాళాదుంపలైతే... మీరు విరగబడి కొంటారు!" అన్నాడు ముసలాయన.

నేను ఒకడుగు ముందుకేసి "ఏ ఊరు తాతా నీది? " అంటూ ధైర్యం చేసి అడిగాను.

ముసలాయన ఉలిక్కిపడి "ఎందుకు? " అన్నాడు.

"ఆడపిల్లల మీద శత్రుత్వం పెంచుకున్న వాళ్లు ఏ ఊరివాళ్లో తెలుసుకుందామని.."

"ఒకఊరు అన్నమాటేంటి. ఇవాళా రేపు అంతటా ఇదే పరిస్థితి నెలకొనివుంది" అని అంటూ నేను ఆ చుట్టుపక్కల గ్రామస్థుడి

నేమోనని నాకేసి నిశితంగా చూశాడు ముసలాయన. కానీ నేను ఆ ముసలా యన్ని ఎరుగనుకూడా ఎరుగను.

"అయితే రేపటితరం వాళ్లు ఆడపిల్లల మొహం చూడ్డానికి తహతహలాడు తారు.." అన్నాను.

"అయితే మనకేంటి?" అన్నాడు ముస లాయన.

"అంటే..."

"నేను ఇప్పుడే ఈ పిల్లని అమ్ముకుపో తాను. ఇక నాపని ఇక్కడ ఏముంది?"

"మరి బంగాళాదుంపలు అమ్మవా?"

"అది నా కొడుకు చూసుకుంటాడు. అమ్మితే అమ్ముతాడు లేకుంటే లేదు..."

ఇంతలో మా వెనుకవైపున రకరకాల కూరగాయలతో నిండిన ఓ ఆటో ట్రాలీ వచ్చి ఆగింది. అందరూ వెనక్కి తిరిగి చూసారు. 'వంకాయలు కిలో రూపాయి.. గోభీ పావలా... బంగాళాదుంపలు.. ముల్లంగి...' అంటూ పెద్దగా అరుపులు వినబడ్డాయి. దాంతో గుంపు చెదిరిపో యింది.

"పువ్వులాంటి బిడ్డ అమ్మకానికుంది... కొనేవారుంటే ముందుకి రండి..." ముస లాయిన మళ్లీ అరిచాడు.

నేను మరింత ముందుకు వెళ్లి "సరే మంచిది ధర ఎంత?" అడిగాను.

"ధర అంటూ ఏమీలేదు" అరిచినట్లుగా చెప్పాడు ముసలాయన.

"ఏం? ఎందుకని?"

"ఇప్పుడు ధరపలక్కపోయినా ప్రజలు ఆడపిల్లల్ని ఉంచుకోలేరు.. ఇది నిజం నమ్మండి.." అన్నాడు ముసలాయన.

నేను ఆ బిడ్డని మా ఊరు తీసుకెళ్ళి నట్లు ప్రజలు మురిసిపోయి మిఠాయిలు పంచినట్లు డప్పు వాయిద్యాల మధ్య స్త్రీలు 'గిద్దా' (గిరిజనుల నృత్యం) నృత్యం చేస్తూ ఆ బిడ్డకి హృదయపూర్వకంగా స్వాగతం పలికినట్లు ఓ దృశ్యరూపం నా ఊహాల్లో కదలాడింది.

వెంటనే ముసలాయనతో "సరే దాన్ని ఇలా ఇవ్వు... నేను కొనుక్కుంటాను... పూవులాంటి పాపాయి..." అంటూ నేను చేతులు చాచి ముద్దులొలికే ఆ పసిపాపని అందుకున్నాను.

ముసలాయిన నావంక ఆశ్చర్యంగా చూస్తూ "ఏమిటి దీన్ని... నువ్వా... నువ్వు యువకుడివి. ఇది పసిబిడ్డ దీన్ని నువ్వేం చేసుకుంటావు?" అన్నాడు.

నేను వెంటనే చెప్పాను-

"మా ఊళ్లో కూడా ఆడపిల్లలు లేరు... అక్కడివాళ్లకి ఈ బిడ్డని చూపించి "ఆడపి ల్లలు ఈ విధంగా ఉండేవారని..." చెబు తాను"

V

తెలుగు కథ

- ప్రతాప రవిశంకర్

# స్త్రీకి స్త్రీ శత్రువు కాదు!

**భ**యపడుతూనే ఆ పార్టీకి వెళ్లింది. ఆ బర్త్‌డే పార్టీకి జాన్సన్ తప్పకుండా వస్తాడని అనుకుంది. కానీ ఒక్కడే వస్తాడా? భార్య రోజీని కూడా తీసుకుని వస్తాడా? అనే సందేహం కలిగి ఆలోచిస్తూ వుండిపోయింది. రోజీ ఆ పార్టీకి వస్తే తప్పకుండా తనతో గొడవ పడుతుంది. తన పరువు పోగొడుతుంది.

సరే ప్రస్తుతం తను ఎదుర్కొంటున్న పరిస్థితులను దృష్టిలో వుంచుకుని అన్నిటికీ తెగించి జాన్సన్‌ని కలవాలని ఆ పార్టీకి వెళ్లింది. ఈ విషమ పరిస్థితుల్లో జాన్సన్ సాయాన్ని ఆశించక తప్పదు మరి.

ప్రిస్కిల్లా ఇల్లంతా సందడిగా వుంది. ఇంటి ముందున్న ఖాళీ స్థలంలో చాలా రకాల మోటారు వాహనాలు ఆగివున్నాయి. ముఖద్వారం దగ్గర నిలబడి వుంది ప్రిస్కిల్లా అతిథులకు స్వాగతం పలుకుతూ. ఆమె తన స్నేహితురాలు. ఆరోజు ఆమె భర్త జోసెఫ్ పుట్టినరోజు.

"హాయ్ మేరీ" అంటూ కరచాలనం చేసింది ప్రిస్కిల్లా తనకు దగ్గరగా వచ్చి.

"జాన్సన్ వచ్చాడా? " గుసగుసలాడుతున్నట్టుగా అడిగింది తను.

ప్రిస్కిల్లా చిన్నగా నవ్వి "జాన్ రాలేదు గానీ రోజీ వచ్చింది. పైకి వెళ్ళకు. తను పైన కూర్చుంది. నువ్వు కిందనే వుండు. ఇంకొంచెం సేపట్లో నేనొస్తాను" అంది.

స్నేహితురాలికి థాంక్స్ చెప్పి లోపలకు వెళ్లి కుర్చీలో కూర్చుంది. కొంతమంది తెలిసినవాళ్లు కనిపించారుగానీ తనే చూసి కూడా చూడనట్టు నటించింది. ఎవరైనా తన గురించి అడిగితే యేం చెబుతుంది? నలుగురితో చెప్పుకునే విషయమా?

రోజీ మేడమీద వుందని తెలిసినా భయంగానే వుంది. ఒకవేళ రోజీ కిందకు దిగివస్తే తన గతేం కాను? తనని రోజీ బారినించి ఎవరు కాపాడగలరు? రోజీ గురించి తనకు బాగా తెలుసు. ఆడపులి. తను దేవుడిని ప్రార్థించక తప్పదు.

ఇంటినంతా రంగురంగుల కాగితాలతో అలంకరించారు. ఇళ్లంతా రకరకాల లైట్లతో వెలిగిపోతోంది.

చాలామంది అతిథులు వచ్చారు. అంతా ఉత్సాహంగా నవ్వుతూ తిరుగుతున్నారు. ఆ పార్టీకి రోజీ రాకుండా వున్నట్లయితే తను కూడా కొంచెం ఉల్లాసంగా వుండగలిగేది. కానీ ఇప్పుడు రోజీ తన పాలిట సింహ స్వప్నమయింది. ఇంతకీ జాన్సన్ ఈ పార్టీకి ఎందుకు రాలేదు? జాన్సన్, ప్రిస్కిల్లా భర్త జోసెఫూ మంచి స్నేహితులు. ఆరోగ్యం బాగాలేక రాలేదేమో అనే ఆలోచన కలిగింది. అలా అయివుండదు. అలా అయితే ప్రిస్కిల్లా తనతో చెప్పేది.

జాన్సన్ రానప్పుడు తను అక్కడ వుండి ప్రయోజనం ఏముంది? రోజీ కిందకు రాకముందే తను జారుకుంటే మంచిది. సరిగ్గా ఇలా అనుకుంటున్నప్పుడే ప్రిస్కిల్లా వచ్చింది. తను వెళ్లదల్చుకున్నట్టుగా ఆమెతో చెప్పింది.

"భయపడకు మేరీ.. నిన్ను నేను కాచు

కుంటాను. పార్టీ అయిపోయేవరకు వుండు. భోజనం చేశాకనే నిన్ను కదలనిస్తాను" అన్నది ప్రిస్కిల్లా అధికారం ధ్వనిస్తున్న గొంతుతో.. ప్రిస్కిల్లా గొంతులో, మాటల్లో అధికారమే కాదు ఆప్యాయత కూడా వుంది.

"ప్రిస్కీ.. నువ్వు నన్ను ద్వేషించటం లేదా? " ఆశ్చర్యపడుతూనే అడిగింది తను.

ప్రిస్కీ గొప్ప వేదాంతిలా నవ్వి "స్నేహం విలువ నాకు తెలుసు మేరీ... ఈ రోజు జరిగిన ఒక తప్పుకు కొన్నేళ్ల స్నేహాన్ని బలిచేసే మూర్ఖురాలిని కాదు" అన్నది.

తన కళ్లలో గిర్రున నీళ్లు తిరిగాయి. నిజానికి తను చేసిన పనికి ఎవరయినా ద్వేషిస్తారు. కానీ ప్రిస్కిల్లా? ?

ఇంతలో ప్రిస్కిల్లా భర్త జోసెఫ్ మేడ మీద నించి వచ్చాడు. ఆయన రావడంతోనే అంతా ఒక్కసారిగా అరిచారు. బహుశా అది బర్త్‌డే విషెస్ చెప్పే లక్షణం అయివుంటుంది.

భర్త రాకతో ప్రిస్కిల్లా తన దగ్గర్నించి వెళ్లిపోయింది.

తన ఆలోచనలు మళ్లీ మొదలు. రోజీని ఎలా ఎదుర్కోవాలి? తను తప్పు చేసింది. అప్పట్లో తన తప్పు తెలీదు గానీ ఇప్పుడు భయపడుతోంది.

ఈ మధ్య దురదృష్టకరమయిన విషయం ఒకటి జరిగింది. రోజీ భర్త జాన్సన్‌కీ తనకీ మధ్య సంబంధం ఏర్పడింది. వివాహేతర సంబంధాన్ని లోకం హర్షించదు కదా- ఇప్పుడు కూడా అదే జరుగుతోంది. ఈ సంబంధం గురించి రోజీకి తెలిసింది. తన భర్త ఫ్రాన్సిస్‌కు కూడా తెలిసి తనని కొట్టి ఇద్దరు పిల్లల్నీ వదిలి వేరే వెళ్లిపోయాడు. తను ఒంటరిదయ్యింది. ఆర్థికంగా ఎన్నో అగచాట్లు పడుతోంది. జోసెఫ్ భయపడి నట్టున్నాడు. తరువాత తనని కలవలేదు.

ప్రిస్కిల్లా ఫోన్‌చేసి తన భర్త బర్త్‌డే పార్టీకి రమ్మని ఆహ్వానించినప్పుడు ఆ పార్టీలో జాన్సన్‌ని కలిసి అతడి సాయాన్ని కోరవచ్చుననే ఆశ కలిగింది తనకు. కానీ తన ఆశను నీరుగారుస్తూ జాన్సన్ రాలేదు. రోజీ వచ్చింది. తనతో గొడవ పడాలనే వచ్చి వుంటుంది.

భగవంతుడా... రోజీనించి రక్షించు. పరువుపోకుండా చూడు..

తన ప్రార్థనకు తనకు నవ్వొచ్చింది. ఆ పరిస్థితుల్లో కూడా.. తప్పు చేసిన మనిషి అందుకు తగిన శిక్షను అనుభవించటానికి సిద్ధపడాలనే తత్వం తనది. అలాంటిది ఇప్పుడు దేవుడ్ని ప్రార్థిస్తోంది శిక్ష నుంచి కాపాడమని. మనిషి నైజం ఇంతేనేమో! తన వరకూ వస్తే అన్ని తత్వాలూ గాల్లో కలుస్తాయి.

అయిపోయింది. తను భయపడినంతా జరగబోతోంది. రోజీ చిన్నగా మెట్లు దిగి వస్తోంది. తన చుట్టూ ఎవరూ లేరు.

తను జీవంలేని చూపు చూస్తోంది. ఉరిశిక్ష పడిన నేరస్థుడిలా వుంది తన పరిస్థితి.

గబగబా బయటకు వెళితే. కుదరదు. రోజీ తనని చూసింది. అందరినీ తప్పుకొని తన దగ్గరకే వస్తోంది.

తన పని ఖాళీ.. ఇవాల్టితో తన పరువు గంగలో కలిసిపోతుంది. రోజీ దగ్గరకు వచ్చింది.

తన ఎదురుగా నిలబడి "ఎలా

వున్నావ్? ” అనడిగింది.

తనకు మాట బయటకు రాలేదు. గొంతు తడిలో ఆరిపోయినట్టుంది.

“ఇక్కడ కాదు. బయటకు వెళ్లి మాట్లాడుకుందాం పద” అన్నది తనే.

ఇదీ కొంత నయమనిపించింది. ఈ గొడవను అంతా వినే అవకాశం వుండదు.

బయటకు వెళ్లాక రోజీ ఒక చెట్టు దగ్గర నిలబడింది. తనూ ఆమెకు కొంచెం దూరంలో. రోజీ మొహం సీరియస్‌గా వుంది. తనతో గొడవపడాలనే వచ్చివుంటుంది. సందేహం లేదు.

“ప్లీజ్. ఇప్పుడు నాతో గొడవ పడకు. ప్రస్తుతం నానించి నా ఏడుపు తప్పించి మరొక జవాబు రాదు” అన్నది ఎలాగో.. తన గొంతు తనకే చిత్రంగా తోచింది. పక్షవాతం వచ్చిన మనిషిలా మాట్లాడింది.

ఎందుకు నవ్విందో తెలీదుగానీ రోజీ నవ్వి “నువ్వు ఈ పార్టీకి జాన్సన్ కోసమే వచ్చావని తెలుసు. చూశావా జాన్సన్ రాలేదు. జాన్సన్ ఎందుకు రాలేదో నువ్వు వూహించగలవా? ” అనడిగింది రోజీ.

రోజీకి తనమీద కోపం లేదా? ఇలా మాట్లాడుతోంది. తను అనవసరంగా భయపడిందా?

“చెప్పు మేరీ. జాన్సన్ ఈ పార్టీకి ఎందుకు రాలేదు? ” అన్నది మళ్లీ.

“తెలీదు రోజీ” చిన్నగా గొణిగింది.

మనసు మూలల్లో ఎక్కడో ఏదో భయం కదులుతూనే వుంది. తుపాను ముందు ప్రశాంతతా ఇది. తేల్చుకోలేకపోతోంది.

“నువ్వు భర్తకు దూరమై ఒంటరిగా బతుకుతున్నావనీ, ఇద్దరు పిల్లలూ విషజ్వరాలతో ఉన్నారనీ, వాళ్లకు వైద్యం చేయించటానికి డబ్బులేక నువ్వు బాధపడుతున్నావనీ జాన్సన్‌కు తెలుసు. ఈ పార్టీకి వస్తే నువ్వు అతడి సాయాన్ని అర్థిస్తావనే భయంతో జాన్సన్ ఇక్కడకు రాలేదు మేరీ. తెలుసుకున్నావా జాన్సన్ ఎలాంటి మనిషో? గొప్ప అవకాశవాది. అంతకు మించి పిరికివాడు. చాలామంది అవకాశవాదుల్లో పిరికివాళ్లే ఎక్కువమంది వుంటారు. నిజానికి బాధ్యత తీసుకోనప్పుడు ఏ మనిషీ ఇంకో మనిషిని కోరుకోగూడదు. జాన్సన్ ఎలాంటివాడో నాకు బాగా తెలుసు” అని రోజీ మాట్లాడటం నిలిపేసింది.

తనకు భయమేసింది ఆ మాటలు విన్నాక. ఇప్పుడు తనకేమిటి దారి? జాన్సన్ నించి తనకు ఎలాంటి సాయమూ లభించదు. ఒకవేళ జాన్సన్ ఆ పార్టీకి వచ్చినా తన పని అయ్యేదికాదు. తన కళ్ల ముందు విష జ్వరాలతో బాధపడుతున్న పిల్లలు కనిపించారు. తనకెవరు సాయం

చేస్తారు?

రోజీ తిరిగి మాట్లాడటం మొదలుపెట్టింది.

"ప్రిస్కిల్లా ఇంకా ఏమన్నదో తెలుసా? ఒక తప్పులో ఇద్దరు భాగస్వాములయినపుడు ఒక్కరినే కార్నర్ చెయ్యటం ధర్మం కాదన్నది. ఇవాల్టి తప్పుకు ఎన్నో ఏళ్ల స్నేహాన్ని బలిపెట్టటం మూర్ఖత్వమన్నది. నిజమే. మన స్నేహంలో గడిపిన ఎన్నో విలువైన క్షణాలను విలువ లేకుండా చెయ్యకూడదు కదా. నిన్ను నేను అర్థం చేసుకోగలను. అనవసరంగా నీకు ఇదంతా చెబుతున్నాను. ప్రిస్కిల్లా నీకు అభయమిచ్చి వుంటుంది. అవును కదూ? "

తలవూపింది అవునన్నట్టు. భయపడకు నేను కాచుకుంటానని ప్రిస్కిల్లా అనటం గుర్తుకొచ్చింది.

"జాన్సన్ రాకపోయినా, ఈ పార్టీకి నేను నీ కోసమే వచ్చాను. నీతో గొడవ పడటానికి మాత్రం కాదు" అంది రోజీ.

"ఎందుకు? " వెంటనే అడిగింది తను. అడగాలని మాత్రం కాదు. ఎందుకో అలా వచ్చేసింది.

"ఎందుకంటే- జాన్సన్ చెయ్యాల్సి ఉండి కూడా చెయ్యని పనిని అతడి భార్యగా నేను చెయ్యాలని"

"అంటే? క్లియర్‌గా చెప్పు"

రోజీ మాట్లాడకుండా హాండ్‌బ్యాగ్‌ను తెరిచింది. తను ఆశ్చర్యంతో చూస్తోంది.

రోజీ బ్యాగ్‌లోనించి కొన్ని వందల రూపాయలనోట్లు తీసి తనకిస్తూ "తీసుకో మేరీ. ఈ డబ్బుతో నీ పిల్లలకు వైద్యం చేయించు. నీ అవసరాలు తీర్చుకో. ఒక స్నేహితురాలిగా ఇస్తున్నాను" అన్నది.

తనకి ఏడుపు తన్నుకొని వచ్చింది. ఎంత ఆపుకుందామనుకున్నా సాధ్యం కాలేదు. చివరకు పెద్దగా ఏడ్చింది కూడా.

"ధైర్యంగా ఉండు మేరీ... జాన్సన్‌కీ నీకూ ఈ మధ్య సంబంధం ఏర్పడి ఉండొచ్చు. కానీ మన మధ్య ఎప్పటినుంచో స్నేహబంధం ఉంది. ఒక స్నేహితురాలిగా సా యం చెయ్యలేనప్పుడు నేను నీ స్నేహితురాలిననే ఆలోచనే నా గుండె కోతకు కారణమవుతుంది. సందేహించకు. తీసుకో.."

తనకు అంతా కలగా ఉంది. ఇదేమిటి! ఇలా జరుగుతోంది. తనేం చెయ్యాలి?

"ప్రిస్కిల్లా ఇంకా ఏమన్నదో చెబుతాను. ఎంతటి దుర్మార్గుడయినా నీళ్లలోపడి కొట్టుకు పోతున్నప్పుడు అతడిని రక్షించాలిట. ఆ పరిస్థితుల్లో అతడి దుర్మార్గాన్ని చూడకూడదట. మానవత్వంతో అతడి ప్రాణాపాయ స్థితిని చూడాలిట. కొన్ని పరిస్థితుల్లో కొన్ని రకాల పనులు చెయ్యగూడదన్నది. ప్రస్తుతం నువ్వున్న పరిస్థితుల్లో నిన్నింకా బాధపెట్టడం న్యాయం కాదని చెప్పింది. నా దృష్టిలో ప్రిస్కిల్లా గొప్ప వేదాంతి" అన్నది రోజీ.

"రోజీ నన్ను క్షమించు" పూడుకుపోయిన గొంతుతో అన్నది.

"మన మధ్య క్షమాపణలు ఉండవు"

"నీ రుణం ఎలా తీర్చుకోవాలో తెలీటం లేదు"

"నువ్వు తీర్చుకోవాల్సింది నా రుణం కాదు. ప్రిస్కిల్లా రుణం"

వాకిలి దగ్గర నిలబడి ప్రిస్కిల్లా విరగబడి నవ్వుతోంది.

ఇంగ్లండ్ కథ

- పెట్రీషియా హైస్మిత్

# నత్తలగది

మిస్టర్ పీటర్ నాపర్ట్ నత్తల్ని పరిశీలించడం తన ప్రవృత్తిగా చేసుకున్నప్పుడు తన దగ్గరున్న గుప్పెడే వందలు, వేలు అవుతాయని కలగనలేదు. ఆయన తన గదిలోకి మొట్టమొదటిసారి నత్తగుల్లల్ని తీసుకెళ్ళిన రెండునెలలకే ముప్ఫై గాజుతొట్టెల్లో అవి నిండిపోయి ఆయన లెక్కలు రాసుకునే బల్లమీద, కిటికీల్లో, నేలమీద కూడా పరుచుకున్నాయి. మిసెస్ నాపర్ట్‌కి అవంటే మహా చీదర. 'కంపు కొడుతోంది' అని ఆ గదిలోకి రావడమే మానేసింది. పైగా ఒకసారి ప్రమాదవశాత్తు ఒక నత్తని తొక్కింది. ఈ జుగుప్సాకర సంఘటనని ఆవిడ మర్చిపోలేదు. భార్య, స్నేహితులు ఎంత వద్దని బతిమాలినా, మిస్టర్ నాపర్ట్‌కి మాత్రం నత్తల్ని పరిశీలించడంలో ఏదో చెప్పలేని ఆనందం దొరుకుతోంది.

మిస్టర్ నాపర్ట్ ఒక బ్రోకరేజ్‌లో పార్ట్‌నర్‌గా పనిచేస్తున్నాడు. జీవితమంతా లెక్కలకి అంకెలకి లంకె వేయడంలోనే సరిపోయేది. "నేను ప్రకృతి పరిసరాలు ఎప్పుడూ పట్టించుకునేవాణ్ని కాదు...కానీ నత్తలు నాకు జంతుప్రపంచపు అందాలని చూపించి కళ్ళు తెరిపించాయి" అంటుండేవాడు. ఆయన స్నేహితులు పొరపాటునగానీ నత్తలు జంతువులు కాదని, వాటి జిగటరూపాలు ప్రకృతి అందం కానేకాదని అన్నారా, మిస్టర్ నాపర్ట్ వారిని వెర్రివాళ్లలా చూసి ఒక సుదీర్ఘమైన చిరునవ్వు నవ్వి "మీకు నత్తలగురించి నాకు తెలిసిన దాంట్లో పిసరంత కూడా తెలీదు" అనేవాడు.

అది నిజమే. ఎందుకంటే మిస్టర్ నాపర్ట్ నత్తలిచ్చిన ప్రదర్శన ఒకటి చూశాడు. ఏ జంతుశాస్త్ర పుస్తకాల్లోను, విజ్ఞానసర్వస్వాల్లోను దాన్ని గురించిన వర్ణన లేదు.

ఒకరోజు సాయంకాలం నాపర్ట్ ఆఫీసు నుంచి రాగానే ఏదైనా తిందామని వంటగదిలోకి వెళ్ళాడు. గట్టుమీద నీళ్ళుపోసి పెట్టిన పింగాణీ గిన్నెలో నత్తలు వింతగా ప్రవర్తించడం ఆయన దృష్టిని ఆకర్షించింది. అవి తోకలమీద నుంచొని నాదస్వరం విన్న పాముల్లా మెలికలు తిరిగిపోతున్నాయి. క్షణంతర్వాత వాటి ముఖాలు రెండూ దగ్గరయ్యాయి గాఢంగా ముద్దాడుకుంటున్నట్టు. మిస్టర్ నాపర్ట్ బాగా కిందకి వంగి వాటిని అమితాసక్తితో పరిశీలించాడు. ఏదో అసాధారణ ఘటన జరుగుతోంది. నత్తల తలల కుడివైపు నుంచి ఒక చెవిలాంటిది ఏర్పడుతోంది. అతనికి ఇదేదో లైంగిక సంపర్క చర్యలా ఉందనిపించింది.

ఇంతలో వంటావిడ లోపలికొచ్చి ఏదో అనబోయింది. చెయ్యి ఊపి ఆమెను నిశ్శబ్దంగా ఉండమన్నాడు. ముద్దులొలికే ఆ చిన్నప్రాణుల నుండి ఆయన కళ్ళు తిప్పుకోలేకపోతున్నాడు.

చెవులలాంటి ఆకారాలు ఒకదాన్నొకటి తాకుతున్నాయి ఇప్పుడు. ఒక నత్త చెవిలోంచి ఒక దీర్ఘశ్మశ్రువు (స్పర్శకం) బయటకొచ్చి ఇంకోదాని చెవిలోకి వెళ్ళింది.

మిస్టర్ నాపర్ట్‌కి కలిగిన అభిప్రాయం రెండోదాని చెవిలోంచి కూడా బయటకొచ్చిన స్పర్శకాన్ని చూసి వీగిపోయింది. ఆయన ఇటువంటి అసాధారణ చర్యని ఎప్పుడూ చూసిఉండలేదు. కాసేపటికి ఆ స్పర్శకాలు రెండింటి చెవుల్లో స్థిరంగా నిలిచిపోయాయి. గిన్నెకి బాగా దగ్గరికి వంగాడు నాపర్ట్. వంటావిడ కూడా వంగింది.

"ఇలాంటిదెప్పుడైనా చూశావా? అవేం చేస్తున్నాయంటావ్? " అడిగాడు.

"చూడలేదు. అవి పోట్లాడుకుంటున్నాయనుకుంటా" అని అనాసక్తంగా చెప్పి ఆవిడ వెళ్ళిపోయింది. 'ఇదీ నత్తల గురించి మనుషులకున్న విజ్ఞానం' అనుకుని నిట్టూర్చాడు నాపర్ట్!

దాదాపు ఒక గంటపాటు వాటిని గమనిస్తూనే ఉన్నాడు. కాసేపటికి ముందు

చెవులని, తరువాత స్పర్శకాలని లోపలికి లాక్కొని రెండు నత్తలూ నెమ్మదిగా విడివడ్డాయి. అదే సమయానికి గిన్నెలో ఇంకో జత నత్తలు ఈ ప్రక్రియను మొదలుపెట్టాయి. వంటావిడకు ఆ రోజు నత్తల్ని వండనవసరం లేదని చెప్పి గిన్నె తీసుకుని తన స్టడీరూమ్‌లోకి వెళ్ళిపోయాడు. అప్పట్నుంచీ మిస్టర్ నాపర్ట్‌గారింట్లో నత్తల్నెవరూ వండలేదు.

ఆ రాత్రి ఎన్‌సైక్లోపీడియాలు, తన దగ్గరున్న చిన్నప్పటి సామాన్యశాస్త్ర పుస్తకాలు వెతికాడు. కానీ వాటిలో నత్తల సంతానోత్పత్తి అలవాట్ల గురించి ఎక్కడా లేదు. అసలు తను చూసింది సంయోగమే కాదని అభిప్రాయపడ్డాడు. ఆయన భార్య ఎడ్నా ఆ నత్తల్ని పారెయ్యమని లేదా తినమని చెప్పింది. ఆమె నేలమీదకు పాక్కుంటూ వచ్చిన ఒక నత్తని తొక్కింది అప్పుడే!

మిస్టర్ నాపర్ట్ పారేసేవాడే. అయితే సరిగ్గా అదే సమయంలో చార్లెస్ డార్విన్ రాసిన "ఆరిజిన్ ఆఫ్ స్పీషీస్" పుస్తకంలో గాస్ట్రోపోడా కుటుంబం గురించి ఒక పేజి కనిపించింది. అది ఫ్రెంచిలో ఉంది. నాపర్ట్‌కి ఫ్రెంచి రాదు. కానీ అందులో 'సెన్సువాలిటీ' అనే పదం ఆయన్ను ఆకర్షించింది. ఎలాగైనా అదేంటో కనుక్కోవాలని పబ్లిక్ లైబ్రరీకి వెళ్ళి ఫ్రెంచి-ఆంగ్ల నిఘంటువు సహాయంతో ఆ పేజి మొత్తం అనువదించాడు. ఇంతా చేస్తే దాని తాత్పర్యం ఇదీ : 'నత్తలు సంయోగంలో మరే జంతుజాతుల్లో లేనంతగా సుఖభోగేచ్ఛ ప్రదర్శిస్తాయి' అంతే ఉంది! హెన్రీఫేబర్ పుస్తకాల్లోంచి డార్విన్ తన పుస్తకంలో ఎత్తిరాశాడు. అయితే సగటు పాఠకుడికి అది అవసరం లేదని, జీవశాస్త్ర పండితులకి అర్థమైతే చాలని ఇంగ్లీషులోకి అనువదించకుండా వదిలేశాడు. మిస్టర్ నాపర్ట్ తనను తాను పండితుడిగా భావించుకున్నాడు. ఆయన గుండ్రటి లేతగులాబిరంగు ముఖం ఆత్మగౌరవంతో వెలిగిపోయింది!

తన నత్తలు స్వచ్ఛమైన నీటిలో పెరిగే రకమని, అవి మట్టిలో లేదా ఇసుకలో గుడ్లుపెడతాయని తెలుసుకున్నాడు. ఒక పెద్ద బేసిన్‌లో కొంచెం తడిమట్టి, దాన్లోనే చిన్న సాసర్‌లో నీళ్ళు పోసి నత్తల్ని అందులోకి మార్చాడు. ఏదైనా వింత జరుగుతుందేమోనని ఆసక్తిగా చూశాడు. రెండురోజుల తర్వాత ఒక్కొక్క నత్తని చేత్తో ఎత్తిపట్టుకొని గర్భం ధరించిన ఛాయలేమైనా కనిపిస్తాయేమోనని పరిశీలించాడు. ఒక నత్త మాత్రం మట్టికి అతుక్కుపోయి ఉంది. ఎంత పీకినా రాలేదు. నాపర్ట్ ఆ నత్త చనిపోవటానికి మట్టిలో తలదూర్చింది అనుకున్నాడు.

రెండురోజులు గడిచాయి. మూడోరోజున ఆ నత్త తల ఉంచిన చోటులో మట్టి ఉండలుఉండలుగా పొడిపొడిగా ఉండటం గమనించాడు. అగ్గిపుల్లతో ఆ మట్టిని తొలిచి చూస్తే ఒక గుంటనిండా తడిగా మెరుస్తున్న గుడ్లు కనిపించాయి. నత్త గుడ్లు! అంటే తన అంచనా తప్పు కాదన్నమాట! ఆ గుడ్లు తెల్లటి కేవియర్‌లా ఉన్నాయి. భార్యను, వంటావిడను పిలిచి చూపించాడు. "ఏదో ఒక రకంగా వాటి జాతి వృద్ధి చెందాలిగా!" అంది ఎడ్నా. భార్యకు నత్తలంటే ఎందుకంత అనాసక్తో అనుకున్నాడు నాపర్ట్.

ఇంటిదగ్గరున్నప్పుడు గంటకోసారి తన గదిలోకి వెళ్ళి గుడ్లని చూస్తుండేవాడు. లేవగానే మొదటిపని, పడుకోబోయే ముందు చివరిపని వాటిలో ఏమైనా మార్పు వస్తుందేమోనని గమనించడమే. పైగా ఇప్పుడు ఇంకో నత్త గుంట తవ్వుతోంది. మరో జంట సంయోగంలో ఉంది. మొదట పెట్టిన గుడ్లు క్రమంగా బూడిదరంగులోకి మారుతున్నాయి. వాటిపైన గుల్లలు ఏర్పడబోతున్న సూచనగా

రోజురోజుకూ సన్నటిగీతలు కనిపిస్తు న్నాయి. నాపర్ట్ నిరీక్షణ ఆకాశాన్నంటింది.

ఎదురుచూడగా చూడగా గుడ్లు పెట్టిన నాటినుంచి పద్దెనిమిదవ రోజున చిన్న నత్తపిల్ల తల కదల్చటం కనిపెట్టాడు. మొద్దుగా, పొట్టిగా ఉన్న దాని స్పర్శశృం గాలు అటూ ఇటూ కదులుతూ పరిస రాల్ని పసిగడుతున్నాయి. మిస్టర్ నాపర్ట్ కొత్తగా తండ్రైనట్టు మురిసిపోయాడు. ఆశ్చర్యకరంగా గుంటలో డెబ్భైకి పైగా ఉన్న గుడ్లన్నీ ప్రాణం పోసుకున్నాయి. దీనికాయన అమితంగా గర్వపడ్డాడు. నత్తల ప్రత్యుత్పత్తి ప్రక్రియ మొత్తం విజ యవంతంగా సమాప్తి అవడం చూశాడు. అంతేగాక ఎవరికీ- కనీసం తనకి పరిచయ మున్న ఎవరికీ- నత్తల గురించి తనకు తెలిసిన దాంట్లో ఆవగింజంతైనా తెలీదు. ఓ కొత్త విషయాన్ని కనిపెట్టాడన్న సంగతి ఒళ్ళంతా పులకరింపజేస్తోంది. రసజ్ఞులైన కొందరికి మాత్రమే అవగతమయ్యే విష యదాహం, సరస కుతూహలం అది.

మిస్టర్ నాపర్ట్ తరువాత జరిగిన క్రమా గత సంయోగాలు, గుడ్లు పొదిగిన వివ రాలు ఒక పుస్తకంలో రాసుకున్నాడు. నత్తల జీవితచక్రం గురించి ఇంటికొచ్చిన అతిథులకి, స్నేహితులకి చెప్పి వారిని అదరగొడుతుండేవాడు. ఎడ్నా ఇబ్బందిగా చూసేది.

"పీటర్, ఇది ఆగదా? ఈ ప్రత్యుత్పత్తి ప్రక్రియ ఇలానే కొనసాగితే అవి ఇల్లంతా ఆక్రమించుకుంటాయేమో" అంది ఎడ్నా ఒక పదిహేను ఇరవై గుంటల్లోని గుడ్లు పిల్లలయాక.

"ప్రకృతిని మనం ఆపలేం కదా...." అన్నాడు మిస్టర్ నాపర్ట్ ప్రసన్నంగా. "...స్టడీరూమ్ మొత్తం వాటికే. అక్కడ చాలా ఖాళీ ఉందిలే"

అలా మరిన్ని గాజుతొట్టెలూ, గిన్నెలూ ఆ గదిలోకి చేరాయి. మిస్టర్ నాపర్ట్ మార్కెట్‌కి వెళ్ళి చురుగ్గా, ఆరోగ్యంగా కని పిస్తున్న నత్తల్ని కొనుక్కొచ్చాడు. మిగతా ప్రపంచం పట్టించుకోని ఒక జంట ముద్దు

లాడుకుంటుంటే దాన్నీ కొన్నాడు. తొట్టెల్లో వేసిన మట్టిలో గుడ్లు కుప్పలుతెప్పలుగా పోగయ్యాయి. ఒక్కోదాన్లోంచి మంచుము త్యాల్లా పారదర్శకంగా ఉన్న డెబ్బై-తొంభై పిల్లనత్తలు పాక్కుంటూ బయటికొచ్చేవి. నాపర్ట్ తొట్లలో లెట్యూస్ ఆకుల్ని నిచ్చెన లాగా నిలువుగా ఉంచేవాడు. పిల్లనత్తలు ఆ ఆకుల మీద పాకుతూ వాటినే తింటూ తొట్టెల పైకి చేరుకునేవి. సంయోగాలు ఎంత తరచుగా జరగటం మొదలైందంటే ఆయన ఇక వాటిని గురించి పట్టించుకో వడం మానేశాడు. కానీ గుడ్లు పొదిగాక నత్తపిల్లలు చిన్నచిన్న మీసాలు ఊపుతూ తొలి అడుగులు వేయడం ఎన్నిసార్లు చూసినా నాపర్ట్‌కి తనివి తీరేదికాదు.

బ్రోకరేజ్ ఆఫీసులోని సహోద్యోగులు పీటర్‌లో జీవితం పట్ల ఒక నూతనో

అనువాదం :
**హారిక**

త్సాహం గమనించారు. ఆయన తన అంచనాల్లో, ప్రయత్నాల్లో మరింత ధైర్యంగా ముందడుగు వేస్తున్నాడిప్పుడు. లెక్కల్లో బాగా చురుకయ్యాడు. తను అమ లుపరిచే ప్రణాళికలు, పథకాల్లో కొంచెం మొండిగా కూడా తయారయ్యాడు. కంపె నీకి డబ్బు సంపాదించి పెడుతున్నాడు. అందరి ఏకగ్రీవ నిర్ణయంతో ఆయన జీతం సంవత్సరానికి నలభై నుంచి అరవై వేల డాలర్లు చేశారు. తను సాధించినదా నికి ఎవరైనా శుభాకాంక్షలు తెలిపితే ఆ గొప్పతనమంతా తన నత్తలదేనని చెప్పే వాడు. వాటిని గమనిస్తూ లాభకారి మనో వినోదాన్ని పొందేవాడు మిస్టర్ నాపర్ట్.

తన సాయంకాలాలన్నీ స్టడీరూమ్‌లోనే గడిపేవాడు. అదిప్పుడు పెద్ద అక్వేరి యంలా తయారైంది. తొట్టెల్లో తాజా లెట్యూస్ ఆకులు, ఉడికించిన బంగాళ దుంప, బీట్‌రూట్ ముక్కలు వేయడం, ఆ తరువాత తను ఏర్పాటు చేసిన గొట్టా ల్లోంచి నీరు వానలా చిలకరించే అమరి కను ఆన్ చేసి ఆ జల్లుల్లో తడిసే నత్తల్ని చూడటం- ఇవన్నీ ఆయన దినచర్యలో తప్పనిసరి కార్యక్రమాలు. చినుకులు పడ గానే అప్పటిదాకా స్తబ్దుగా ఉన్న నత్తలు కరెంటుషాక్ కొట్టినట్టు ఒక్కసారే వేగంగా కదిలి తినడం, ముద్దుముచ్చట్లు మొదలె ట్టడం, నీటిలో ఈదటం లాంటి పనులు చే సేవి. అది చూసి పరవశించిపోయేవాడు.

కొన్నిసార్లు మిస్టర్ నాపర్ట్ తన చూపు డువేలి మీదకి నత్తని పాకనిచ్చేవాడు. నత్త లకి ఇలా మానవస్పర్శ అంటే ఇష్టమని తనే భావించేవాడు. వేలిమీదకొచ్చిన నత్తకి లెట్యూస్ ఆకుల్ని స్వయంగా తినిపించేవా డు. అన్ని వైపులనుంచి ఆ నత్తని పరిశీల నగా చూసేవాడు. కళారాధకులు జపనీస్ చిత్రపటాన్ని చూసినప్పుడు ఎంత తన్మ యులౌతారో తన వేలి మీద నత్తని చూసి ఆయన అంత తన్మయుడయ్యేవాడు.

ఇక నాపర్ట్ తన స్టడీరూమ్‌లోకి ఎవరినీ అనుమతించడంలేదు. నేలమీద పాకే అల వాటు చాలా నత్తలకుంది. కుర్చీల్లో, అరల్లో పుస్తకాల అట్టలకి అంటుకుపోయి నిద్రపోయే అలవాటు కూడా ఉంది. ఎక్కువ సమయం ముసలివి నిద్రలోనే గడిపేవి. కానీ కొన్ని సోమరిపోతులు, నిద్రపోవటానికి ఒళ్ళొంగని నత్తలు సంయోగాలు ఇష్టపడేవి. మిస్టర్ నాపర్ట్ అంచనా ప్రకారం ఏ సమయంలోనైనా కనీసం ఒక డజను నత్తలు చుంబించుకుం టుండేవి. అనేకానేక పసినత్తలు, లెక్కపెట్ట లేనన్ని పిల్లలూ ఉండేవి. మిస్టర్ నాపర్ట్ అరల్లో నిద్రపోతున్నవాటినీ, పైకప్పు మీద పాకుతున్న ఒంటరి నత్తల్నీ లెక్కగట్టాడు. అవో పదకొండు పన్నెండు వందలుం టాయ్. తొట్టెలు, గిన్నెలు, తన రాతబల్ల

అడుగున, చెక్క కిందివైపున కలిపి ఈ సంఖ్యకి యాభైరెట్లుంటాయి. నాపర్ట్ పైకప్పు నుంచి తొందర్లోనే నత్తల్ని గీరేద్దామనుకున్నాడు. కొన్ని చాలా రోజుల్నుంచి అక్కడే అతుక్కుపోయి పోషకాహారం తీసుకోవడంలేదు. ఆఫీసులో పని పెరగడం వల్ల తనూ ఈమధ్య బిజీ అయిపోయాడు. తన గదిలో తనకు అత్యంత ప్రీతి పాత్రమైన కుర్చీలో సాయంకాలాలు మన శ్శాంతిగా కూర్చోవాలని ఆయన ఆశ. ఖాళీ సమయమే దొరకట్లేదిప్పుడు.

జూన్‌నెలలో అస్సలు తీరిక చిక్కనంత పనిలో పడిపోయాడు. ఆఫీసులో రాత్రి వరకూ పని చేసేవాడు. ఆర్థిక సంవత్సరం ముగియవస్తోంది. రిపోర్టులు పేరుకుంటున్నాయి. వాటిని కూలంకషంగా చదివి లాభార్జన కోసం కనీసం ఒక అరడజను మార్గాలు వెతికి పట్టుకున్నాడు. తెగువతో చెయ్యాల్సినవన్నీ తనకోసం అట్టేపెట్టుకున్నాడు. వచ్చే జూన్‌కి తన ఆదాయం నాలుగురెట్లవుతుంది. తన బ్యాంకు అకౌంటులో ధనం నత్తల సంఖ్య పెరిగినంత తేలిగ్గా, వేగంగా పెరుగుతోంది. భార్యకీ విషయం చెప్పాడు. ఆమె పరమానందంతో నత్తలు పాడుపెడుతున్న స్టడీరూమునీ, పై అంతస్తంతా వ్యాపిస్తున్న దుర్గంధాన్నీ క్షమించేసింది!

"పీటర్, ఒకసారి గది తెరిచి లోపల పరిస్థితి ఎలా ఉందో చూడరాదూ? ఏదైనా తొట్టె ఒలికిపోయిందేమో. తివాచీ పాడైపోతే ఎలా? నువ్వు వారం నుంచి ఆ గదిలోకి అడుగుపెట్టలేదనుకుంటా!" అంది ఎడ్నా ఓరోజు.

నిజానికి నాపర్ట్ స్టడీరూమ్‌లోకి అడుగుపెట్టి రెండువారాలైంది. తివాచీ ఎప్పుడో పాడైపోయిందని భార్యకు చెప్పటానికి నోరు రాలేదు. "ఇవాళ చూస్తాలే" అని ఊరుకున్నాడు. మరో మూడురోజులకి గానీ అటు వెళ్ళడం కుదర్లేదు.

ఆరోజు నిద్రపోయేముందు ఒకసారి నత్తలగదిని (ఇప్పుడది తన స్టడీరూమ్ కాదు) చూసొద్దామని వెళ్ళాడు. నేలమీద మూడునాలుగు పొరలుగా ఉన్నాయి నత్తలు. వాటిని చితకనివ్వకుండా తలుపు వేయడానికి ఆయన చాలా కష్టపడవలసి వచ్చింది. చుట్టూ అమితాశ్చర్యంతో చూసి మెటికలు విరిచాడు. గది నాలుగుమూలల్లో కుప్పలుకుప్పలుగా పైకప్పు దాకా వ్యాపించిన నత్తగుల్లలు దాన్ని వృత్తాకార గదిలా మార్చేశాయి. తనో బూడిదరంగు గోళాకార రాతిగర్భంలోకి ప్రవేశించిన అనుభూతి కలిగిందాయనకి. అవి ప్రతి ఉపరితలాన్నీ ఆక్రమించాయి. వేనవేల నత్తలు గది మధ్యలో వేలాడుతున్న షాండ్లియర్ మీద అసహ్యంగా అతుక్కొని ఉన్నాయి. వాటి బరువుకి అది నెమ్మదిగా ఊగుతోంది. ఆ వికారపు ఊపు చూసి నాపర్ట్‌కి తలతిరిగినట్టైంది. నిలదొక్కుకోవటానికి అక్కడే ఉన్న కుర్చీవీపును పట్టుకున్నాడు. చేతికి పెంకులు తగిలాయి. కుర్చీసీటులో కూడా దిండులా నత్తలు పేరుకుని ఉన్నాయి. తన కుర్చీ- తన సీటు-ఇప్పుడు తనవేనా? కొంచెం విరక్తిగా నవ్వుకున్నాడు.

పైకప్పుకంటుకున్న వాటి గురించి ఏదైనా చెయ్యాలి! మూలనున్న గొడుగు తీసుకొని దాని మీదున్న నత్తల్ని చేత్తో కిందకి దులిపాడు. తర్వాత దాంతో కప్పుని గీరాడు. గొడుగు ముక్కు పదునుగా ఉండి కప్పుకు అంటించిన వాల్‌పేపర్ చిరిగింది. దానికతుక్కున్న నత్తల బరువు వల్ల అది నేలబారుగా వేలాడింది. ఒక్కసారిగా మిస్టర్ నాపర్ట్‌కి విసుగూ, కోపమూ కలిగాయి. నీటిపిచికారీ వల్ల ఏమైనా ఫలితం ఉంటుందేమోనని మీట లాగాడు.

పిచికారీ వ్యవస్థ అన్ని తొట్లలో ఉవ్వెత్తున నీటిని విరజిమ్మింది. అప్పటిదాకా చలనం లేని ఆ గది మొత్తం బిరబిర కద

లడం మొదలైంది. నేలమీద జారకుండా జాగ్రత్తగా అడుగులు వేయసాగాడు. కాళ్ళ కింద నత్తగుల్లలు కొన్ని దొర్లిపోతున్నాయి, కొన్ని సముద్రతీరంలో గవ్వల్లాగా చప్పుడు చేస్తూ పగిలిపోతున్నాయి. లాభంలేదని రెండు నీటిగొట్టాలని కప్పువైపుకి తిప్పాడు. ఇది తప్పని వెంటనే తెలిసింది. వాల్ పేపర్ మెత్తబడి ఊడిపోయింది. ఒక చీరిక ఊడి నత్తలతో సహా మిస్టర్ నాపర్ట్ చెవి మీద బలంగా తగిలింది. ఆ దెబ్బ ధాటికి మైకం కమ్మినట్టై ఒక మోకాలు నేలకాన్చి కూలబడిపోయాడు విభ్రాంతిగా. ఊపిరి బిగదీసినట్టైంది. ఒకక్షణం అసలు తను లేవలేననుకున్నాడు. ఊపిరి తిప్పుకోనీయని ముక్కవాసన గదంతా వ్యాపించి తన ఊపిరితిత్తుల్లో కూడా నిండిపోతోంది. ఏ దిక్కు చూసినా పొడవైన వాల్ పేపర్ పట్టీలు వేలాడుతున్నాయి జైలు ఊచల్లాగా. కాసేపటికి తేరుకొని కిటికీ తెరిస్తే గాలైనా వీస్తుందని కిటికీ దగ్గరకు వెళ్ళాడు. అది తెరవటం అసాధ్యమని అర్థమైంది. కిటికీ గట్లమీద, తలుపుల మీద నత్తలు దట్టంగా పేరుకుపోయాయి. బూట్లమీదకి, ప్యాంటుమీదకి నత్తలు ఎగబాకుతున్నాయి. చిరాగ్గా కాళ్ళను విదిలించాడు. నౌకర్లని సహాయానికి పిలుద్దామని తలుపు వైపు అడుగేశాడో లేదో షాండ్లియర్ ఊడి నెత్తిన పడింది. బరువుగా నేలమీద చతికిలపడిపోయాడు.

"ఎడ్నా" అని అరిచాడు. గొంతేంటి ఇలా అయిపోయింది? గది సౌండ్‌ప్రూఫా...?

దేక్కుంటూ తలుపుదాకా వెళ్ళాడు. తన కాళ్ళుచేతులకింద ఎన్నో నత్తలు చితికిపోతున్నా పట్టించుకోకుండా శరీరాన్ని ఈడ్చాడు. తలుపుసందుల్లో కూడా నత్తలు వ్యాపించి తలుపుని శబ్దం, వెలుతురు ప్రసరించలేని విధంగా కప్పేశాయి.

"ఎడ్నా..."

ఒక నత్త నోట్లోకి పాకింది. మిస్టర్ నాపర్ట్ జుగుప్సతో దాన్ని ఉమ్మేశాడు. తన చేతులమీదకు పాకుతున్న నత్తల్ని విదిల్చి కొట్టాడు. వంద కింద రాలిపోతే నాలుగు వందలు ఒంటికతుక్కుంటున్నాయి. ఆ గది మొత్తంలో నత్తలు లేని చోటు తన ఒళ్ళేనని, అందుకే అవి వేగంగా తన మీదకు ఎగబాకుతున్నాయని గ్రహించాడు. కళ్ళమీదకు కూడా వచ్చేశాయి కొన్ని. ఎలాగో కష్టపడి కాళ్ళమీద నుంచున్నాడు. ఏదో కొట్టుకుంది. అదేంటో కూడా చూడలేకుండా రెప్పలమీద నత్తలు! మూర్ఛపోతున్నాడా? అది కూడా తెలీడం లేదు. నేల మీద పడిపోయాడు. ముక్కు, కళ్ళ మీద అంటుకున్న ఆ హంతక నత్తల్ని దులుపుకుందామంటే చేతులు టన్నుల బరువున్నట్టు అనిపించింది.

"రక్షించండి"

ఒక నత్తని మింగాడు. కొరపోయి నోరు పెద్దగా తెరిచి దగ్గాడు. ఒక నత్త నెమ్మదిగా పెదవుల మీదనుంచి నాలుక మీదకు పాకింది. మిస్టర్ నాపర్ట్ నరకంలో ఉన్నాడు! తన కాళ్ళమీద ఒక బంకనదిలాగా నత్తలు పాకటం తెలుస్తోంది. కాళ్ళని నేల మీదకు నొక్కేసి బంధించినట్టు గిలగిలలాడుతున్నాడు. కళ్ళముందు ఊగులాడే నల్లటి తెర వేలాడదీసినట్టు దృష్టి సన్నగిల్లుతోంది. ఊపిరి చాలా బలహీనంగా వస్తోంది. ముక్కు రంధ్రాలు మూసుకుపోయి అసలు గాలి పీల్చలేకపోతున్నాడు.

ఎందుకంటే ముక్కుని కప్పిన నత్తల్ని దులుపుకోవటానికి చేతులు కదల్చలేకపోతున్నాడు! అతికష్టమ్మీద కుడికన్ను కొద్దిగా తెరిచి తనకు అంగుళాల దూరంలో ఎదురుగా కుండీలో ఉన్న రబ్బరు మొక్కని చూశాడు. దాని మొదట్లో ఒక నత్తలజంట సంయోగానికి సిద్ధమవుతోంది. వాటి పక్కనే చిన్నచిన్న నత్తపిల్లలు అంతులేని తెల్లటి సైన్యంలా తనవైపుకే కదులుతున్నాయి. V

తెలుగు కథ

- మునిపల్లె లక్ష్మీరమణ కుమారి



# సారిక

కళ్యాణమంటపం కళకళలాడిపోతోంది. పూల ఘుమఘుమలూ, లైట్ల తళతళలూ కలగలసిన ఆ పెళ్ళిపందిట్లో అన్నీ ఆనందపు చిహ్నాలే. పెళ్ళికొడుకూ, పెళ్ళికూతురూ అయితే చెప్పనే అక్కర్లేదు. ఒకరి కోసం ఒకరు పుట్టినట్లు చూడముచ్చటగా ఉండటమే కాదు, ఆనందంగా, ఉత్సాహంగా పెళ్లితంతులో పాల్గొంటున్నారు.

వంటలు అందర్నీ నోరూరిస్తున్నాయి. గోంగూర, ఆవకాయ, కందిపొడి, వడి

యాలు, అప్పడాల్లాంటి తెలుగు వంటలతో పాటు చాట్, పంజాబీ చోళే, పానీపూరీ, బిర్యానీ, మసాలా కూరలు, స్వీట్లు, కేకులు, ఐస్‌క్రీమ్‌లు.. ఇలా ఒకటేమిటి, ఉత్తరాది, దక్షిణాది, హైదరాబాదీ వంటకాలన్నీ ఉన్నాయి. అంతా ముగిశాక అతిథులు కోరినవిధంగా పాన్‌లు చుట్టి ఇస్తున్నారు. అందరూ హాయిగా తిని, తృప్తిగా కబుర్లు చెప్పుకుంటున్నారు.

పెళ్ళిపందిరి అంతా ఉత్సాహం, ఉల్లాసం, ఆనందం. అందరూ చాలా సంతోషంగా ఉన్నారు, ఒక్క పెళ్లికూతురు తల్లి అనసూయ తప్ప.

పెళ్లికూతురు తండ్రి కుమారస్వామి ఆవిడ్ని గమనిస్తూనే ఉన్నాడు. అనసూయ పెళ్లికూతురుతో సమంగా ఆకుపచ్చ జరీ గళ్ళ పట్టుచీర కొనుక్కుంది. కూతురితో పాటు నెలరోజులుగా బ్యూటీపార్లర్ చుట్టూ ప్రదక్షిణలు చేసి, అందానికి మెరుగులు దిద్దించుకుంది. ఈరోజు బ్యూటీ పార్లర్ నుంచి వచ్చినవాళ్లు ఆమెకి కూడా మేకప్ చేసి వెళ్లారు. వీటన్నిటివల్లా కుర్రగా లేకపోయినా ఎర్రగా మెరిసిపోతోంది.

మొహం నిండా దిగులు నింపుకుని ఎవరితోనో ఏదో మాట్లాడుతోంది. కుమారస్వామి గుండె గుభేలుమంది. ఏం మాట్లాడుతోందో? ఆమె హావభావాలు చూసి తెలుసుకోగలిగాడు. అయినా కన్‌ఫర్మ్ చేసుకుందామని దగ్గరగా వెళ్ళాడు. ఆమె మాటలు విన్నాడు. అతని కాళ్ళూ, చేతులూ వణికాయి. అతికష్టంమీద తనను తాను సంబాళించుకున్నాడు. అతనికి తన పెళ్ళినాటినుంచీ జరిగిన సంగతులన్నీ ఒక్కొక్కటీ జ్ఞాపకం వచ్చాయి.

★ ★ ★

కుమారస్వామికీ అనసూయకీ పెళ్ళి జరిగింది. దేనికీ తృప్తి చెందని మనిషి ఎవరన్నా ఉన్నారంటే అది అనసూయే. కుమారస్వామిది మృదుస్వభావం. ఎదుటి వాళ్ళని నొప్పించకూడదనే తత్వం. ఏ విషయంలోనైనా రాజీపడిపోతాడు. సర్దుకుపోయే మనస్తత్వం.

పెళ్ళిలోనే అనసూయ తన స్వభావాన్ని బయటపెట్టేసింది. పూలజడకీ, గాజులకీ, చేసిన ముస్తాబుకీ, చీరెలకీ, అన్నిటికీ వంకలు పెట్టి సణుగుతూనే ఉంది.

మొదటిరోజే తన అసంతృప్తిని బయటపెట్టేసింది.

"నాకసలు ఢిల్లీ సంబంధం బాగా నచ్చింది. కానీ, కట్నం దగ్గర తేడా వచ్చింది" అంటూ ఢిల్లీ సంబంధం అబ్బాయి అందచందాలూ, ఆస్తిపాస్తులూ పొగిడింది.

"ఆయనైతే బాగుండేది" అనేసింది.

ఆడవాళ్ళు ఇట్లా కూడా మాట్లాడగలరని తెలియని కుమారస్వామి నిరుత్తరుడయ్యాడు. అప్రతిభుడై ఆమె వంక అట్లాగే చూస్తూ ఉండిపోయాడు.

భర్త ఫీలింగ్స్‌ని ఏమాత్రం పట్టించుకోని అనసూయ మామూలుగానే మాట్లాడుతూ ఉంది. కుమారస్వామికి మాత్రం తిరిగి మామూలుగా అవటానికి సమయం పట్టింది.

ఆ తర్వాత అనసూయ చాలాసార్లు అదే బాణం విసురుతూ వచ్చింది. ఆ బాణం దెబ్బకి అతని మనస్సు ముక్కలైంది. అయినా అనసూయ వదల్లేదు. ఆ బాణం విసురుతూనే ఉంది.

అసలు ఏ విషయంలోనూ, ఆఖరికి తిన్న కూరలో కూడా సంతృప్తి కనబడదు ఆమెలో. వంకాయ తింటే, బెండకాయ కూర తినలేదని బాధపడుతుంది. అన్నీ ఉన్నా ఆమె మొహంలో సంతృప్తిని గానీ, సంతోషాన్నిగానీ కుమారస్వామి ఏనాడూ చూడలేదు.

"నీకేమే అనసూయా.. మీ ఆయనకి మంచి ఉద్యోగం, ఇల్లూ, అన్నీ ఉన్నాయి"

అని ఎవరన్నా పొగిడితే... "సర్లే, హు" అని మూతి తిప్పుతుంది అనసూయ. రోజుకొకసారన్నా ఢిల్లీ ఆయనతో పోల్చి కుమారస్వామి మనసుని ముక్కలు చేస్తూనే ఉంటుంది.

అట్లాగే కాలం సాగిపోతోంది. రమ్య పుట్టింది, రమ్య పెరిగి, పెద్దదైంది. పెళ్ళి సంబంధాలు వెతికారు.

వాటిల్లో ఒక సంబంధం వసుంధర కొడుకు సంబంధం. వసుంధర అనసూయ దూరపు బంధువుకి దూరపు చుట్టం. రమ్యని వసుంధర కొడుకు సంజీవ్‌కి ఇవ్వాలని సంప్రదించారు. అనసూయకి సంజీవ్ తెగ నచ్చేశాడు. కానీ ఆరడుగుల ఎత్తు ఉన్న సంజీవ్‌కి కనీసం అయిదడు గుల ఆరంగుళాల ఎత్తు ఉన్న అమ్మాయే కావాలని వసుంధర నిర్ణయం. రమ్య ఎత్తు అయిదడుగుల నాలుగు అంగుళాలు, వెంట్రుక వాసిలోనే ఎన్నో ప్రమాదాలు జరుగుతాయి. అట్లాగే ఆ రెండంగుళాల ఎత్తు లోపం వల్ల వసుంధర సంబంధం కుదరలేదు. ఆ సంబంధం కుదరదు అన గానే, అనసూయకి దానిమీద అమాంతం మోజు పెరిగిపోయింది. వసుంధరకి రకర కాల ఆఫర్లు ఇచ్చింది. కోరిన దానికన్నా ఎక్కువ కట్నం, అత్తగారికి వడ్డాణం, అబ్బా యికి సరికొత్త మోడల్ కారు, ఇట్లా ఎన్ని చెప్పినా వసుంధర మంకు పట్టు వదల లేదు.

"ఎన్నయినా ఇస్తారు.. లేకపోతే సంపా దించుకుంటాం. కానీ ఎత్తు సంపాదించగ లమా? " అన్న చిన్న డైలాగ్‌తో ఆఫర్లన్నిం టినీ కొట్టిపారేసింది. చివరికి చేసేది లేక అనసూయ ఆ సంబంధం మీద ఆశ వదు లుకుని, వేరే సంబంధాలు చూడటం మొదలు పెట్టింది. చివరకు రమ్య పెళ్ళి కుదిరింది.

పెళ్ళికొడుకు వినీల్ సాఫ్ట్‌వేర్ ఇంజ నీరు. హైదరాబాద్‌లో ఇల్లు, కారు, అందం-చందం, అన్నీ ఉన్నాయి. ముఖ్యంగా రమ్యకి చాలా బాగా నచ్చాడు. అయినా సరే అనసూయకి మాత్రం వసుంధర కొడుకుని తన అల్లుడిగా చేసు కోలేకపోయాననే అన్న బాధ పోలేదు. స్నేహితులతో, బంధువులతో చెప్పుకుని బాధ పడుతూనే ఉంది.

ఇప్పుడు ఒక పక్క రమ్య పెళ్ళి జరుగు తుంటే "అసలు వసుంధర కొడుక్కి ఇద్దా మనుకున్నాం. ఆ అబ్బాయైతే చాలా బాగుండేది" అని చెబుతోంది.

కుమారస్వామికి కడుపు మండిపో

యింది. పెళ్ళి అయిపోతుంటే ఇప్పుడు కూడా అదేమాటా? పెళ్ళి కొడుకు మేన మామ, చెల్లెలూ, ఇంకా కొందరు చుట్టాలూ అటే తిరుగుతున్నారు. అయినా అనసూయ నోటికొచ్చినట్లుగా మాట్లాడు తూనే ఉంది.

"ఇట్లారా ఒకసారి" అని అనసూయను పిలిచాడు కుమారస్వామి.

"ఏంటి? "

"నువ్వు మాట్లాడుతున్నదేమైనా బాగుం దా? ఒక పక్క పెళ్ళి జరిగిపోతున్నా అట్లాగే మాట్లాడుతున్నావు. వసుంధర కొడుకైతే ఇంకా బాగుండేదని అంటావా? పెళ్ళికొడుకు వాళ్ళు వింటే? " కుమార స్వామి మందలించాడు.

"మీది మరీ వింత? వింటే ఏం అవు తుంది? పోలిక పెట్టుకుంటే తప్పా? అసలు ఆ ఢిల్లీ ఆయనైతే ఇట్లా మాట్లాడే వాడా? ఆయనైతే ఎంత బాగుండేది? ఇంత పిరికి మనిషితో బతకాలని నాకు రాసుంది. ఖర్మ" అంది అనసూయ.

"ఖర్మ" అంటూ నెత్తి బాదుకున్నాడు కుమారస్వామి. పెళ్ళికొడుకు వాళ్ళు వినక పోతే చాలని వెయ్యి దేవుళ్ళకి మొక్కుతు న్నాడు.

కానీ ఏ దేవుడూ అతని మొర వినలేదు.

పెళ్ళయిన మర్నాడే రమ్య, వినీల్ హనీ మూన్‌కి సింగపూర్ వెళ్ళారు. వారం అయ్యాక తిరిగి వచ్చారు.

రమ్య నేరుగా అత్తగారింటికే వెళ్ళింది. రమ్య భర్త పెళ్ళికి ముందే ఒక డీలక్స్ అపార్ట్‌మెంట్ కొనేశాడు. కారు ఉంది. ఇల్లు సర్దుకోవటంలో రమ్యకి సాయం చేస్తామని, రమ్య అత్తగారూ, ఆడపడుచూ కూడా అక్కడే ఉన్నారు.

అంతా బాగుంది అనుకుంటుండగా రమ్య ఒక రోజు సూట్‌కేస్ తీసుకుని పుట్టింటికి వచ్చేసింది. ఆమె మొహం వాడి పోయి ఉంది.

"వినీల్ ఏడీ? " అన్న ప్రశ్నకు రమ్య జవాబు చెప్పలేదు. ఎటో చూస్తోంది. కాస్సేపయాక అడుగుదాం అని ఊరుకు న్నారు ఆమె తల్లిదండ్రులు.

రమ్య స్నానం చేసి రిలాక్స్ అయింది. కానీ మొహంలో దిగులు స్పష్టంగా కనిపి స్తోంది.

"ఏంటి ఒక్కదానివే వచ్చావు? అదీ సూట్‌కేస్‌తో... ఎన్నిరోజులుంటావు? " అడిగింది అనసూయ.

"ఇక శాశ్వతంగా ఇక్కడే ఉందామని.." చెప్పింది రమ్య. వింటున్న తల్లిదం డ్రులిద్దరికీ పక్కన బాంబు పడినట్ల య్యింది.

"అవేం మాటలే? అసలేం జరిగింది? " అని తండ్రి గట్టిగా అడిగాక అప్పుడు రమ్య చెప్పటం మొదలుపెట్టింది.

పెళ్ళిలో అనసూయ అన్నమాటలు రమ్య ఆడపడుచు నీలిమా, అత్తగారు విమలా విన్నారు.

"ఆ వసుంధర కొడుక్కే చేసుకోక మీ అమ్మ నిన్ను మాకెందు కంటగట్టింది? ఒకడికి ఇచ్చి పెళ్ళిచేస్తూ కూడా వాడెవడికో ఇస్తే బాగుండేదని అంటుందా.. దానిక సలు పెళ్ళి విలువ తెలుసా? ఏమనుకుం టోంది? నీకూ అవే బుద్ధులూ, అదే ఏడుపూ వచ్చి ఉంటాయి. జీవితాంతం ఆ సంజీవ్‌ని చేసుకోలేకపోయానే అని ఏడు స్తుంటావు. మీ అమ్మ అదే పెళ్ళి పందిట్లో మీ నాన్నతోనే ఏకంగా 'నేను ఆ ఢిల్లీ ఆయన్ని చేసుకుంటే బాగుండేది' అన్న దట. పెళ్ళై ఇన్నాళ్ళైనా ఆ ఢిల్లీ వాడ్ని మర్చిపోలేదన్న మాట. నువ్వూ అంతే అయి ఉంటావు" అని రోజూ సాధింపులూ, తిట్లూ. ఇదిగో ఈ రోజు తిట్టి, తిట్టి ఇంట్లోంచి వెళ్ళగొట్టారు.

కూతురు చెప్పింది విని కుమారస్వామీ, అనసూయా నిర్ఘాంతపోయి నిలబడ్డారు. అనసూయకి తన మాటలకి ఇంత గొడవ



అవుతుందని తెలీదు. తనన్న మాటల వల్ల కూతురి కాపురం కూలిపోతుందని ఎన్నడూ ఊహించలేదు కూడా.. అందుకే తలెత్తుకోలేక నేలవైపు చూస్తు నిలబడిపో యింది.

"నేనేదో అన్నానని ఇట్లా చేస్తారా? ఒక సారి పిల్చి మాట్లాడితే ఎలాఉంటుంది? " ఎట్లాగో నోరు పెగల్చుకుని అంది అన సూయ.

"వద్దు" అంది రమ్య భయంగా..

"మాట్లాడక పోతే ఎలా? ఉండు నేను మాట్లాడతాను" అంటూ అనసూయ వెళ్ళి ఫోన్ చేసింది.

కాసేపట్లో వినీల్ వాళ్ళముందు ప్రత్యక్ష మయ్యాడు. అతని మొహం కరుగ్గా ఉంది.

కాస్సేపు కాఫీ, మంచి నీళ్ళు అందిస్తూ కాలం గడిచింది.

"బాబూ, అమ్మాయి విషయం చెప్పింది. నా మాటలు పట్టించుకోకు. మా కాలం అయిపోయింది. రమ్యని పంపెయ్యటం మాత్రం భావ్యం కాదు. అది చాలా మంచి పిల్ల. నిన్ను ఎంతో ఇష్టంతో చేసుకుంది" బతిమాలింది అనసూయ.

అనసూయ స్వభావం తెలిసిన వారె వరూ ఆమె అంత అనునయంగా మాట్లా డగలదని అనుకోరు. 'అవసరం అన్నీ నేర్పి స్తుంది కాబోలు' అనుకుని నిట్టూర్చాడు కుమారస్వామి.

"మీ మాటలే అయితే నేను పట్టించు కునే వాడినే కాదు. కానీ రమ్య కూడా అదే అంది" కోపంగా అన్నాడు వినీల్.

"ఏమన్నావే? " అడిగింది అనసూయ.

"వాళ్ళు సాధిస్తుంటే ఉండబట్టలేక అవును, సంజీవ్ అయితే బాగుండేదని అన్నాను" అంటూ రమ్య కళ్ళు తుడుచు కుంది.

"అయ్యో! ఆ మాట ఎందుకన్నావే?

సరేలే బాబూ.. పొరపాటున అంది. మేం మంచీ చెడ్డా నేర్పుతాం. విడాకుల సంగతి మర్చిపో!" అంటూ మళ్ళీ బతిమాలింది అనసూయ.

"మంచీ, చెడ్డా హుc..!" అన్నాడు వినీల్ కోపంగా.

"అదేంటి బాబూ? " బిత్తరపోయింది అనసూయ.

"మంచీ చెడ్డా మీకు తెలిస్తే కదా రమ్యకి నేర్పడానికి? మీరే ఆయనకి వంకలు పెడుతూ, ఇంకెవర్నో చేసుకుని ఉంటే బాగుండేదని బాధపడుతూకూర్చున్నారు. ఇంక మీ కూతురికేం నేర్పుతారు? " అనేశాడు వినీల్.

అనసూయకి తల కొట్టేసినట్లయింది. చెళ్ళున చెంపమీద చరిచినట్లయింది. "బాబూ, నాది తప్పే! కూతురికి అనుభవం అయ్యాకగానీ అది తప్పని తెలియలేదు. సరే, ఇప్పుడు తెలుసుకున్నాను. చెంపలు వేసుకుంటున్నాను. అట్లా మాట్లాడవద్దని రమ్యకి చెపుతాను. సరేనా" అనునయంగా అంది అనసూయ.

"అంటే ఇంకెప్పుడూ మామగార్ని ఢిల్లీ ఆయనతో పోల్చరుగా? " అడిగాడు వినీల్.

"పోల్చను గాక పోల్చను" అంటూ అనసూయ చెంపలు వేసుకుంది.

"నిజంగానా మమ్మీ" రమ్య అనసూయ చేతులు పట్టుకుని ఆనందంగాఅడిగింది.

"నిజంగా, సత్యంగా.." అంది అనసూయ.

అనసూయ మాటలు విని వినీల్ చప్పట్లు కొట్టాడు.

"మమ్మీ, నీకు బుద్ధి రావాలనే ఈ డ్రామా" అంది రమ్య.

"ఆ, డ్రామానా? " కుమారస్వామి నోరు తెరిచాడు.

"అవును మామయ్యా, రోజూ ఢిల్లీ ఆయనతో పోల్చి మిమ్మల్ని చిన్నబుచ్చుతుంటే మీరెంత బాధపడ్డారో రమ్యకి తెలుసు! తను కూడా లోలోపలే బాధపడేది. అత్తయ్యగారిని మార్చుదామని చూసినా ఆవిడ వినిపించుకునేవారు కాదట. సరే, అది అట్లా ఉంటే పెళ్ళిలో అత్తయ్య మాటలు మాకు కొంతమంది చేరవేశారు. మావాళ్ళూ, నేనూ బాధపడ్డాం. ఈ విషయం రమ్యని అడిగినప్పుడు రమ్య మీ గురించి చెప్పి, బాధపడింది. తను కూడా వచ్చేశాక ఈ ఇంట్లో ఒంటరిగా ఉన్న మిమ్మల్ని అత్తయ్య ఎంత బాధపెడుతున్నారోనని ఏడ్చింది. ఆమె బాధ అర్థమైననాడు ఇంతకన్నా మరో మార్గం కనిపించలేదు. అత్తయ్యగారిలో మార్పు రావాలనే ఈ డ్రామా" వినీల్ నవ్వుతూ చెప్పాడు.

"మమ్మీ దొరికిన వాటికి ఆనందించాలి కానీ దొరకని వాటి గురించి బాధపడకూడదు. తృప్తి అన్నది లేకపోతే నీకు శాంతి ఉండదు. డాడీ విషయం సరే.. నీకు ఏ రోజూ కూర నచ్చదు, చారు నచ్చదు. ఇది తింటూ అదైతే బాగుండేదని అనుకోవటం, ఆ సినిమా చూస్తూ ఈ సినిమా అయితే బాగుంటుందని బాధపడటం. అందువల్ల దేన్నీ ఆనందంగా, ఆహ్లాదంగా ఆస్వాదించలేక అధ్వాన్నపు జీవితం గడిపావు. జీవితం ఒక వరం. గడిచిపోతే తిరిగి పొందలేనిది కాలం. దాన్ని ఆనందంగా గడపాలి గానీ వేధింపులూ, సాధింపులతో కాదు" అంది రమ్య.

అనసూయ తలవంచుకుంది.

"ఆఖరికి పిల్ల చేత కూడా చెప్పించుకోవలసి వచ్చిందే అని బాధపడకు. సంతోషంగా ఉండమని సలహా చెప్పింది. ఇప్పట్నుంచీ పాటించటం నేర్చుకో" కుమారస్వామి నవ్వుతూ చెప్పాడు భార్యతో.

"అర్థమైంది, ఇక నుంచీ తృప్తిగా, హాయిగా గడపటమే నా జీవిత ధ్యేయం" అంది అనసూయ.

అందరూ ఆనందంగా నవ్వారు. V

**పంజాబీ కథ** **- మహిందర్‌సింగ్ సర్‌నా**

# ఆఖరిపెగ్గు!

టేబుల్ మీద ఎదురుగా ఉన్న ఆహ్వాన పత్రాన్ని చదివిన నేను, "దీన్ని ఇక్కడెందుకు వుంచావ్? " అన్నాను.

నా కోటు లోపల వేపు లైనింగ్‌ను కుడుతున్న నా భార్య సిమరన్ ఆ ప్రశ్న విని తన రెండు పెదవులనూ బిగబట్టి నవ్వింది.

ఆ నవ్వులతోనే... ఎగిరే పక్షిలాంటి నన్ను శాశ్వతంగా ఈ సంసార సాగరంలో ముంచిదామె. "అదీ కాక్‌టైల్ పార్టీకి ఆహ్వానం కదా" ఆమె వంక సూటిగా చూస్తూ అడిగాను.

"అయితే..." ఆ కళ్ళల్లో కొంటెతనం!

"ఈ కాక్‌టైల్ పార్టీలూ, కిట్టీ పార్టీల కల్చరంటే నాకు ఒళ్ళుమంట. స్వతంత్ర భారతంలో కొత్తగా పుట్టుకొస్తున్న ఓ వర్గం వారి మనోవికారాలనూ, హావభావాలనూ ప్రదర్శింపజేసే ఈ రకం పార్టీలను నేను అసహ్యించుకుంటానని నీకు తెలీదా సిమరన్? " కోపంగా అడిగాను.

కుట్టటం పూర్తి చేసిన కోటును ప్రేమతో నా మెడ మీదవేసి, రెండు చేతులనూ తొడుగుతూ, "బంధువులు పిలిస్తే వెళ్ళాలిగా. ఉదయం పూజా పారాయణాలకు కూడా వెళ్ళలేకపోయాం. రాత్రికి వెళ్ళి... ఓసారి నలుగురికీ కనపడి హాజరు వేయించుకువస్తే బాగుంటుంది" అంది.

★ ★ ★

అక్కడ అడ్డూ- అదుపూలేకుండా మద్యం తాగుతారనీ, ఆ మందుబాబులు ఒళ్ళూ పై తెలీకుండా చిందులేస్తారనీ... అందుకనే నాకు కాక్‌టైల్స్ లాంటి పార్టీలంటే కిట్టదనీ అనుకునేరు.

నాబోటివాళ్ళు అసహ్యించుకున్నంత మాత్రాన మద్యనిషేధం అమలవుతుందనే భ్రమలు నాకేంలేవు.

ఎవరన్నా తప్పతాగి తమ ఆరోగ్యం పాడు చేసుకుని, అనిత్యమైన ఈలోకం నుంచి త్వరగా వెళ్ళిపోదలుచుకుంటే... నాకు ఎంత మాత్రం అభ్యంతరంలేదు.

★ ★ ★

ఆహ్వానితులందరూ తాగరుగదా! తాగుడంటే కిట్టని నాబోటివాళ్ళు కూడా వుంటారు.

అటువంటి వాళ్ళను తమ మాటలతోనూ, చేష్టల తోనూ వేధించేవారు కూడా ఆ పార్టీలలో వుంటారు.

గతంలో తప్పనిసరై నేను కాక్‌టైల్స్‌కు వెళ్ళినప్పుడు, నా చేతిలోని నిమ్మరసం గ్లాసుని చూసి, "నిమ్మకాయ నీళ్ళతో సరిపెట్టుకుంటున్నాడు. హిహ్హిహ్హి! తనొక సూఫీలాగా, సత్ప్రవర్తనా ప్రబోధకుడిలాగా ఫోజులు కొడుతున్నాడు. ఇన్ని రకాల మద్యం ఫ్రీగా దొరుకుతున్నా ఎంజాయ్ చెయ్యటం చేతకాని దద్దమ్మ" అంటూ నన్నొక పనికిమాలిన వాడికింద జమకడుతూ వేళాకోళం చేశారు.

వారిమాటలూ, ఆ చేష్టలూ నన్ను గాయపరిచాయి. ఖరీదైన దుస్తులూ, నగలూ ధరించివచ్చిన ధనిక వర్గం

వారు... ఒకదాని తరవాత ఒకటిగా స్కాచ్ పెగ్గులు ఖాళీచేస్తూ, రకరకాల ఆహార పదార్థాలనూ లాగించేస్తుంటే... అవి తినలేని నేనేమో... ఎప్పుడో ఖాళీచేసిన నిమ్మరసం గ్లాసును చేతిలోపట్టుకుని ఊపుతూ, వారు విసిరే వ్యంగ్యాస్త్రాలను సహిస్తూ, ఆ ఎద్దేవాలకు జవాబులు వెతుక్కొని చెబుతూ కూర్చోవలసి వచ్చింది.

ఆ వ్యర్థ సంభాషణలను వింటూ రాత్రి ఏడుగంటల నుంచి అర్ధరాత్రి వరకూ సమయాన్ని వృథా చేసుకోవాల్సి వచ్చింది.

ఆకలితో నకనలాడిపోవలసి వచ్చింది.

ఆ అనుభావాలను గుర్తుచేస్తూ నేను రానంటే... సిమరన్ తన నవ్వులతో నన్ను సమ్మోహితుణ్ణిచేస్తూ, కాక్‌టైల్ పార్టీలో నాకు సరిపడని వాటినుంచి ఎలా తప్పించుకోవచ్చో ఉపాయాలు చెప్పింది. ఆ నవ్వులతోనేగా ఆమె నన్ను తన కొంగుకు ముడివేసుకుంది! నన్ను అర్థంచేసుకునే మంచి గుణం, చక్కని సలహాల నిచ్చే చాతుర్యం వున్న నా ఇల్లాలి మాటను కాదనలేక ఒప్పుకున్నాను.

“వెళ్ళే ముందు ఇంట్లోనే నాలుగు రొట్టెలు చేసి నాకు పెట్టాలి. అరగంట కన్నా ఎక్కువ సేపు వుండకూడదు. నేనెక్కడున్నా నువ్వే నన్ను వెతుక్కుంటూ రావాలి. ఆడవాళ్ళ గుంపుల్లో నువ్వెక్కడున్నావో కనిపెట్టటం నావల్లకాదు” అంటూ.. వాళ్ళ చుట్టాలింట్లో జరిగే ఆ పార్టీకి తనతో వెళ్ళటానికి షరతులు విధించాను. ఆమె పెదవులు బిగించి అదే నవ్వు నవ్వుతూ నా షరతులన్నిటికీ అంగీకారం తెలియజేసింది.

★ ★ ★

కాస్త ఆలస్యంగా అయినా ఇద్దరం పార్టీకి వెళ్ళాం.

మమ్మల్ని చూడగానే సాదరంగా ఆహ్వానించి... వాళ్ళ వాళ్ళు ఆమెను లోపలికి తీసుకువెళ్ళారు.

నేనా తాగుబోతుల మధ్య నడుంలోతుకు కూరుకుపోయాను. అనుకున్నంతా అయింది!

ఖరీదైనా సూట్లూ బూట్లూ, మెడలో విలువైన గొలుసులూ, చేతులకు బంగారపు బ్రాస్‌లెట్లూ, వేళ్ళకు నవరత్నాల ఉంగరాలూ ధరించిన ధనిక వర్గపు మనుషులు... షాంపేన్, సైడర్, పోర్ట్‌వైన్... ఇంకా రకరకాల వైన్స్‌నూ మళ్ళీ మళ్ళీ తెప్పించుకుని తాగుతున్నారు.

వాటన్నిటి పేర్లూ నాకు తెలీదుమరి!

ఛాతీమీద వున్న దట్టమైన వెంట్రుకలపై వేలాడే ఖరీదైన బంగారపు గొలుసులను ప్రదర్శించటానికా అన్నట్లు... చొక్కాలపై గుండీలను పెట్టుకోకుండా... అహంభావంతో కళ్ళెగరేస్తూ... పెగ్గుమీద పెగ్గు ఖాళీచేస్తున్న యువతరం, తాగుడులో తమ పెద్దలు నెలకొల్పిన రికార్డులను బద్దలు కొట్టేస్తున్నారు.

వాల్ట్ విటమైన్, ఎమ్.ఎన్.రాయ్, బర్ట్రెండ్ రస్సెల్ మొదలైన మేధావులు యువకులుగా వుండగా... వారి కళ్ళల్లో కనిపించిన కలలేవీ ఈ కాక్‌టైల్ పార్టీని ఎంజాయ్ చేస్తున్న యువత కళ్ళల్లో కానరావటంలేదు.

చిన్నచిన్న విద్యుత్ బల్బుల తోరణాలతో రంగురంగుల కాంతిని వెదజల్లుతూ, పెద్దపెద్ద లైట్లతో దేదీప్యమానంగా వెలిగిపోతున్న లాన్‌లోని పందిరి కిందే ఈ పార్టీ జరుగుతోంది. అక్కడే ఓ చివరగా పెద్దపెద్దగా పొయ్యిలను ఏర్పాటుచేసి రకరకాల వంటకాలనూ తయారు చేస్తున్నారు. ఆ పొయ్యిల్లోనుంచి వచ్చేపొగా, ఉడుకుతున్న పదార్థాలు వెదజల్లే నానా విధాలైన ఘుమఘుమలూ... ఆహూతులను ఉక్కిరిబిక్కిరి చేస్తున్నాయి.

★ ★ ★

నేనూ సిమరన్ ముందుగా అనుకున్నాం గనుక... ఎలాగోలా అరగంట



గడిపిన నేను.. మహిళా సమూహాలను తరచిచూస్తూ ఆమెకోసం వెతక సాగాను.

సువిశాలమైన ఆ పందిరంతా వెతికి వేసారిన నేను, ఆమె కనపడకపోవటంతో ఓ మూలకు వెళ్ళి... అక్కడున్న ఓ ఖాళీ కుర్చీలో కూలబడ్డాను.

'ఇక్కడెక్కడా లేదు. ఒక వేళ ఇంట్లోకి వెళ్ళిందా ఏమిటీ? అంత పెద్ద ఇంట్లో ఎక్కడని వెతకనూ?' అని ఆలోచిస్తూ తలపైకెత్తిన నాకు, పక్కనేవున్న మరో కుర్చీలో పెద్ద సర్దార్జీ కనిపించాడు.

నేను శిరసువంచి నమస్కరిస్తూ ఆయన పట్ల నాకున్న గౌరవాన్ని ప్రకటించాను. ఆయన మనవడి మొదటి పుట్టిన రోజు

సందర్భంగానే ఈ కాక్‌టైల్ పార్టీని ఏర్పాటుచేశారు. అందుకనే ఆయనకూడా సంబరంలో పాలుపంచుకుంటున్నట్లున్నాడు!

ఆయన నోట్లో వున్నవన్నీ కట్టుడు పళ్ళే!

ఎంత డై వేసుకున్నా... ఆ గడ్డంలో నుంచి అక్కడక్కడా ఓ నెరసిన కేశం తొంగిచూస్తూనేవుంది.

ఎరుపురంగు తలపాగా ధరించిన ఆయన... స్కాచ్ గ్లాస్ చేత్తో పట్టుకుని తాగుతూనే... నావంక కళ్ళు పెద్దవిచేసి పరీక్షగా చూశాడు.

కాసేపటికి గుర్తుపట్టి, "ఉదయం పూజా పారాయణం జరుగుతున్నప్పుడు తమ దర్శనంకాలేదు" అన్నాడు నిష్ఠూరంగా.

"పత్రికకు సంబంధించిన అర్జంటు పనులుండటంతో రాలేకపోయాను. ఇప్పుడు కూడా పని ఒత్తిడి ఉంది అయినా.. ఓసారి కనపడి హాజరు వేయించుకుని వెడదామని వీలుచేసుకుని వచ్చాను" సంజాయిషీ ఇచ్చుకుంటున్నట్లుగా అన్నాను.

ఈ సంభాషణ జరిగే లోపల మరో రెండుగ్లాసులు తాగిన ఆయనకు మద్యం మత్తు తలకెక్కింది.

"మరి వేయించుకో హాజరూ?" సూటిగా నావంక చూస్తూ ఏకవచనంలోకి దిగాడు. ఆ కళ్ళల్లో చెడు భావన తొంగిచూస్తోంది. నన్నుకూడా తాగమని ప్రేరేపిస్తున్నాయవి!

"ఎదురుగా కనపడుతున్నాను కదా! వేసుకోండి హాజరు" దీటుగా స్పందించాను.

"నిమ్మకాయనీళ్ళు తాగికూర్చుంటే హాజరు వెయ్యబడదు. ఆబ్సెంటు కిందే లెక్క" అంటూ అటుగావెడుతున్న బేరర్‌ను పిలిచి నాకో పెగ్ ఇమ్మన్నాడు.

నాకు మద్యంతాగే అలవాటులేదని మర్యాదగా తిరస్కరిస్తూ అతన్ని పంపించేశాను.

"మంచివాడివే! ఈ రోజుల్లో నీలాగా ఎవరుంటున్నారూ? నన్ను చూడు! ఇంతకు ముందే రెండుసార్లు హార్ట్ ఎటాక్ వచ్చింది. డాక్టర్లు మద్యం తాగొద్దన్నారు. అలవాటుమానుకోలేనంటే... నాకోటాను ఓ చిన్న పెగ్‌కు పరిమితం చేశారు"

ఆయన చేతిలో నిండుగా మద్యంతో తొణికిలాడుతున్న గ్లాసు మీదకు నా చూపులు చటుక్కున మళ్ళాయి.

అది కనిపెట్టి, "ఇది నా ఆఖరి పెగ్గు" అన్నాడు.

ఒకసారి ఊపిరిపీల్చి వదిలేలోపల ఆ గ్లాసు ఖాళీచేసి కుర్చీకింద పారేసి, బేరర్ని పిలిచి మరోగ్లాసు అందుకున్నాడు.

"ఇది నా ఆఖరి పెగ్గు" అనుకుంటూ...

***గమనిక : విపులకు కథలు, అనువాద కథలు, ఇతర రచనలు, కార్టూన్లు, నేనెవరిని, వినోదిని కూపన్లు పంపేవారు పారితోషికం, బహుమతులు పొందడంలో అసౌకర్యం కల గకుండా ఉండేందుకు విధిగా వారు తమ పూర్తి చిరునామా, పిన్‌కోడ్, వయసు, ఫోన్ నంబరు స్పష్టంగా రాయాలి. తిరస్కృత రచనలు కావాలనుకునేవారు సొంత చిరునామా తో తగినన్ని స్టాంపులు అంటించిన కవరు జతచేయాల్సిందిగా మనవి. చందాదారులు కూడా తాము పంపే డి.డి. వెనుక భాగంలో విధిగా చిరునామా, ఫోన్ నెంబరు ఇవ్వాలి.***

ఆ గ్లాసుని పెదవులకు ఆన్చుకుని... నా వంక చూస్తూ తాగటం మొదలు పెట్టాడు.

గ్లాసు ఖాళీ అయ్యాక, "నేను ఇవాళ చాలా సంతోషంగా ఉన్నాను. కారణం చెప్పు చూద్దాం!" అన్నాడు.

"ఇవాళ మీ మనవడి పుట్టినరోజు కాదా! అందుకనీ"

"కరెక్ట్!" అని... ఒక్క ఉదుటున కుర్చీ లోనుంచి లేచి, "నువ్వు భలే తెలివిగలవా డివి. అందుకే కరెక్ట్‌గా చెప్పావు" అంటూ నా మీదకు దూకినంత పనిచేస్తూ... నాతో కరచాలనం చేశాడు.

"ఇవాళ మా అబ్బాయి కూడా ఖుషీ ఖుషీగా ఉన్నాడు. ఎందుకో చెప్పు చూద్దాం? " అంటూ ఏదో చిక్కుప్రశ్న వేస్తున్నట్లుగా అడిగాడు.

"ఆయనకు కొడుకుపుట్టి ఏడాది గడి చింది. తొలి పుట్టినరోజు వేడుకలు జరి పిస్తున్నాడు అందుకనే!"

"నీ తెలివితేటలు అమోఘమైనవి. అందుకే సరైన జవాబు చెప్పగలిగావు" అంటూ నాచేతులు పట్టుకుని... అవి ఊడి వచ్చేంత గట్టిగా ఊపాడు.

మళ్ళీ కుర్చీలో కూర్చుని, సమాధిలోకి వెళ్ళిపోయినట్లుగా ధ్యానముద్రను అభిన యించాడు!

"పున్నామ నరకంనుంచి తప్పించేవాడినే పుత్రుడంటారని పురాణాలు చెబుతు న్నాయి" కళ్ళుమూసుకునే అన్నాడు. దానికి కొనసాగింపుగా-

"స్త్రీ, నమ్మకం, ధనం, కాలం గడిచే మార్గం, పుత్రుడు... ఇవన్నీ మనిషికి ఉండాలని పెద్దలు అంటారు" అని ముక్తా యించాడు.

"మనవడు పుట్టిన తరవాత నాకు మళ్ళీ హార్ట్‌ఎటాక్ వస్తుందేమోననే భయం ఎగి రిపోయింది. కారణం అడగవేం? " అని ప్రశ్నించాడు మళ్ళీ.

ఆయన అప్పటికే చిత్తుగా తాగి మ త్తుగా తూలుతున్నాడు.

"సరే! అడుగుతున్నాను చెప్పండి. ఎందుకనీ? " ఆయనతో పెట్టుకోవటమెం దుకని వెంటనే అడిగేశాను.

"నేనెందుకు చెబుతాను. ప్రశ్న అడిగింది నువ్వు. జవాబు నువ్వే చెప్పాలి"

"..."

"విద్వాంసుడివి, రచయితవి. 'చేతావనీ' వారపత్రికకు సంపాదకుడివి. ఆమాత్రం తెలుసుకోలేవా? "

"..."

"సరే... ఇంకో ఛాన్సిస్తున్నాను. ఆలో చించి చెప్పు"

నేను తెల్లమొహం వేశాను. మనవళ్ళ పుట్టుకకూ తాతల హార్ట్‌ఎటాక్‌కూ గల పరస్పర సంబంధం గురించి నేనేం పరి శోధన చెయ్యలేదు కదా!

"సరే! ఓడిపోయావని ఒప్పుకో, నేనే చెబుతాను"

"ఓడిపోయాననే అనుకోండి, పోనీ! మీరే చెప్పండి"

"మనవడి పుట్టుకతో మనిషికి ఈ ప్రపంచంతో ఉన్న సంబంధం గట్టిపడు తుంది. అంటే... ఉన్నముడి మరింత

బిగుస్తుందన్న మాట"

పుత్రుడు జన్మించాక ఈ లోకంతో ఏర్ప డిన బంధం... మనవడు జన్మించాక రెట్టింపవుతుంది. అంటే... పక్కాగా బిగిసి పోతుందన్నమాట. అంతగట్టి బంధం వది లించుకుని మనిషి ప్రాణం ఎలా పోతుందీ? " అంటూ నాకు కాస్త దగ్గరగా జరిగి, "ఇవి నేను చెబుతున్న మాటలు కావు. ఎవరో చెప్పగా విని చెబుతున్నవి. ముందుగా ఈ మాటలు ఎవరన్నారో చెప్పుకో!" అంటూ... మళ్ళీ సవాలు విసి రాడు.

నాకు తెలిసినంత వరకూ ఏ మహాను భావుడూ ఆ మాటలు అనలేదు. మరి ఆయనతో ఎవరన్నారో నాకెలా తెలు స్తుంది?

తెలీదన్నట్లు తల అడ్డంగా ఊపాను.

"నువ్వు చెప్పలేవనే అనుకున్నానులే!"

అనువాదం :
**శీతంరాజు పద్మావతి**

కళ్ళు పెద్దవి చేసి నావంక చూస్తూ అన్నాడు.

"ఇంకో పాయింట్ డౌనైపోయావు. నిమ్మకాయ నీళ్ళు తాగి కూర్చుంటే బుర్ర అలాగే తయారవుతుంది. హ్విస్కీ తాగు! హ్విస్కీ... తాగి చూడు ముందు! ఆc... నేనేమంటున్నానూ!"

"ఎవరో చెప్పిన మాటలను పునరుద్ఘాటి స్తున్నారు."

"ఎవరన్నారో చెప్పమనేగా సవాలు..."

"అయ్యా నాకు తెలీదండీ! నే చెప్పలేను బాబూ!"

"అలా రా దారికి! నే చెబుతా చూడు! నాతో ఆ మాటలను చెప్పిన వ్యక్తి మరె వరో కాదు! మా కోడలు గారు! ఆమెకు అన్ని సంగతులూ తెలుసు" ఉత్సాహంగా అంటూ... నాకు మరింత దగ్గరగా జరిగి, "చాలా చాలా ధనవంతులైన సర్దార్ బహ దూర్ ఫలానా సింగ్ గారి మనవరాలు" ఏదో రహస్యం చెపుతున్నట్లుగా నా చెవిలో చెప్పాడు.

మా సమీపంలోంచి వెడుతున్న బేరర్ దగ్గర్నుంచి ఓ గ్లాసు తీసుకుని పెదవులకు తాకించుకుంటూ, "నేనేం చెబుతు న్నానూ? " అంటూ తూగుతూ అడిగాడు.

"తమ కోడలుగారిని గురించి..."

"పొద్దున పూజా, పారాయణం ముగిసిన తరవాత... ఆ భక్తులందరూ, 'పూతా మాతాకీ ఆశీస్' అని ముక్తకంఠంతో నినా దాలు చేశారు. మా కోడలు అనమంటేనే వాళ్ళందరూ అలా అన్నారు. 'పూతా మాతాకీ ఆశీస్' అంటూ మూడుసార్లు అని... మా మనవడినీ మా ఇంటినీ ఆశీ ర్వదించారు. అప్పుడు స్వయంగా ఆ పూతా మాత తన ఆశీస్సులను మాకు అందజేస్తున్నట్లనిపించింది. నువ్వూ విన్నా వుకదా!"

ఉదయం నేను రాలేకపోయిన సంగతిని ఆయనకు గుర్తు చేశాను.

"నువ్వు మిస్సయిపోయావుగానీ... 'అబ్బో! అబ్బో!' ఎంత వైభవంగా పూజ జరిగిందనుకున్నావ్? పూజ, పారా యణం... రెండూ కూడా ఎంతో భక్తిప్రప త్తులతో చేశారు. అప్పుడు ఈ పందిరి వైకుంఠ ధామాన్ని తలపింపజేసింది"

"మరి ఆ పవిత్ర ధామంలోనే ఇప్పుడు కాక్‌టైల్ పార్టీ ఇస్తూ, శాకాహార... మాంసాహార వంటకాలను వండివడ్డిస్తు న్నారా? పెద్ద పెద్ద పొయ్యిలు వెలిగించి పొగపెడుతున్నారా? "

"జరిగేదేదో నీ కళ్ళముందే జరుగు తోంది కదా! గ్రాండ్ పార్టీ ఇస్తున్నాం! అవునూ... నీ ముఖం అలా ఏవగించు కుంటున్నట్లుగా వికారంగా ఉందేమిటీ? "

"ఏం చెప్పనూ? నిమ్మకాయ నీళ్ళు తాగి

కూర్చున్నాను కదా! పైత్యం తలకెక్కిన ట్లుంది!" అసహనంతో అన్నాను.

"అందుకే చెబుతున్నాను... హ్విస్కీ తాగమని! డాక్టర్లు హెచ్చరించినా కూడా నేను తాగటం లేదూ? ధైర్యంగా తాగేస్తు న్నానా లేదా? "

భయం భయంగా తనవంక చూస్తున్న నాకు సర్దిచెబుతున్నట్లుగా, "ఇది నా ఆఖరి పెగ్‌లే!" అన్నాడు.

సరిగ్గా అప్పుడే సిమరన్ నన్ను వెతు క్కుంటూ వచ్చింది.

ఇద్దరం వెళ్ళొస్తామని చెప్పాం. అయి ష్టంగానే తలూపాడాయన. అంతవరకూ నేను తనకు కంపెనీ ఇచ్చినందుకు సంతో షంగా ఉందంటూ... ఆ మత్తులోనే ముద్ద, ముద్ద మాటలతో చెప్పాడు.

నా చాటున ఆ మూలగా కూర్చుని పూటుగా తాగుతున్నాడాయె! మేం బయల్దే రుతుంటే, నా రెండు చేతులూ పట్టుకుని గట్టిగా ఊపాడు.

అప్పుడు ఆయన చేతులు వణకటం గమనించాను.

★ ★ ★

పెద్ద సర్దార్ పరిస్థితిని గురించీ... ఆయన మితిమీరి తాగుతున్న సంగతినీ వాళ్ళ వాళ్ళెవర్కైనా చెప్పటం నా నైతిక బాధ్యతగా భావించి... వాళ్ళ కోసం వెతు కుతూ గేటువేపుకు వస్తున్నాను.

కాస్త ముందుకు వచ్చాక, వెతకబోయిన తీగ కాలికి తగిలినట్లుగా ఆయన కొడుకే ఎదురయ్యాడు.

ఈ చిన్న సర్దార్ కుమారుని పుట్టినరోజు సందర్భంగానే ఇంత అట్టహాసంగా ఈ కాక్‌టైల్ పార్టీ జరుగుతోంది.

ఆయన్ని కాస్త దూరంగా తీసుకువెళ్ళి, "మీ నాన్నగారిని గురించి కాస్త పట్టించు కోండి! పెగ్గుమీద పెగ్గు విస్కీ లాగించేస్తు న్నారు" అన్నాను.

చిన్న సర్దార్ అప్పటికే కిక్కెక్కి ఉన్నాడు!

నేను చెప్పిన దాంట్లో... కేవలం 'విస్కీ' అన్న పదమే ఆయన తలకెక్కినట్లుంది!

"నేను హ్విస్కీ తాగుతున్నానని ఎవర న్నారూ? " చేతులు బారచాపి అటూ ఇటూ తిప్పుతూ, "నేనేమన్నా తాగుబోతున నుకుంటున్నారా? గురువాణిని గౌరవించే మనిషిని నేను! గురువాణిని..." అంటూ అరిగిపోయిన రికార్డు లాగా అవే మాటలు పదే పదే అనటం మొదలెట్టాడు... తూలు తున్నాడు!

ఆయన్ని పట్టుకుని, "నా మాటలు శ్రద్ధగా వినండి" అని బిగ్గరగా అరుస్తూ... "మీ నాన్నగారు..." అంటూ వివరించబో యాను.

వెంటనే అతను నన్ను గట్టిగా కౌగిలిం చుకుని, నా ఛాతీకి బల్లిలా అతుక్కుపో తూ, "మీరే నాకు నాన్నగారు! మీరే నాకు అమ్మగారు!" అనటం మొదలుపెట్టాడు.

నే చెప్పేది వినటం లేదు! నేనే తనకి అమ్మనీ, నాన్ననూ అని బిగ్గరగా అరిచి చెబుతూ నన్ను వదలటం లేదు!

ఏం చెయ్యాలో తోచలేదు నాకు.

చివరికి సిమరన్ సాయంతో ఆ ధృత రాష్ట్ర కౌగిలిని విడిపించుకుని, తూలుతూ అడ్డంవస్తున్న మందుబాబులను తప్పించు కుంటూ... ఆ పందిట్లోంచి బయటపడే సరికి నా తలప్రాణం తోకకు వచ్చింది.

★ ★ ★

ఆ మర్నాడు...

పెద్ద సర్దార్జీ హార్ట్‌ఎటాక్‌తో కన్నుమూ శాడనే కబురు వచ్చింది.

కడసారి చూపులకు బయలుదేరుతున్న సిమరన్ కళ్ళల్లో కన్నీరు చూసి, "పాపం ఆ పెద్దాయన 'ఇది నా ఆఖరి పెగ్, ఇదే నా ఆఖరి పెగ్' అని మొత్తుకుంటూనే ఉన్నాడు. ఆ కాక్‌టైల్ పార్టీ గోలలో... గందరగోళంలో.. అయిన వాళ్ళెవరూ ఆయన ఆరోగ్యం గురించి పట్టించుకోలేదు. మనమేం చేస్తాం? " ఓదార్పుగా ఆమె భుజంమీద తడుతూ అన్నాను. V

స్పానిష్ కథ - మిగేల్ ఆంఖేల్ ఆస్తూరి ఆసు

# జోలపాట

అతను మౌనంగా వున్నాడు. అక్కడికి ఒక మౌన అతిథికిమల్లేనే వచ్చినవాడ తను. ఆమెకి భర్త. పేరు బుయేయివోన్. అతనికి వుంది భాష. వుంది నాలుక! కానీ అతను తన పిడికెళ్లను బిగించి వుంచాడు. పళ్లు కొరికాడు. కోపంతో ఎర్రగా ఉన్నాయి అతని కళ్లు. నిద్రవల్లనో, అలసటతోనో కనురెప్పలు రెండూ ఉబ్బి వున్నాయి. భయంకరమైన సంఘటన ఏదో జరగ వచ్చు అన్నట్లుంది అక్కడి వాతావరణం.

అతని పక్కని, వంతెన మెట్లమీద కూచుని వున్న అతని భార్య పేరు కాయి దూనా. భర్త ఏమంటాడో అన్నట్లు ఎదురు చూస్తోంది.

అదో పెద్దవంతెన. ఆ వేసవిలో ఆ చిన్ననదికి అంత పెద్ద వంతెన అక్కర్లేదు. అయితే చలికాలంలో నదులు పోటెక్కు తాయి.

ఆమె భర్తవేపు చూసి మాత్రం ఏం ప్రయోజనం? ఏం మాట్లాడినా క్లుప్తంగా 'చిన్న పొరబాటు జరిగిపోయింది' అంటాడు.

అందుకే కన్నీళ్లతో తడిసిన బరువయిన కనురెప్పల్ని మూసుకొని, ఆమె తన కొడు కుల కోసం ఆలోచిస్తూ ఆందోళన పడు తోంది. వాళ్ల పిల్లల పేర్లు- అనాక్లేతో, సెరాపితో. సైనికులు ఎక్కడ తమను పట్టుకుపోతారోనని వారిద్దరూ నిన్న సాయంత్రం చీకటిపడే వేళ కొండల్లోకి మాయమయ్యారు. ఎందుకంటే చేతచిక్కితే పేరయినా అడగకుండా వారిని కాల్చి చంపేస్తారు సైనికులు. కొడుకులు వెళ్లిపోవడంతో ఆమె ఒంటరి అయిపో యింది. దాంతో ఆమె కోరిక మేరకు ప్రస్తుతం భర్త బుయేయివోన్ తనతో ఉంటున్నాడు.

తెల్లవారినప్పట్నించి కాయిదూనా అటూ, ఇటూ పచార్లు చేస్తూనే ఉంది, కొడుకుల కోసం వేయికళ్లతో ఎదురుచూస్తోంది. చీటికి మాటికి నిట్టూరుస్తోంది. ఈ దుస్థితి ఆమెను స్థిమితంగా ఉండనివ్వడంలేదు.

"అంతా ముందే సిద్ధమైపోయింది.." ఆమె చెప్పసాగింది.

వాస్తవానికి అక్కడ ఇప్పుడు గోడలు, ఇంటి పైకప్పు, పొలాలు తప్ప ఇంకేమీ లేవు.

"అంతా ముందే సిద్ధమైపోయింది.. అంతా తమతమ బుట్టల్నీ, పారల్నీ బయ టికి విసిరివేశారు..."

భర్త బుయేయివోన్ కాయిదూనాని చిరాకుగా చూస్తున్నాడు. భార్యంటే అతని కళ్లలో ఎక్కడలేని ఏహ్యత!

"...సైనికులు మీ తండ్రీ కొడుకుల్ని తీసుకుపోవచ్చు. అలా జరగడానికి వీలు లేదు!" అంది కాయిదూనా.

"నువ్వేం అనుకుంటున్నావ్? నువ్వు కొ డుకుల్ని విడిచి పెట్టేసి, ఎలా వచ్చావ్?" అడిగాడతను.

"...నువ్వు భయపడిపోయి వుంటావనీ, కొండల్లోకి వెళ్ళిపోవడమే మంచిదనుకుం టున్నావనీ నాకు బాగా తెలుసు" అన్నాడ తను మళ్లీ.

"నాకేం భయం లేదు..." అందామె.

"మరక్కడ రక్షణేం వుంటుంది చెప్పు!"

రెట్టించాడు బుయేయివోన్.

"అయ్యో ఎంత తెలివితక్కువదాన్ని.. బయటకు రావాలన్న తొందరలో టమోటాల గురించి మర్చేపోయాను" విషయాన్ని దాటవేస్తూ అందామె. అంటూనే తను సాగుచేసే కూరగాయల, పండ్ల తోటల వేపు వడివడిగా నడిచిందామె.

★ ★ ★

కన్నీళ్లతో ఆమె మొహం తడిసిపోయింది. ఆమెకి తెలుసు, ఆ భూమికి తాము యజమానులు కామని. ప్రభుత్వం భూమిని తమ పేరున రాసింది. కానీ సైనికులు తమ నుంచి దాన్ని గుంజేసుకున్నారు.

తన భర్తకీ, కొడుకులకీ ఏదో అనర్థం జరగబోతోందనే ఆందోళన ఆమెలో సుడులు తిరుగుతోంది. ఒంట్లో నుంచి వణుకు వస్తున్నట్టు అన్పిస్తోందామెకు.

తాను ఏం చెయ్యడానికి వచ్చిందీ, ఆమెకి గుర్తుకి రాసాగింది. కొడుకు అనాక్లేతో పారిపోతున్న సమయంలో తనవద్ద బాకుని వదిలిపెట్టాడు. అదే ఈ బాకు. దాని సాయంతోనే పూల మొక్కల నడుమ కలుపు తీస్తోంది తాను.

"నన్ను క్షమించు, ప్రభూ!" కంపిస్తున్న కంఠంతో ఆమె దేవుడ్ని ప్రార్థించింది.

"అసలు మేమీ నేలను ఎందుకు వదిలెయ్యాలి? దాని నష్టపరిహారం మాకింతవరకూ ఏ సైనికులూ ఇవ్వలేదు! ఇలాంటి దుష్టుల ఆధ్వర్యంలో సాగయ్యే నారింజ తోటల్లోని పండ్లు వాళ్ల మనసులాగే ఛండాలంగా ఉంటాయిలే! దుర్మార్గులు! తగుదునమ్మా అని వచ్చి ఏదో రోజున మా పండ్లతోటని కూడా ఆక్రమించేసుకుంటారు.."

బుయేయివోన్ ఆమె మొక్కలని నాశనం చేస్తుండడం చూడలేదు. రాలుతున్న ఆకులతోపాటు కన్నీళ్లూ నేలమీద పడుతున్నాయి. అతను వంతెన దగ్గరకి వెళ్లి అక్కడ నిలబడి, ఆలోచించసాగాడు. ఏదో పెద్ద విపత్తే రాబోతోంది.. అదేంటో ఎవరు చెబుతారు తమకు?

'బయటికి వెళ్లుకొచ్చే యజమానుల భారీ పొట్టల్ని నింపడంకోసం బీదవాళ్లు నీటితో కాక తన చెమటతో నేలను తడుపుతున్నారు. అలాంటి నేలలో విషమే పండుతుంది! ఎంతటి హతభాగ్యులు? ఎంతటి? ఎంతటి..? ఎంతటి....!!' అనుకుంటున్నాడతను.

ప్రతి 'ఎంతటి' అనే శబ్దంతో పాటు అతనూ చాకుతో నేలని గుచ్చి, మొక్కలను వేర్లతోపాటు తెంచి బయటికి లాగేస్తున్నాడు. అప్పటికే అనేక మొక్కలు నాశనమయ్యాయి.

అతన్ని చూసి ఆమె నవ్వింది! ఎండకి వేడెక్కిన మొహంలో ఆమె పళ్లు తళుక్కుమన్నాయి. ఆ నవ్వులో జీవంలేదు.

ఆమె బాకుతో కలుపుతోపాటు మొక్కల్ని కుళ్లగిస్తూనే ఉంది.

అప్పటికి సూర్యుడు నడినెత్తిమీదకి వచ్చేడు. అప్పట్లో పొలాల యాజమాన్యపు హక్కుకు సంబంధించి తమకు పట్టాలు ఇవ్వడానికి అధికారులు వచ్చినపుడు తను సంతోషంతో ఏడ్చేసింది. ఆనందంతో దేవుడికి కృతజ్ఞతలు చెప్పింది. దేవుడి కృపవల్లనే తమకి పొలాలు లభించేయి మరి!

హఠాత్తుగా దూరంగా ఏదో గలాటా విన్పించింది. భయంతో కాయిదూనా చేతి లోంచి బాకు జారిపోయింది. వొంగి, దాన్ని తీసుకొనేందుకు కూడా సమయం చిక్కలేదు.

రానురాను ఆ గలాటా దగ్గరకు వస్తున్నట్లు అర్థమవుతోంది. ఆమె పరుగెత్తుకు వెళ్లి, ఒక ఖాళీ ఇంట్లోకి వెళ్లి దాక్కుంది.

అప్పుడు గుర్తుకు వచ్చిందామెకు. భర్త బుయేయివోన్ ఎక్కడ? అని. అతన్ని వెదికేందుకు దాక్కున్న ఇంట్లోంచి బయటకు వచ్చిన ఆమె అక్కడి దృశ్యాన్ని చూసి బొమ్మలా అక్కడే నిలబడిపో

యింది. అప్పటికే భర్త తలమీది టోపీ ఎగిరి పడిపోయింది. చేతిలోని చాకువల్ల అతని తలమీది చర్మం చీరుకుపోయింది.

★ ★ ★

సాయంత్రం గడిచి రాత్రయ్యింది. ఆమెకి తన భర్త బుయేయివోన్ జాడ తెలియలేదు. ఆమె భర్తని వెదుకుతూ చీకట్లో బయల్దేరింది. "నాయకా, బుయేయివోన్! కుయికే! (తెల్ల కలువ)" అని పిలుస్తోంది.

బాగా అలసిపోవడం వల్ల కాయిదూనా అడుగులు తడబడసాగాయి. ఆ పాదాల కింద మాటిమాటికీ ఇసుక నలుగుతోంది. చిన్నచిన్న రాళ్లు దొర్లసాగాయి. చిన్న, పెద్ద కప్పలు, మిడతలు ఇటు అటు పరుగులు తీస్తూన్నాయి. గుండ్రని రాళ్లు ఆమె పిలుపులను ప్రతిధ్వనిస్తున్నాయి.

"నాయకా, బుయేయివోన్!... నాయకా కుయికే!... నాయకా! కుయికే!"

అనువాదం :
**నిర్మలానంద**

అతని అసలు పేరు అదేను. తప్పనిసరి సైనిక జీవితపు కాలాన్ని పూర్తిచేస్తున్నప్పుడు 'బుయేయివోన్' అని పేరొచ్చింది. సహచరులు అతని శక్తినీ, మంచితనాన్నీ చూసి, ఆ పేరుపెట్టారతనికి.

ఆమె బుగ్గలమీది కన్నీళ్లు, చిన్నచిన్న పుళ్లుగా మారాయి. వాటిపైన ఏర్పడిన పొక్కులు ఎండిపోయాయి. ఉదయపు మసకచీకట్లలో ఆమె మొహంపైన గుంటలు పడినట్టుగా అనిపించింది. కొండల్లో పోగొట్టుకున్న తన కొడుకులు అనాక్లేతో, నేరాపీతోగాని, తన భర్త గాని, చివరకు మొక్కజొన్న పొలంగాని లభించలేదు. కేవలం ఖాళీగా ఉన్న ఇల్లు, తనూ మాత్రమే మిగిలారు. ఇన్నిరోజులు ఎలా గడిపిందో ఆమెకే తెలీదు.

★ ★ ★

కొండల్లోకి వెళ్లిపోయిన పిరికివాళ్లు తిరిగివచ్చేస్తారు. సన్నగా, ఏదో పోగొట్టుకున్న వారిలా, పెరిగిపోయిన గెడ్డాలతో, వంటిమీద చిరుగు పాతలతో వచ్చేస్తారు. తిరిగి వచ్చేది తమని చావు మింగేయవచ్చునని చెప్పడానికే! అయితే ఇప్పుడు వారికి మనవళ్లున్నారు. వారు అసలయిన మనవళ్లు కారని, వారి కొడుకుల కొడుకులు చెబుతారు... కానీ నిజమేదో ఎలా తెలుస్తుంది? ... వారు వీరికి అసలయిన మనవళ్లేను! ఆс! తాతలకి వారు బ్రతికి ఉన్న చిత్రఫలకాలు. అలాగే అనిపిస్తుంది. కొండల్లో నుంచి వ్యక్తులు తిరిగి వస్తారు- ఒక్క చావు ఎత్తుకుపోయిన వారు తప్ప! కానీ బుయేయివోన్ తాలూకా చిరిగిన బట్టలు సయితం తిరిగి రాలేదు. కనీసం ఏ ఆనవాలూ దొరకలేదు...!

★ ★ ★

"...నానమ్మా! కథ చెప్పవా...? "

"ఆс! అలాగే ఇది కథకాదు. ఒకనాటి సంగతి.. మనం ఇప్పుడు ధనవంతులం అయిపోయాం! మీతాతల త్యాగమే మనల్ని ధనవంతుల్ని చేసింది.. ఒక ప్రభుత్వం ఉండేది. అది పొలాల్ని ఇచ్చి సంపన్నుల్ని చేసేసింది? వింటున్నారా మీరు? ప్రభుత్వంవారు మీ తాతయ్యని, కుయికేని నగరంలోని నాలుగురోడ్ల కూడలికి పిలిపించింది. నేను కూడా ఆయనతో కలసివెళ్లా! ఒకవేళ మీ తాతయ్య ఇవేళ కూడా తిరిగివస్తే, నేనూ వెళ్తాను.. మీ తాతయ్య మంచి శక్తిమంతుడు. అందగాడు మొక్కజొన్నరొట్టెలా! సరే అక్కడ కూడలిలోని పొదనీడలో అప్పటికే చాలా మంది పోగయ్యారు. వారిలోని ఒకాయన చాలా విషయాలు చెప్పాడు. అందులోని చాలా భాగం నాకర్థంకాలేదు. కాని ఒక విషయం మాత్రం ఉంది... అతను వృద్ధ

మయిన మాట చెప్పలేదు. చివరికతను పొలాల పత్రాలు ఇచ్చేడు. అందువల్ల నేను డబ్బుగల దాన్ని అయిపోయాను. యజమానిని అయ్యేను. అసలయిన యజ మానిని... నా పొలానికి యజమానిని.."

"నానమ్మా! ఇదేదో కలలోని సంగతిలా ఉంది!" మనవరాలంది. ఆమె ఇప్పుడు స్కూలుకి వెళ్తోంది.

"ఇదికలకాదు.. చరిత్ర! దాని స్థానం అదే!"

"లేదు!... లేదు అలా ఎలా అవు తుంది? "

"అయితే అమ్మాయి! ఎవరికయితే ఇబ్బంది కలుగుతుందో వారు చరిత్రలో వుండరు. నేను చెబుతున్నది, జరిగింది"

"నిజమే నాయనమ్మా! మా టీచరు చరిత్ర ఒట్టి పాతచెత్త అంటుంది"

"ఆమె చెప్పేది అబద్ధం. నేను చెప్పేది నిజం. నిజంగా జరిగింది. వారు భూమిని బీదవాళ్లకి పంచివేసారు"

"ఇదే? "

"అవును. ఇదే.. ఆc! మీ తాతయ్య, నేనూ భూమికి సంబంధించి పత్రాలను తీసుకొని, నగరం నుంచి రావడం మీరు మమ్మల్ని చూసి ఉంటే మేము ఏం మాట్లాడుకున్నామో తెలిసేది? మూడురా త్రులు మేము నిద్ర కూడా పోలేదు! ఆయన భయం, బెరుకు వదిలేశారు.."

"మరి నానమ్మా ఆ పొలాలు ఎక్కడు న్నాయి? "

"వేరయిపోయాయి. ఆయన వాటిని గుంజుకున్నారు. ఇతరుల భూమిలా... ఇతర భూముల్లా ఆయనకి వేడి పుట్టింది"

"ఆయన గుంజేసుకున్నారా? ... ధనవం తులకి ఇచ్చేయడానికే? "

ఒక సుదీర్ఘమయిన మౌనం... మెల్లమె ల్లగా కనురెప్పల్ని ఎత్తి, దించడం చేసిన తర్వాత మొహంలోని ముడతలతో నిండిన కాయిదూనా మాటల్ని స్పష్టంగా చెప్పే ప్ర యత్నంలో పెదాలను కలుపుతూ అంది.

"ఆయనకిగాని, నాకుగాని విదేశీ భాషలో మాట్లాడేవారికిగానీ భూమి ఇచ్చేందుకు.. దీనికోసం వారు మాపై ఆకాశం నుంచి బాంబుల వర్షం కురిపించేరు.."

"అయితే మా టీచరుకి నానమ్మకన్నా ఎక్కువ తెలీదు!..."

"ఆ తర్వాత.. నేనూ నా కొడుకు అక్క డికి వెళ్లి చూశాం. ఎటుచూసినా ముళ్ల చెట్లే! విదేశీయులు ఓడ ద్వారా కళ్లుమూసి, తెరిచేంతలో అంతా నాశనం చేసేందుకు ముందు పంచదార మిల్లు, వంతెన, బుయే యివోన్... అంతా మోసం- కేవలం దాన్ని అర్థంచేసుకోవడమే నిషేధం- భూదేవికి యువమాంసం కావాల్సి వచ్చింది... మాంసం... మన మాంసం... నీ మాంసం... ఎందుకంటే ఈ భూమి కూడా ఎవరిదో మాంసమే..."

"..."

"కేవలం తమసంపదని పెంచుకోడానికి. మనభూముల్ని బంజరు భూములుగా మార్చి తద్వారా మనల్ని నాశనం చెయ్యా లన్నది వాళ్ల ఎత్తుగడ. మనల్ని పేదవా ళ్లను చేయాలన్నది వారి అభిమతం.."

"ఇదేదో కలలా ఉంది, నానమ్మా!"

"ఆc! ఎలాగైతే నిప్పంటుకున్నాక అదే ఆరిపోతుందో, ఈ కలకూడా అలాంటిదే! కాని నిప్పు మళ్లీ అంటుకుంటుంది! బిడ్డా"

"మా టీచరు ఇదే చెబుతుంది- ఒక అగ్ని అందర్నీ తనలో చుట్టేసుకుంటుంది. కలిపేసుకుంటుంది. అందుకు కారణం- ఎగిరే నిప్పురవ్వలు విడిపోతాయి. ఆలోచ నలు ఆ నిప్పురవ్వల్ని ఆర్పలేవు!"

నానమ్మ కాయిదూనా మౌనంగా ఉండి పోయింది. ఆమె తన మనుమరాల్ని ఒడి లోకి తీసుకొని, మెల్లగా వీపు నిమరసా గింది. ఆ తర్వాత ఆమెచెవిలో చెప్పింది "ఇదంతా ఓ జోలపాటలా నీకు మరోసారి చెబుతాను.." V

- బండారు పురుషోత్తం

# దేవి

శ్యామసుందర్ మదనపల్లిలో పనిచేస్తున్న రోజులు. అతను ప్రభుత్వ ఉద్యోగి. తెల్లవారితే ఆదివారం. నిశ్చింతగా ముసుగు తన్ని నిద్రపోతున్నాడు. ఆదివారం తొమ్మిది గంటలదాకా నిద్రపోవటం రివాజు.

ప్రకృతికి విరుద్ధంగా ఆరోజు ఎనిమిది గంటలకే "లేవండి, ఇక నిద్ర చాలు లేవండి" అంటూ అతని భార్య సునీత హడావిడిగా నిద్రలేపింది.

"ఏం కొంప మునిగిపోయింది!? ఆదివారం కూడా నిద్రపోనీయరు" అంటూ బద్ధకంగా లేచి వొళ్లు విరుచుకున్నాడు.

"ముందు కాఫీ తాగండి" అంటూ అతని చేతికి కాఫీ కప్పు అందించి మంచం మీద అతని పక్కనే కూర్చుంది.

అతను రెండు గుక్కలు తాగి కొంత సేదతీరాక "ఏవండీ, మన పూజా మందిరంలో ఉంచిన వెండి వినాయకుని విగ్రహం కనిపించటం లేదండీ! ఏమైందో ఏమో!" అంటూ దిగులుగా ముఖం పెట్టుకొంది.

"చిన్నదేగా! ఏం ఫరవాలేదు, మరొకటి కొందాంలే" అని సముదాయించబోయాడు శ్యామసుందర్.

"నిజమే, అది ఒక అంగుళమే పొడుగు ఉంటుంది. కానీ దాని ఖరీదును గురించి కాదు నా బెంగ. దేవతావిగ్రహం పోవడం మంచిది కాదు. నాకు అది సెంటిమెంటు. అందునా, అది చాలా రోజులుగా మన ఇంట్లో ఉన్న విగ్రహం! ఇప్పుడు ఉన్నట్టుండి మాయమైందంటే, నాకు చాలా బాధగా ఉంది మరి. అది ఎలా పోయిందో, ఏమైపోయిందో కనుక్కోవాలి, దానిని ఎలాగైనా మళ్లీ సంపాదించాలి. లేవండి, లేచి త్వరగా ఏదో ఒకటి చేయండి" అంది.

అక్కడే నిలబడి అంతా వింటోన్న ఉష ఆమె మాటకు సమాధానంగా, "ఎవరైనా తీయటానికి అవకాశం ఉందేమో ఒకసారి నిశితంగా ఆలోచించండి వదినా" అంది. ఆమె శ్యామసుందర్ చెల్లెలు. ఇంటరు రెండవ సంవత్సరం చదువుతోంది.

సునీత ఆరోజు జరిగిన విషయాలన్నీ మననం చేసుకుంది. ఉదయం ఆరు గంటలకే పనిమనిషి కస్తూరి వచ్చింది. అలవాటు ప్రకారం సునీత తలుపుతీసి, మళ్లీ వెళ్లి గదిలోని పడకమీద పరుండిపోయింది. కస్తూరి పనులన్నీ పూర్తి చేసుకొని ఏడుముప్పావుకి తలుపు దగ్గరకు చేరవేసి వెళ్లిపోయింది. ఆమె వెళ్లిన తరువాత గడియవేయని తలుపు తీసుకొని, ఎవరైనా వచ్చారా లేదా అన్నదే ఇప్పటి సందేహం.

అదే సందేహాన్ని సునీత వ్యక్తపరుస్తూ "కస్తూరి వెళ్లిన తరువాత ఎవరైనా ఇంట్లోకి వచ్చారా? " అని ఉషనడిగింది.

"లేదు వదినా, అప్పుడే నేను మేల్కొన్నాను. ఇంట్లోకి ఎవ్వరూ రాలేదు" అని ఉష ఖచ్చితంగా చెప్పింది.

ముగ్గురూ ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చారు. ఆ విగ్రహం తీసుకు వెళ్ళడానికి కస్తూరికొక్కదానికే అవకాశముంది.



అయితే, చాలా రోజులుగా తమ ఇంట్లో పనిచేస్తున్న కస్తూరి నిజాయితీ వారికి బాగా తెలుసు. కాబట్టి ఆమెను అనుమానించడానికి ఆస్కారం లేదు. అయితే, విగ్రహం ఎలా పోయింది? అందరూ వాదించుకోసాగారు. ఎటూ తేలక చివరకు వాదన చాలించి ఎవరి పనుల్లో వాళ్ళు మునిగిపోయారు.

★ ★ ★

సూర్యప్రకాష్ కూడా ప్రభుత్వ ఉద్యోగి. శ్యామసుందర్‌కి స్నేహితుడు. వేరు వేరు శాఖల్లో పనిచేస్తున్నా ఆదివారమైతే ఇద్దరూ ఎక్కడో ఒకచోట కలుసుకోవటం అలవాటు. ఆ రోజు సూర్యప్రకాష్ శ్యామసుందర్‌వాళ్ళ ఇంటికి వచ్చాడు. అప్పటికే స్నానపానాదులు ముగించుకొని సోఫాలో కూర్చొని ఉన్న శ్యామసుందర్ తన స్నేహితుని ఆహ్వానించాడు. పిచ్చాపాటి మాట్లాడుకుంటున్న వారికోసం సునీత వేడి టీ తెచ్చి టీపాయ్ మీద పెట్టింది. తనూ అక్కడే కూర్చుంది.

ఇద్దరూ టీ తాగడం ముగించాక చెప్పింది సునీత సూర్యప్రకాష్‌తో "అన్నయ్యా, ఎంతోకాలంగా మా పూజా మందిరంలో పూజలందుకుంటున్న వినాయకుని విగ్రహం- వెండిది- ఉదయం నుంచీ కనిపించటం లేదు. దీనివల్ల ఏమైనా అనర్థమా? చెప్పండి" అంది.

సూర్యప్రకాష్ నవ్వుతూ అన్నాడు "అన ర్థంలాంటిదేం లేదు. ఆ విగ్రహం ఇక్కడ పోయినా ఎక్కడో ఒకచోట ఉండనే ఉంటుంది కాబట్టి, ఎటువంటి దోషమూ లేదు" అన్నాడు.

వారి సంభాషణలోకి వచ్చిన శ్యామసుం దర్ "మా పనిమనిషి కస్తూరికి దాన్ని తీసే అవకాశం ఉంది. కానీ, ఆమె అలాం టిది కాదు. మాది ఉత్తి అనుమానం మాత్రమే" అన్నాడు.

సూర్యప్రకాష్ అతని మాటలు వినగానే "ఉదయం నేను వచ్చే దారిలో మీ పనిమ నిషి కస్తూరి ఒక కుదువ వ్యాపారి అంగ డిలో కూర్చుని ఉండటం చూచాను. ఆమె అక్కడెందుకుందో" అన్నాడు.

"అవునా అన్నయ్యా! అయితే కస్తూరే ఆ విగ్రహం దొంగిలించి ఉంటుంది. విచా రిస్తే విషయం తెలిసిపోతుంది. వెంటనే వెళ్ళండి!" అంటూ సునీత శ్యామసుందర్‌ని తొందరపెట్టింది.

★ ★ ★

ఇద్దరు స్నేహితులూ చెరొక మోటారు బైకులో ఆ కుదువ వ్యాపారి అంగడికి చేరు కున్నారు. కొనుగోలుదార్లు ఎవ్వరూ లేరు. సూర్యప్రకాష్ అడిగాడు "కస్తూరి అనే ఆవిడ మీవద్ద ఏదైనా వెండి వస్తువు పెట్టి డబ్బు తీసుకుందా? కొంచెం చూసి చెప్పండి. ఆమె మా స్నేహితుడి ఇంట్లో పనిమనిషి"

వ్యాపారి పుస్తకాలు, బిల్లులు చూచి అవును, ఈరోజు పొద్దున ఆమె ఐదువం దల రూపాయలు తీసుకున్నదని చెప్పాడు. స్నేహితులిద్దరూ ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు. మన అనుమానం నిజ మైంది అనుకున్నారు.

శ్యామసుందర్ స్నేహితుడితో తొందరప డద్దు అంటూ వ్యాపారితో "కాస్త ఏం వ స్తువు కుదువ పెట్టిందో కూడా చెప్పండి" అన్నాడు.

వ్యాపారి నిశితంగా పరిశీలించి "ఒక జత కాలిపట్టీలు" అని చెప్పాడు.

ఇంతలో శ్యామసుందర్ సెల్ మోగింది. ఫోన్ సునీత దగ్గరనుంచి వచ్చింది. శ్యామసుందర్ ఫోన్ ఆన్‌చేసి "సునీతా, అది మన వస్తువుగాదు. కస్తూరి ఒక జతకాలి పట్టీలు పెట్టి ఐదువందల రూపాయలు తీసుకుంది" అని చెప్పాడు. తరువాత ఇద్దరు స్నేహితులు ఇంటికి చేరుకున్నారు.

★ ★ ★

ఆ రోజు దినపత్రికతోపాటు వచ్చిన ఆది వారం అనుబంధం ఆసక్తిగా చదువుతున్న ఉషకు ఫోను శబ్దం అంతరాయం కలిగిం చింది. స్నేహితురాలు రాధిక "ఈరోజు పది గంటలకు మన కాలేజీలో అష్టావ ధానం జరుగుతుంది. ఎవరో ప్రసిద్ధుడైన అవధానట, నువ్వు వస్తున్నావా? " అని అడిగింది.

"అలాగే, ఇంటిదగ్గరే ఉండు. వస్తు న్నాను" అని చెప్పి ఉష కాల్ కట్ చేసింది.

మదనపల్లి కాలేజీలో అష్టావధానం జరు గుతోంది. ఉష, రాధికలు చాలా ఆసక్తిగా వింటున్నారు. ఉషకు అష్టావధానంలో అన్ని ప్రక్రియలకన్నా సమస్య' అంటే చాలా ఇష్టం.

'కుంజరయూథమ్ము దోమకుత్తుక జొచ్చెన్'

వంటి వాటికి సమస్యాపూరణం చాలా ఆసక్తికరంగా ఉంటుంది. ఆమె పృచ్ఛకులు అడిగిన అన్ని ప్రశ్నలు, వాటికి అవధాని ఇచ్చిన సమాధానాలను ఒక పుస్తకంలో వివరంగా రాసుకొంది ఉష. అష్టావధానం పూర్తవటానికి మూడుగంటల సమయం పట్టింది. ఇద్దరు స్నేహితురాళ్లు ఇంటికి బయలుదేరారు. అవధానంలోని విషయా లను చర్చించుకుంటూ నడుస్తున్నారు. ఆరోజు అవధానికిచ్చిన సమస్య -'ఎలుకలు

తమ కలుగులోనికేనుగు నీడ్చెన్' అన్నది. దానికి అవధాని చెప్పిన సమాధానం ఇది:

అలవాటున చదరంగము
పలుమరు నాడుచు, విడిచిరి పావుల, రాణుల్
యలసి, నిదురించు నెపమున,
ఎలుకలు తమకలుగులోనికేనుగునీడ్చెన్.

చివరి పాదము విన్నప్పటి నుంచీ ఉషకు ఏదో ఆలోచన స్ఫురించినట్లు తోచింది. రాధిక మాత్రం అవధాని పూరించిన చమత్కార సందర్భాన్ని గుర్తుచేస్తోంది. ఉష దేనిగురించో ఆలోచిస్తూనే రాధికకు వాళ్ళింటి దగ్గర వీడ్కోలు పలికింది.

ఇంటికి రాగానే తన మనసుకు స్ఫురించిన విషయాన్ని మననం చేసుకుంది. అది ఏమిటా అని కాసేపు స్థిమితంగా ఆలోచించాక తట్టింది. తమ ఇంట్లోని వరండాలో ఎలుకలు తొలిచిన బొరియ చాలాసేపటినుండి తన మనోఫలకంపై దర్శనమిస్తూ ఉంది! అందులో ఏదో వున్నట్లు ఆమె సిక్స్‌సెన్సు చెబుతోంది.

వెంటనే వెళ్ళి ఆ బొరియలో చూసింది. బొరియ చాలా లోతుగా నేలబారుగా ఉంది. ఆరేడు అంగుళాల దూరంలో ఏదో తెల్లగా మెరుస్తోంది. ఒక కర్రపుల్ల తీసుకొని ఆ మెరుస్తున్న వస్తువును వెలికితీసింది.

ఉష ఆశ్చర్యానికి అంతులేదు. అది పూజా మందిరంలో ఉండాల్సిన వెండి వినాయకుడి విగ్రహం! గబగబా ఆ విషయం అన్నావదినలకు చెప్పింది. ఇద్దరూ చాలా సంతోషించారు.

శ్యామసుందర్ మాత్రం సునీతతో "మనం తొందరపడి కుదువ వ్యాపారిని విచారించకుండా ఉంటే బాగుండేది. ఈ విషయం తెలిస్తే కస్తూరి బాధపడుతుంది" అన్నాడు.

★ ★ ★

మరుసటిరోజు అందరూ మామూలుగా లేచి వారి వారి పనులు చేసుకున్నారు. ఐతే ఉదయం పదిగంటలైనా పనిమనిషి కస్తూరి రాలేదు. వెళ్ళి తెలుసుకు రమ్మని ఉషను పంపింది సునీత. అక్కడ కస్తూరి ఇంటిపనులు చేసుకుంటూ కనిపించింది. కస్తూరి కుమార్తె- పదోతరగతి చదువుతున్న కౌసల్య, ఉషను కూచోమని ఇలా చెప్పింది..

"మీరు మా అమ్మను అనుమానించి, కుదువ వ్యాపారిని విచారించిన విషయం అతను మాకు చెప్పాడు. మేము బీద వాళ్ళం. సమాజం మమ్మల్ని ఏమంటుందో అంతా అలాగే జరిగింది. ఎక్కడ తప్పు జరిగినా మమ్మల్నే అనుమానిస్తారు. లేమికి దుర్గుణానికి లంకె కడ్తారు. మాలో సుగుణం ఉండకూడదా? ఇది ఎంతవరకు సమంజసం? మేము మారాం, తప్పు చేయలేదు అన్నాగాని నమ్మరు" అంటూ ఉష కుటుంబ సభ్యుల వైఖరిని ఆమె తప్పుబట్టింది. ఉష విగ్రహం దొరికిన విషయం చెప్పింది. అప్పుడు కౌసల్యకు కోపం ఇంకా ఎక్కువైంది. ఉష చాలాసేపు నచ్చచెప్పిన తరువాత ఆమె సమాధానపడింది.

ఇంతలో కస్తూరి కలుగజేసుకొని రేపటి నుంచి పనిలోకి వస్తానని చెప్పింది. ఉష వెనుతిరిగి ఇంటికి వచ్చి విషయమంతా అన్నావదినలకు చెప్పింది. పనిమనిషి బీద తనాన్ని ఆసరాగా చేసుకొని అనుమానించి అనాగరికంగా ప్రవర్తించినందుకు ఆ కుటుంబం చింతించింది.

"ఈ తప్పు సమాజానిదా? కాదు. సమాజమంటే మనమే. కాబట్టి భవిష్యత్తులో వ్యక్తుల గుణగణాలననుసరించి వారిని గౌరవించటం అలవాటుచేసుకోవాలి" అని ఉష చెప్పిన మాటలను అందరూ ఆమోదించారు. V

అమెరికన్ కథ

- జాయెస్ కరోల్ ఓట్స్

# నగరం

"నేను నీకు చెప్పినట్లుగా నిన్ను ఆల్బనీ స్టేట్ యూనివర్సిటీకి ఇంటర్వ్యూకి కారులో తీసుకెళ్ళలేను"

ఇరవై ఏళ్ళ కేథరిన్‌కి ఆమె తండ్రి ఆ విషయం చెప్పగానే దుఃఖం వచ్చింది,

"కానీ నువ్వు తీసుకెళ్ళకపోతే నేను టీచర్ల ఇంటర్వ్యూకి ఎలా హాజరవగలను? ఇంక నన్ను తీసుకెళ్ళేవారు ఎవరున్నారు? " తండ్రిని అడిగింది.

"ఏం చెయ్యను? శనివారం ఉదయం నన్ను పనికి రమ్మని ఫ్యాక్టరీ మేనేజర్ కోరాడు. ఎలా కాదనను? " తండ్రి బాధగా చెప్పాడు.

కేథరిన్‌కి తెలుసు, శనివారం పని చేస్తే తన తండ్రికి ఒకటిన్నర రెట్లు అధికంగా జీతం ముడుతుందని, కుటుంబ ఆర్థిక పరిస్థితి దృష్ట్యా ఆయన దాన్ని వదులుకోకూడదని. తండ్రి సంపాదించేది తమ కుటుంబానికి సరిపోదని కూడా కేథరిన్‌కి తెలుసు. అందుకే టీచర్స్ ఇంటర్వ్యూకి వెళ్తోంది. తను కూడా కొంత డబ్బు ఇంటికి పంపవచ్చు. పైగా తన వల్ల తండ్రికి కొంత ఖర్చు తగ్గుతుంది.

"పోనీ కారు నాకిస్తే, నేనే వెళ్ళొస్తాను" సూచించింది.

"న్యూయార్క్ ట్రాఫిక్ మన ఊరు పోర్ట్ ఓరిస్కాని ట్రాఫిక్‌లా కాదు. పార్కింగ్ ప్లేస్‌లు తక్కువ. ఒన్ వేలు ఎక్కువ. డ్రైవర్లు దురుసుగా డ్రైవ్ చేస్తారు. రూట్లు అయోమయంగా ఉంటాయి. నేనే న్యూయార్క్‌లో డ్రైవ్ చేయడానికి భయపడ్తాను. కాబట్టి కారు ఇవ్వను" ఆయన ఖండితంగా చెప్పాడు.

"అమ్మ నా పక్కనే కూర్చుంటే? "

"ఇద్దరూ అయోమయాలే. ఐనా నీకు ఇక్కడ ఓ ఉద్యోగం వచ్చిందిగా? " నవ్వాడు.

"కాని నాకు న్యూయార్క్‌లో పని చేయాలని ఉంది. ఇక్కడి కన్నా అక్కడ జీతం ఎక్కువ"

అంతటితో ఆ సంభాషణ ముగిసింది.

ఆ రాత్రి కేథరిన్ తన తండ్రిని అడిగింది.

"ఆల్బనీకి గ్రే హౌండ్ బస్‌లో వెళ్తాను"

"అంతదూరం ఒంటరిగానా? " కేథరిన్ తల్లి వెంటనే అడిగింది.

"నాతో పాటు నా క్లాస్‌లోని ఇంకో అమ్మాయి కూడా వస్తోంది. మేము ఒకరికొకరం తోడుగా ఉంటాం" కేథరిన్ అబద్ధం చెప్పింది.

"ఆమె తండ్రికి కూడా దింపే అవకాశం లేదా? ఆమెకీ ఇంటర్వ్యూ ఉందా? " తండ్రి అడిగిన ప్రశ్నల్లోనే జవాబు దొరకడంతో కేథరిన్ ఔనన్నట్లుగా తల ఊపింది.

చివరికి పోర్ట్ ఓరిస్కానీ నించి రాత్రి పదకొండు పదికి బయలుదేరి, మర్నాడు ఉదయం ఏడు ఏభైకి న్యూయార్క్‌లోని ఆల్బనీకి చేరే బస్‌లో కేథరిన్‌కి టిక్కెట్



రిజర్వేషన్ చేయించాడాయన. తన కూతుర్ని ఇంటర్వ్యూకి తీసుకెళ్లలేకపోతున్నాననే అపరాధ భావన ఆయనలోంచి తొలగిపోయింది. టికెట్‌ని చూసి కేథరిన్ ఆనందంగా నవ్వింది. అంత దూరానికి అలా ఒంటరిగా రాత్రి ప్రయాణం చేస్తూ వెళ్ళడం సాహసమే అని ఆమెకి తెలుసు. కానీ, ఇంటర్వ్యూకి హాజరు కావాలంటే తప్పదు అది. తన తల్లిదండ్రులకి కేథరిన్ చెప్పిన ఏకైక అబద్ధం అది.

"అదేం పిచ్చిది కాదు. జాగ్రత్తగా వెళ్ళి రాగలదు" కేథరిన్ తండ్రి దిగులు పడుతున్న తన భార్యతో చెప్పాడు.

కేథరిన్ తండ్రి ఆ రాత్రి గ్రే హౌండ్ బస్ స్టేషన్‌కి తన కూతురితో కారులో

పదకొండు గంటలకి చేరాడు. కేథరిన్ స్నేహితురాలు ఏదని ఆయన అడగలేదు. తల్లి వచ్చి ఉంటే అడిగేదని కేథరిన్‌కి తెలుసు.

"జాగ్రత్తగా వెళ్ళిరా. గుడ్‌లక్" అంటూ తండ్రి వెళ్ళిపోయాడు.

బస్‌లోని ప్రయాణికుల్లో ఎక్కువ మంది మగవాళ్ళే. కొద్దిమంది మహిళలు ఉన్నా వారిలో ఎవరూ ఒంటరిగా వెళ్తున్న దాఖలాలు లేవు. బంగారు రంగు జుట్టుగల ఒకామె బస్సు బయలుదేరడానికి ఓ నిమిషం ముందు ఎక్కింది. ఆమె తన పక్కన ఉన్న ఖాళీ సీట్లో కూర్చుంటుందని కేథరిన్ ఎదురు చూసింది. కాని ఆమె ఓ మగవాడి పక్కన 'సీట్ ఖాళీగా ఉందా?' అని అడిగి కూర్చుంది. కేథరిన్‌కి రెండు వరసల ముందే వారిద్దరూ కూర్చున్నారు. బస్సు బయలుదేరాక అతని మాటలే

అనువాదం :
**యం. ఊహ**

ఎక్కువగా వినిపించాయి. చాలామంది ప్రయాణికులు నిద్రపోయారు. కాని పైనున్న రీడింగ్ లేంప్ వెలుగులో కేథరిన్ తనతో తెచ్చుకున్న 'ది హెయిరీ ఏప్' అనే సర్రియల్ నాటకం చదవసాగింది. కొద్దిసేపటికి ముందుకూర్చున్న బంగారు జుట్టు ఆమె కంఠం కోపంగా వినిపించింది.

"నో సర్"

"ఏం? ఏమైంది?" అతని నవ్వు.

కాని అప్పటికే ఆమె సీట్లోంచి లేచి తన కోటు, చిన్న బేగ్ అందుకొని కోపంగా బస్సు వెనక్కి నడుస్తూంటే, అతని మాటలు వినబడ్డాయి.

"ఆగు, వెళ్ళకు. నేను ఇబ్బంది పెట్టనులే"

ఆమె కేథరిన్‌ని చూసి ఆగింది.

"నీ పక్కన కూర్చోవచ్చా?"

కేథరిన్ తల ఊపింది. ఆమె కేథరిన్ పక్కనే కూర్చుని చెప్పింది.

"వాడు పెద్ద మనిషి అనుకున్నాను. ఉత్త వెధవ"

"ఐ యాం సారీ" కేథరిన్ చెప్పింది.

"ఆ వెధవ నన్ను తప్పుగా అర్థం చేసుకున్నాడు. బస్సుల్లో ఇంత కంటే మంచి వాళ్ళు తారసపడరు"

ఆమె తన కోపం తగ్గాక కేథరిన్‌తో చెప్పింది.

"నా పేరు కార్లా. మొదటి అక్షరం కె"

"నా పేరు కేథరిన్. నా మొదటి అక్షరం కూడా 'కే'నే"

"నేను ఆల్బనీకి వెళ్తున్నాను. నువ్వు?"

"నేను కూడా ఆల్బనీకే" కేథరిన్ చెప్పింది.

కేథరిన్ తన పుస్తకం మూసేసి లైటార్పి నిద్రకి ఉపక్రమించింది. వంటరిగా బస్‌లో ప్రయాణించే థ్రిల్ వల్ల ఆమెకి వెంటనే నిద్ర పట్టలేదు. హైవేలో ఎదురుగా వచ్చే వాహనాల హెడ్‌లైట్ల కాంతి ఆమె మీద పడి మాయమవుతోంది. మేఘాల్లోంచి వెన్నెల కాంతి మందంగా కనిపిస్తోంది.

తెల్లవారు ఝామున మూడు పదికి గ్రేహౌండ్ బస్ రాత్రంతా తెరచి ఉండే రెస్టారెంట్ గల ఓ పెట్రోల్ బంక్‌లో ఆగింది. కార్లా కేథరిన్‌ని మోచేత్తో పొడిచి నిద్ర లేపి చెప్పింది.

"మెలకువగా ఉన్నావా? బస్ పది నిమిషాలసేపు ఆగుతుంది"

బస్సులోంచి తక్కువమంది దిగారు. బయట గాలి చల్లగా మొహానికి తాకింది. ఇద్దరూ చలికి రెస్టారెంట్‌లోకి పరిగెత్తారు. వారిని చూసి లోపలికి వెళ్తూ ఒకతను ఆగి తలుపు తెరిచి అలాగే నిలబడ్డాడు.

"వాడి వంక చూడక. వాడో దుర్మార్గుడు" కార్లా హెచ్చరించింది.

ఆమె లోపలికి వెళ్ళాక కేథరిన్ అతనికి థాంక్స్ చెప్పింది. కార్లా చెప్పింది నిజమే అని ఆ వెంటనే తెలిసింది.

"పరుగెత్తుతూంటే నీ వక్షోజాలు భలే ఊగుతున్నాయి" అతను కేథరిన్‌తో చెప్పాడు.

ఆ మాటలు విననట్లుగానే కేథరిన్ లోపలికి వెళ్ళింది. కార్లా జెల్లీ డఫ్‌నట్‌ని కొని సగం కేథరన్‌కి ఇచ్చి చెప్పింది.

"నేనింత తినలేను"

ఆమె డి-కెఫినేటెడ్ కాఫీని తాగింది.

మర్నాడు ఉదయం బస్ ఆల్బని గ్రేహౌండ్ బస్‌స్టేషన్‌లో ఆగింది. కేథరిన్ ఉమన్స్ రూం (బాత్ రూం)ని ఉపయోగించుకుని, సరాసరి ఆల్బనీ యూనివర్సిటీకి వెళ్ళాలనుకుంది. కాని కార్లా చెప్పింది.

"మా ఇల్లు యూనివర్సిటీకి దగ్గరే నేను తప్ప మా ఇంట్లో ఎవరూ లేరు. అక్కడికి వచ్చి ఫ్రెష్ అయి వెళ్ళచ్చు"

ఇద్దరూ టేక్సీలో బయలుదేరారు. కేథరిన్ మేప్‌ని చూస్తూ తను వెళ్ళేదారి ఆల్బనీ యూనివర్సిటీకి సమీపంలో ఉందో లేదో తనిఖీ చేసింది. అది గమనించి కార్లా చెప్పింది.

"అంత పెద్ద బస్టాండ్‌ని చూసి బిత్తర పోయావు. నీకంతా కొత్త అని అర్థమై మా ఇంటికి పిలిచాను. కానీ ఇలా న్యూయార్క్‌లో కొత్తవాళ్ళు ఎవరు పిలిచినా వెళ్ళకూడదు. ఆడవాళ్ళయినా సరే. ఎక్కువ మంది దుర్మార్గులే ఉంటారు"

★ ★ ★

అది సింగిల్ బెడ్‌రూం అపార్ట్‌మెంట్. తమ ఇంటికి ఆరురెట్లు చిన్నదైన దాని అద్దె ఎంతో విని కేథరిన్ ఆశ్చర్యపోయింది.

"న్యూయార్క్‌లో జీతాలు ఎక్కువ అని ఇక్కడ ఉద్యోగం చేయడానికి ఉత్సాహపడ్డాను. కానీ ఒక్క ఇంటి అద్దె ఇంత ఎక్కువా? "

కార్లా నవ్వి జవాబు చెప్పింది.

"ఇక్కడ వచ్చే జీతాలు బొటాబొటిగా సరిపోతాయి. అందుకే కనీసం ఇద్దరు, ముగ్గురు కలిసి ఇలాంటి చిన్న అపార్ట్‌మెంట్లని తీసుకుంటారు"

"మగ, ఆడ అనే విచక్షణ లేకుండా అని విన్నాను? " కేథరిన్ అడిగింది.

"అవును. మనకి ఆడవాళ్ళే దొరకాలని వేచి ఉంటే నెలనెలా అంత అద్దె కట్టడం కష్టం. అదృష్టం బావుంటే, మంచి మగాళ్ళే దొరుకుతారు. వాళ్ళేమైనా చేస్తే చట్టం ఏం చేస్తుందో ముందు రోజే బెదిరింపుగా చెప్పాలి. ఆల్కహాల్, సిగరెట్లు ఇంట్లో నిషిద్ధం అని ముందే చెప్పాలి. తాగి వస్తే తలుపు తీయకూడదు. మన విలువైన కాగితాలు, డబ్బు ఎప్పుడూ భద్రంగా ఉంచుకోవాలి. మన వస్తువులు వాడినా భరించాలి"

అదంతా విని కేథరిన్ ఆశ్చర్యపోయింది.

క్లోజెట్‌లోని టవల్‌ని కార్లా తీసిస్తూంటే మగవాళ్ళ దుస్తులు చూసి, ఆమె అపార్ట్‌మెంట్ మేట్ మగవాడని గ్రహించి అడిగింది.

"అతనెలాంటివాడు? "

క్రితం రాత్రి బస్‌లో తన పక్కసీట్లో కూర్చున్న వ్యక్తిని తిట్టిన ఓ బూతు తిట్టుని అతను ఎలాంటివాడో చెప్పడానికి కార్లా ఉపయోగించింది. కేథరిన్ త్వరగా స్నానం ముగించింది. ఇంటర్వ్యూకి అవసరమైన పుస్తకాన్ని చదువుకుంటూంటే కార్లా కూడా తయారైంది. ఇద్దరూ కలిసి బయట బ్రేక్‌ఫాస్ట్ చేయాలి అనుకున్నారు. కార్లా రూంమేట్ చేతిలో ఓ కార్డ్‌బోర్డ్ బాక్స్‌తో లోపలికి వచ్చాడు. చెవులమీద పడే జులపాల జుట్టుగల అతను బయటకి వెళ్తున్న కార్లాని విష్ చేసి కేథరిన్ వీపు కింద గిల్లాడు.

"ఓ రోజు తాగి వచ్చి వీడు నానా రభస

చేసాడు. నైన్ లెవెన్‌కి ఫోన్‌చేసి పోలీ సుల్ని పిలిచాను. ఈ నెల ఏడో తారీకు కల్లా అపార్ట్‌మెంట్ ఖాళీ చేస్తానని వారికి హామీ ఇచ్చాడు" కార్లా చెప్పింది.

"ఐదు నిమిషాల నడకతో చేరుకోగల చిన్న రెస్టారెంట్‌కి చలిగాలిలో ఇద్దరూ నడిచి వెళ్ళారు. రెండిళ్ళ మధ్యగల సన్న సందుల్లో పేవ్‌మెంట్ మీద కార్డ్ బోర్డు పెట్టెలని కోసి, పరుచుకుని దుప్పట్లు కప్పు కుని పడుకున్న వాళ్ళని చూసి కేథరిన్ ఆశ్చర్యపోయింది.

"వాళ్ళెవరు? " అడిగింది.

"కొందరు పేదవారు. మరి కొందరు అద్దె చెల్లించలేని కొంత ధనవంతులు. మరి కొందరు ఎయిడ్స్ రోగగ్రస్థులు. న్యూయార్క్‌లో ఉచితంగా దొరికేది అదే. అలాంటి వారికి ఇళ్ళు అద్దెకి దొరకవు"

"పాపం! స్నేహితులు లేనివారన్నమాట"

"న్యూయార్క్‌లోని స్నేహితులు చిన్న ఊళ్ళల్లోని స్నేహితుల్లాంటివారు కాదు. తమకి లాభం ఉంటే స్నేహం అంటారు. లేదా దూరంగా ఉంచుతారు" కార్లా చెప్పింది.

అంత చెత్త బ్రేక్‌ఫాస్ట్‌ని కేథరిన్ తన జీవితంలో ఎన్నడూ తినలేదు. జిడ్డుగా ఉన్న ఆమ్లెట్, చల్లారిపోయిన ఏపిల్‌పై దాని ధర తమ ఊళ్ళోని భోజనం ధరకి మూడురెట్లు ఉండటం చూసి అబ్బురప డింది. కార్లా కేథరిన్‌కి బస్‌స్టాండ్‌ని చూపించి ఆల్బనీ యూనివర్సిటీకి ఏ నంబర్ బస్ ఎక్కాలో చెప్పి ఆఫీస్‌కి టైమైయిందని సబ్ వే వైపు బయలుదే రింది. పది అడుగులు వేసి, ఏదో ఆలో చన వచ్చినట్లుగా వెనక్కి తిరిగి వచ్చి కేథ రిన్‌తో చెప్పింది.

"పొరపాటున కూడా రాత్రి తొమ్మిది తర్వాత ఇక్కడ సబ్‌వేని ఎక్కకు. ఒక్కో సారి ప్రాణాలే పోవచ్చు. వంటరిగా ఉన్నా ఫర్వాలేదు కాని ఇంకో ఊరునించి వచ్చా వని తెలిస్తే మాత్రం ప్రమాదం"

బస్‌లో కేథరిన్ తనపక్కన కూర్చున్న అతన్ని అడిగింది.

"పోలీస్ కార్ల అలారం సౌండ్ ఎక్కువ సార్లు ఎందుకు వినిపిస్తోంది? "

"ఇది న్యూయార్క్ కాబట్టి. ఇక్కడ రోడ్డు ప్రమాదాలు, హత్యలు చాలా ఎక్కువ. నువ్వు ఈ ఊరికి కొత్త అన్న సంగతి ఎవ రికీ తెలియనీయవద్దని నా సలహా. నీ పక్కన ఏం జరుగుతున్నా, ఓ మనిషి ఇంకో మనిషిని చంపినా, ఏం జరగనట్లే ప్రవర్తించాలి. అది న్యూయార్క్ సంస్కృతి"

కేథరిన్ ఇంక అతనితో ఏం మాట్లాడ లేదు. ఎత్తయిన స్కై స్క్రేపర్లు, రోడ్లమీద తిరిగే ఖరీదైన కార్లు, విశాలమైన రోడ్లు ఆమెని పెద్దగా ఆకర్షించలేదు.

యూనివర్సిటీ కేంపస్‌లో బస్ దిగి కేథ రిన్ పదకొండు గంటలకి డాక్టర్ వెర్నర్ ఛాంబర్‌కి చేరుకుంది. అతని సెక్రటరీకి తనకి వచ్చిన ఉత్తరాన్ని చూపించింది.

"నీ ఇంటర్వ్యూని పదకొండు నించి ఒకటి ఇరవైకి మార్చారు" సెక్రటరీ చెప్పింది.

ఎందుకని కేథరిన్ ప్రశ్నించలేదు. అక్కడే కూర్చుంది. ఆ అమ్మాయి కేథరిన్ అక్కడ లేనట్లుగానే తన పనిలో నిమగ్న మైంది.

పన్నెండుకి ఆ అమ్మాయి లేచి వెళ్ళి, పన్నెండున్నరకి మళ్ళీ వచ్చాక కేథరిన్ అడిగింది.

"నేను లంచ్ చేయడానికి దగ్గరలో ఏదైనా రెస్టారెంట్ ఉందా? "

ఆమె ఓ కూపన్ ఇచ్చి చెప్పింది.

"దీన్ని చూపిస్తే, యూనివర్సిటీ కేంటీ న్‌లో అనుమతిస్తారు. కాని ఒకటి ఇరవై కల్లా ఇక్కడ ఉండాలి. లేదా నీ ఇంటర్వ్యూ రేపటికి వాయిదా పడచ్చు"

"నేను వెళ్ళి వచ్చేంత టైం ఉందా? "

కేథరిన్ అడిగింది.

"చెప్పలేను"

ఆమె కమిట్ అవదల్చుకోలేదు అనుకుంది కేథరిన్. ఇందాక తను లంచ్‌కి వెళ్ళేప్పుడు పొరుగూరు నించి వచ్చిన తన లంచ్ సంగతి ఆమె అడిగి ఉండవచ్చుగా అనుకుంది. ఆ కూపన్‌ని వెనక్కి ఇచ్చేసింది. డాక్టర్ వెర్నర్ దగ్గరికి సెక్రటరీ కేథరిన్‌ని ఒకటిన్నరకి పంపింది.

ఆయన ఏభై ఏళ్ళ హిస్పానిక్ (మెక్సీకన్). మొహం తీక్షణంగా ఉంది, ఆమె ఫైల్‌ని తిరగేసి అందులోకి చూస్తూనే అడిగాడు.

"నువ్వు అంకిత భావంతో విద్యాబోధన చేయగలనని రాసావు. నీకు ఎందుకలా అనిపించింది? "

తను ఆ మాటలు రాసినట్లుగా కేథరిన్‌కి గుర్తు లేదు. కాని అతనికి ఏదైనా చెప్పాలి. ఇంతదూరం ఇంత శ్రమపడి వచ్చిన తను నిరాకరింపబడకూడదు. ముందు తడబడుతూ మొదలుపెట్టి, తర్వాత ఆత్మవిశ్వాసంతో తను చెప్పేది పూర్తి చేసింది. తనకి చదువంటే ఇష్టం అని, తన తాతయ్య, అమ్మమ్మలు హంగరీ నించి వలసదారులుగా వచ్చినప్పుడు ఇంగ్లీస్ రాదని, చదువు విలువ తెలియని ఆ తరం వారు తన తల్లిదండ్రులని పెద్దగా చదివించలేదని, కానీ అమెరికాలో చదువు చాలా ముఖ్యం కాబట్టి అలాంటి విద్యని తను పిల్లలకి నేర్పించదలచానని చెప్పింది.

"డాక్టర్ వెర్నర్, నేను నా జీవితాన్ని బోధనకే అంకితం చేయదల్చుకున్నాను. కానీ నా అప్లికేషన్‌లో నేనలా రాసానని అనుకోవడం లేదు"

గుడ్. టీచర్లు అబద్ధాలు ఆడకూడదు. నువ్వు రెండువారాల తర్వాత తిరిగి ఆల్బనీకి రావాల్సి ఉంటుంది. నిన్ను ఎన్నిక చేసాను" అతను నవ్వుతూ చెప్పాడు.

కేథరిన్‌కి ఉద్యోగం వచ్చినందుకు పెద్దగా సంతోషం కలగలేదు. తన బస్ ఐదు ముప్పైఅయిదుకి బయలుదేరుతుందని, కాబట్టి అపాయింట్‌మెంట్ లెటర్‌ని సాధ్యమైనంత త్వరగా టైప్ చేసి ఇవ్వమని ఆయన్ని కోరింది.

★ ★ ★

సాయంత్రం ఐదు ముప్పైఐదుకి ఆల్బనీ నించి పోర్ట్ ఓరిస్కానీకి బయలుదేరిన బస్‌లో కేథరిన్ కూడా ఉంది. గతరాత్రి బస్‌లో సరిగ్గా నిద్రపోని కేథరిన్‌కి బస్ కుదుపులకి నిద్ర పట్టేసింది. రాత్రి రెండుంపావుకి బస్ పెట్రోల్‌బంక్‌లో ఆగింది. నిద్రలో ఉన్న కేథరిన్‌ని లేపడానికి పక్కన ఎవరూ లేరు.

మర్నాడు ఉదయం ఆరున్నరకి బస్సు దిగి, తనని రిసీవ్ చేసుకోవడానికి వచ్చిన తల్లిదండ్రులని చూసి, ఆనందంగా ఇద్దర్నీ ఆలింగనం చేసుకుంది.

"నీ ఫ్రెండ్ బార్బరా ఏది? " తల్లి అడిగింది.

"అది రావడం అబద్ధం. లేకపోతే నువ్వు పంపవని అలా చెప్పాను. నేనొక్కదాన్నే వెళ్ళి వచ్చాను చూశావా? "

"ఇంతకీ ఏమైంది? " తండ్రి అడిగాడు.

అపాయింట్‌మెంట్ లెటర్ కవర్ ఆయనకి చూపించింది.

"ఎప్పుడు చేరాలి? " తల్లి ఆనందంగా అడిగింది.

"నేను ఈ ఉద్యోగంలో చేరడం లేదు"

"అదేం? "

"న్యూయార్క్ కంటే మన ఊరే ఎన్నోరెట్లు మంచిది. ఇక్కడ మనిషి మనిషిగా బతుకుతాడు. ఒకరినొకరు రక్షిస్తారు. ఈ ప్రదేశాన్ని వదిలి నేను బయటికి వెళ్ళదలచుకోలేదు" కేథరిన్ చెప్పింది.

కార్లో ఇంటికి వెళ్తూ కేథరిన్ చెప్పే ఒకో అనుభవాన్ని ఆమె తల్లిదండ్రులు విస్ఫారిత నేత్రాలతో వినసాగారు. V

మళయాళ కథ - కరూర్ నీలకాంత పిళ్లై

# ఔను! అది నేనే!!

"సార్! ఈ పాప భోజనం తెచ్చుకున్న క్యారేజీ కనిపించటంలేదు" రెండో తరగతి క్లాసు టీచర్ చెప్పాడు.

ఏదో రాసుకుంటున్న ప్రధానోపాధ్యాయుడు తలెత్తి చూశాడు. ఆ పాప చెక్కిళ్లపైన కన్నీళ్లు కారుతున్నాయి. ఒక నిముషం పాటు ఆ పాపవైపే తదేకంగా చూశాడు.

"క్యారేజీ నువ్వెక్కడ ఉంచావు? " అని స్కూలు మేనేజర్ అడిగాడు.

"అదిగో ఆ గదిలో..." పాప తన చేయి చాపి తరగతి గదివైపు చూపింది.

క్లాసు టీచర్ చెప్పాడు. "రోజూ ఎక్కడ పెడుతుందో అక్కడే పెట్టింది. తనతో పాటు ఇంకో అబ్బాయి కూడా క్యారేజి అక్కడే ఉంచుతాడు. వాడిది అలాగే ఉంది"

"నువ్వు క్లాసు మొత్తం వెతికావా? "

"అంతా వెతికాను. ఎక్కడా కనిపించలేదు" పాప చెప్పింది.

"క్లాసులో అందరూ బయటికెళ్లాక చూశావా? "

"ఆc..."

"ఇది చాలా దారుణం. క్యారేజీలు దొంగిలించటానికి పిల్లలు స్కూలుకొస్తున్నారన్న మాట" అన్నాడు స్కూలు మేనేజరు.

ప్రధానోపాధ్యాయుని మనసు కరిగిపోయింది. పాపను లాలనగా దగ్గరకు తీసుకుని- "ఏడవకు. పిల్లలందర్నీ పిలిపిస్తా. ఎవరు తీసుకున్నారో తెలుసుకుంటా. ఇంకెప్పుడూ ఇలాంటి పనులు చేయకుండా దండిస్తా. నీకు ఆకలయితే పుస్తకాలు తీసుకుని ఇంటికెళ్లిపో.. ఒక్కదానివి వెళ్లగలవా? " అడిగాడు.

తను ఇంటికి వెళ్లనని పాప చెప్పింది.

"సరే.. వెళ్లి నీ క్లాసులో కూర్చో" చెప్పాడాయన. పాప క్లాసుకు వెళ్లింది.

ఆ విషయంపై క్లాసు టీచర్ మరికాసేపు చర్చించాడు. ఈ విషయంలో కఠినంగా వ్యవహరించవలసిందిగా ప్రధానోపాధ్యాయుడికి చెప్పాడు. అందుకు ఆయన అంగీకరించాడు. మధ్యాహ్న విరామం పూర్తయిందన్నట్టుగా బెల్ మోగింది. భోజనాలు పూర్తిచేసిన విద్యార్థులు తమ తమ తరగతి గదుల్లోకి పరుగుతీయటం ప్రారంభించారు. ఆకలిని, బయట మండుతున్న ఎండను లెక్కచెయ్యకుండా ఆటస్థలంలో ఉన్నవాళ్లూ వచ్చేశారు. పిల్లలు అలా బయటికెళ్లగానే బల్లలపైన తలలు వాల్చి అప్పటివరకూ చిన్న కునుకు తీస్తున్న ఉపాధ్యాయులు కళ్లు నులుముకుంటూ లేచారు. పేదరికం మాటు న ఇంటి నుంచి భోజనం తెచ్చుకోని దురదృష్టవంతులు కొందరు మాత్రం ఆ పూట కాసిని మంచినీటితో కడుపు నింపుకున్నారు. క్యారేజీ పోయిన పాప కూడా వారికి తోడయింది. అప్పటికే ఆ నోటా ఈ నోటా విషయం విద్యార్థులందరికీ చేరింది. ప్రతి ఒక్కరూ అవతల వాళ్లని గుచ్చి చూడటం ప్రారంభించారు.

"సార్! బాలక్రిష్ణన్ చూడండి... నేనే ఆ క్యారేజీ దొంగిలించానంటున్నాడు.." ఒక పాప ఫిర్యాదు చేసింది.

ఆ మాట అన్న బాలక్రిష్ణన్ వైపు తిరిగి.. "నువ్వే తినేసుంటావు. దొంగ వెధవా..." అంటూ పాప కఠినంగా బదులిచ్చింది.

గోపాల్, జోసెఫ్‌తో అన్నాడు "బహుశా

పప్పుగాడు తినేసుండొచ్చు"

మత్తాయి చెప్పింది, "నేనిహ క్యారేజీ తీసుకురాను. ఒకవేళ తెచ్చినా ఈ క్లాసులో పెట్టను"

ఇలా చాలాసేపు విద్యార్థుల మధ్య ఈ తరహా చర్చ సాగింది. క్లాసు టీచరు విద్యార్థులందరి మొహాల్లోకి తీక్షణంగా చూశాడు. అసలయిన దొంగను తేలిగ్గా పట్టెయ్యచ్చని ఆయన ఉద్దేశం.

స్కూలులో ఇలాంటి వ్యవహారాలని సీరియస్‌గా తీసుకునే ప్రధానోపాధ్యాయుడు చేతికర్రతో విచారణకు బయలుదేరాడు. అన్నివిధాలా ప్రయత్నించి చూశాడు. మంచి మాటల ద్వారా, భయపెట్టటం ద్వారా, చివరికి హెచ్చరించటం ద్వారా... ఫలితం లేకపోయింది.

"దొంగతనం మహాపాపం. మనుషుల

**అనువాదం :**

**పార్థసారథి చిరువోలు**

కళ్లుకప్పచ్చుగానీ, దైవాన్ని మోసం చేయటం కష్టం. ఏదో ఒక కారణంతో ఈ పనిచేసినా ఆ విషయం ఒప్పుకోండి. నేను మిమ్మల్ని ఏమీ అనను. భగవంతుడు మిమ్మల్ని క్షమిస్తాడు" దైవం.. పాపభీతి.. అనే అంశాలను వివరించి నిజాల్ని రాబట్టే ప్రయత్నం చేశాడు ప్రధానోపాధ్యాయుడు.

"మొదటిసారి తప్పు చేశాం. ఎవరికీ దొరకలేదని రెండోసారి చేస్తారు. అదే అలవాటుగా మారుతుంది. సినిమాల్లో చూడటం లేదూ.. పోలీసులు దొంగల్ని పెద్ద బేడీలు వేసి తీసికెళ్లటం.. ఆ తర్వాత చీకటి కొట్లో వేసి మిమ్మల్ని చితక్కొడతారు" అన్న ఆయన మాటల్ని పిల్లలు శ్రద్ధగా విన్నారు. అవును అంటూ తలాడించారు.

"మరి చెప్పండి... ఎవరు ఈ పని చేశారో..." అంటూ మళ్లీ అడిగాడు.

అవతలివైపు నుంచి సమాధానం లేదు. బృందంగా కాకుండా విడివిడిగా అడిగితే ప్రయోజనం ఉంటుందేమోనని.. ఒక్కొక్కరిని పిలిచి అడిగాడు. 'లేదు..' 'తెలీదు..' 'నేనింటికి వెళ్లాను' 'నేను చూడలేదు' 'ఇలాంటి పనులు చేయాలంటే నాకు భయం..' ఇలా సమాధానాలు వచ్చాయి.

పాఠశాలలో ఉన్న నూటా ఎనభై మంది విద్యార్థులూ ఇలాంటి సమాధానాలే ఇవ్వటం ఆయనకి మింగుడు పడలేదు. తనను పాఠశాలలో అందరూ గౌరవిస్తారు. ఊరివాళ్లు మంచికి, చెడుకి తనపైనే ఆధారపడతారు. విలువైన సలహాలిచ్చేవాడిగా అభిమానిస్తారు. ఇక స్కూళ్ల ఇన్‌స్పెక్టరయితే సరేసరి... చదువుల్లో ఏ మార్పు చేయాలన్నా తననే సంప్రదిస్తారు.

అలాంటి తనకి.. మొట్టమొదటిసారి ఎదురుదెబ్బ తగిలింది. తనమీద తనకి అపనమ్మకం పెరిగిపోయింది. ఆ రోజు ఏ పనీ చేయబుద్ధి కాలేదు. క్లాసులో లెక్క తప్పు చెప్పాడు. సాంఘికశాస్త్రం పాఠంలో విద్యార్థి సరైన జవాబిచ్చినా అది తప్పని అడ్డంగా వాదించాడు. పక్కతరగతి ఉపాధ్యాయుడు వచ్చి క్లాసు వేళయిపోయిందని చెప్పేవరకూ పాఠం చెబుతూనే ఉన్నాడు. బెల్ మోగిన విషయం కూడా గుర్తించలేదు. పాఠశాలలో అందరూ వెళ్లిపోయారు. ఆయన మాత్రం చాలాసేపటి వరకూ తన గదిలో కూర్చుని రాసుకుంటూ గడిపాడు. బాగా పొద్దుపోయాక ఇంటికి చేరాడు. ఆ రాత్రి పడుకోబోయే ముందు.. ఇంగ్లీషు వార్తలు వింటున్న సమయంలో ఆ ఉత్తరం ఆయన చేతికి అందింది. అది ఇలా సాగింది.

"అయ్యా! ఈరోజు మన పాఠశాలలో ఒక చోరీ జరిగింది. తరగతి గదిలో విద్యార్థి తెచ్చుకున్న భోజనం క్యారేజీ మాయమైంది. ఇంతకంటే సిగ్గుపడే విషయం మరొకటి ఉండదు. ఈ పాఠశాలకి నేనొచ్చి మూడు దశాబ్దాలయ్యింది. ఎప్పుడూ ఇలాంటి సంఘ



టన ఎరగను. దొంగతనం చేయాలంటే.. క్యారేజీ కంటే ఖరీదయినవి, విలువైనవి ఎన్నో ఉన్నాయి. బాగా ఆకలిగా ఉన్న వ్యక్తి దీనిని దొంగిలించి ఉంటాడు. ఇంతకంటే ఎక్కువ భోజనం ఉన్న క్యారేజీలు చాలా ఉన్నా, ఇదొక్కటే మాయమైంది. అంత చిన్న క్యారేజీని మరో చిన్నపిల్లాడు మాత్ర మే తీసుకోవాలి. ఉదయం ఏదో ఒకటి తినొచ్చిన పిల్లలు మాత్రం ఈ పని చేసుం డరు. ఏమీ తినకుండా స్కూలుకొచ్చే పిల్ల లకి అమ్మలే ఏదో ఒకటి చేసి పంపిస్తారు. వాళ్లకి దొంగతనం చేసే అవసరం ఉండ దు. ఉదయం, మధ్యాహ్నం ఏదీ తినే అవ కాశం లేని పిల్లల్ని తల్లిదండ్రులు మాత్రం బడికెందుకు పంపుతారు? అయినా పిల్లలు దొంగతనం చేస్తే.. ఏదో పెన్సిల్, పలక, పుస్తకం.. ఇవేమీ కాకపోతే.. ఒక మామిడి పండు, జామపండు ఇలాంటివి చేస్తారు కానీ.. భోజనం.. అదీ చిన్న పిల్లలది..

ఎవరిదో తెలియకుండా అపహరిస్తారను కోవటం అమాయకత్వమే అవుతుంది. ఇలాంటి పరిస్థితుల్లో పిల్లల్ని పట్టుకుని 'నువ్వు దొంగతనం చేశావా?' అని నిలదీ యటం అత్యంత అవమానకరం.. మన ఉపాధ్యాయుల్లో కొందరు మధ్యాహ్నం ఏమీ తినలేదు. అలాంటి వాళ్లే ఈ పని చేసుం

డొచ్చు కదా! పిల్లలు మాత్రం కాదు. బయట నుంచి కొత్త వ్యక్తులు వచ్చే అవకాశం లేదు. కచ్చితంగా ఉపాధ్యాయులే ఇందుకు పాల్పడ్డారు. ఔను. ఇది నిజం.. మీరు ఊహిస్తున్నది నిజమే. అది నేనే.. స్కూలు నడిపే బాధ్యత తీసుకున్న నేనే ఈ పని చేసింది. ఇక్కడ చదువుతున్న నూట ఎనభై మంది విద్యార్థులు రేపు మంచి పౌరులుగా తయారుకావటానికి ఏం చేయాలో చెప్పే నేనే ఈ పని చేశాను. ఐదుగురు ఉపాధ్యాయులకు మార్గదర్శిని.. ఎవరు తప్పు చేసినా కఠినంగా శిక్షించేవాడిని.. ప్రతి ఒక్కరికీ ఆదర్శంగా నిలవవలసిన స్థాయిలో ఉన్నవాడిని.. నేనే ఈ పని చేశాను. భావితరానికి విద్యార్థులను తీర్చిదిద్దే పనిలో ఉన్న నేను.. నేనే.. విద్యార్థి క్యారేజీని దొంగిలించింది. కేవలం కుక్కలు మాత్రమే ఇలాంటి పనికి పాల్పడతాయి.

ఈ స్కూలుకి చెడ్డపేరు తెచ్చిన నన్ను ఏం చేసినా తప్పులేదనుకుంటున్నారు కదూ! ఇది చదువుతుంటే మీ మొహం కంద గడ్డలా మారుతోంది కదూ! నన్ను ఉన్న ఫళాన ఉద్యోగంలోంచి పీకెయ్యాలనుకుంటున్నారు. అందరికీ శకునం చెప్పే బల్లి సామెత కూడా మీకు గుర్తుకొస్తోందనుకుంటా. ఇవన్నీ నాకు అంత ప్రాధాన్యం ఉన్న అంశాలుగా కనిపించటం లేదు.

పాలుకారే ఆరేళ్ల పసిపాప చెక్కిళ్ళ నుంచి ధారాపాతంగా కారుతున్న కన్నీళ్లు నన్ను కదిలించాయి. ఆ చిన్నారి మొహం నన్ను వెంటాడుతోంది. ఒక్కసారి ఆలోచించండి. కేవలం కుక్కలు మాత్రమే చేసే పనికి నేనెందుకు పాల్పడ్డాను? ఈ పని నేను ఎప్పుడో చేయవలసింది. ఇంతకాలం దూరంగా ఉన్నానంటే.. దానికి పెద్ద కారణం లేదు. చేయలేదంతే..! నా సహోద్యోగులు ఇలాంటి పని చేయలేదంటే... కారణం వారికి అవసరం రాక కాదు. భయం వల్ల.. చెడ్డపేరు తెచ్చుకోటానికి మనస్కరించకని అర్థం చేసుకోండి. నేనూ ఇంతకంటే పెద్ద తప్పు చేయలేకపోయాను. అందుకు కారణం.. నా పుట్టుక.. నా పెంపకం.. ఈ విషయం మాత్రం స్పష్టంగా చెప్పగలను.

ముప్పై ఏళ్లుగా పనిచేస్తున్నాను. నా సేవలకు మీరిస్తున్న వేతనం ఎంతో ఎప్పుడయినా గుర్తించారా? మీరిచ్చే డబ్బుతో సంతృప్తిగా జీవించే వీలుందా? అసలు ఆలోచించారా ఎప్పుడయినా? ఆ అవసరం మీకు లేదా? రూ. పన్నెండు.. ఎనిమిది మంది మనుష్యులు... నెల్రోజులు... విపరీతంగా ఖర్చులు పెరిగిన ఈరోజుల్లో బతికేది ఎలా? నేను ఈ పాఠశాలకు మోడల్‌గా ఉండాలి. పాలన బాధ్యతలు చూడాలి. రోజంతా ఒకదానికొకటి సంబంధం లేని పనులను నిభాయించాలి. గౌరవప్రదమైన జీవనాన్ని కొనసాగించాలి. ఎ.. లా..?

నాకు పెద్దవయసు తల్లిదండ్రులున్నారు. వారు ఏ పనీ చేయలేరు. భార్యాబిడ్డలున్నారు. వీరందరి పోషణ బాధ్యత నాదే. జీవితంలో నాకు చాలా కోరికలున్నాయి. నేనే పాప క్యారేజి తీసుకుని భోజనం చేసేశాను. నేను దొంగతనం చేశానా? ఔను... మరి నన్ను ఏం చేయమంటారు? నిన్న ఉదయం గంజి తాగింది మొదలు ఈ రోజు ఉదయం వరకూ నా కడుపులో వేసుకోటానికి ఏమీలేదు మరి.. ఇరవై ఎనిమిది గంటలపాటు ఏమీ తినని నేను... పని భారంతో ఎక్కడ సొమ్మసిల్లిపోతానో అన్న భయంతో ఆ పాప భోజనం... నాలుగు పిడికిళ్లు నోట్లోకి నెట్టేశాను. ఇది ఎవరిదో నాకు తెలీదు... తినేసానంతే... ఇది తప్పు కావచ్చు. పాపం కావచ్చు. వేరేలోకంలోకి వెళ్లాక భగవంతుడు నన్ను శిక్షించవచ్చు. అన్నింటికి నేను సమాధానం చెప్పుకోవాలి కూడా..

మీరే చెప్పండి? ఇంతకంటే.. నన్నేం చేయమంటారో? ”

ఇట్లు
స్కూల్ మేనేజర్

# పాఠకమహాశయులకు మనవి!





**మూ**డున్నర దశాబ్దాలుగా తెలుగు,
భారతీయ భాషలు, ప్రపంచ భాషల్లోని
అత్యుత్తమ కథలతో విశ్వకథావేదికగా
విశేషంగా అలరిస్తున్న **విపుల**
విశిష్ట ప్రయోగంగా
పాఠకదేవుళ్ల జేజేలందుకుంటోంది.

గత ఆరేళ్లుగా కాగితం ఖర్చు,
ముద్రణ, రవాణా, పంపిణీ ఖర్చులు,
అదనపు సాంకేతిక వ్యయాలు
ఇబ్బడి ముబ్బడిగా పెరిగినా
ఇప్పటివరకు **విపుల** ధర పెంచలేదు.

ఇప్పుడీ భారం మరింతగా పెరిగిన
నేపథ్యంలో అనివార్యంగా **విపుల** ధర
సవరించక తప్పడం లేదు.

ఆ మేరకు ఈ నెల నుంచి
**విపుల** విడిప్రతి **12/-** రూపాయలు
అవుతోందని గమనించ ప్రార్థన.

సహృదయ పాఠకులు,
సాహిత్యాభిమానులు పరిస్థితులను
అర్థంచేసుకొని, ఎప్పటిలాగే
ఆదరిస్తారని ఆశిస్తున్నాం.

విడిప్రతి రూ. **12/-** అయినా
ఏడాది చందా రూ. **140/-**
మాత్రమే!



– మేనేజర్
వసుంధర పబ్లికేషన్స్



కవితాయనం

# ఇక్కడే..!



మనం ఇక్కడే మొదలయ్యాం
ఇక్కడే మాట్లాడ్డం ఆరంభించాం
ఇక్కడే నడవడం ప్రారంభించాం
గుడ్డి నమ్మకాల నీడల్లో నించొని
ఆలోచన్లని ఇక్కడే తాకట్టు పెట్టాం!

చెవులు వినడం మానేసింది ఇక్కడే
కన్పించని దృశ్యాలని కళ్లు
దర్శించుకోవడం మొదలెట్టిందీ ఇక్కడే
ఇక్కడే వాగ్దానాల జలపాతాల కింద
దోసిళ్లు చాచి నిలబడ్డాం!

మరచిపోయేంత
చిన్నవిషయం కాదు కాబట్టి
తలలకి వెలకట్టే వ్యాపారానికి
ఇక్కడ నుంచే శ్రీకారం చుట్టాం!

అహం కన్నా ఆత్మవంచనకి కణంకణంగా
తలొంచి అంకితమైందీ ఇక్కణ్ణుంచే!
చినుకు చినుకుగా మొదలైన
అనుమానాల వర్షంలో
ఒళ్లంతా తడుపుకుందీ ఇక్కణ్ణుంచే!

వర్గీకరణల మధ్య వ్యత్యాసాల మెట్ల మధ్య
సూర్యుడి ముందు కళ్లు మూసుకొని
నిలబడి
చీకటిని ప్రేమించడానికి
అలవాటు పడిందీ ఇక్కడే!

చుక్కలకి దైవత్వం ఆపాదించి
అనుగ్రహాల లెక్కలు కట్టిందీ ఇక్కడే!

కలిసే ఉంటున్నా ఎవరికివాళ్లం

ఒంటరివాళ్లమే
ఆ విత్తు నాటుకుందీ ఇక్కణ్ణుంచే
మనిషికి మనిషికీ మధ్య
చెరపలేని గీత పుట్టిందీ ఇక్కడే!

– ఈతకోట సుబ్బారావు

# యోగక్షేమం



తోకలేని పిట్టకి
రెక్కలూ తెగాయి
ఎగరలేదు పాపం!

యస్‌యంయస్‌ల చిట్టిపొట్టి
సందేశాల ముందు
ఇన్‌లాండ్ లెటర్
అవుటాఫ్ ఆర్డర్ అయింది

ఈ - మెయిల్‌ల ప్రవాహ వేగానికి
తొంభై ఆమడల దూరం
పారిపోయింది చిట్టిపిట్ట
నాడు చిరునామాలను
వెతుక్కొంటూ వచ్చి వాలే
ఉభయకుశలోపరులు
నేడు 'ఉత్తరం' అనగానే
'దక్షిణం' అనే ఎగతాళి ధ్వనుల ముందు
దిక్కులేనిది అయింది కార్డుముక్క

ఒకప్పటి సమాచార విప్లవ ప్రతీకలు
నేడు రహదారిలోని తొక్కుడు బండలు
కొనిపించేవారే లేక
మ్యూజియంలో ప్రతిరూపంలా
తన కొత్త చిరునామాని
పాస్‌వర్డ్ జనరేషన్‌కి పోస్టుచేసి
ఉత్తరాల తోటలో అదృశ్యమయింది

– బి. కళాగోపాల్

# నేనెవరిని? - 23

**రూ.100/- బహుమతి**

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
|---|---|---|---|---|---|---|
| | | | | | | |

**నేను ఏడు అక్షరాలతో హిమాలయాల్లో ప్రసిద్ధి చెందిన ఒక కొలనుని. నన్ను కనుగోడానికి ఆధారాలివిగో...** 1. ఒకటి, ఏడు అక్షరాలు కలిస్తే 'మారుతాం'కి వ్యతిరేకం. 2. రెండు, ఆరు అక్షరాలు కలిస్తే తొమ్మిది, నూతనం. 3. మూడు, ఏడు అక్షరాలు కలిస్తే దండ. 4. రెండు, నాలుగు అక్షరాలు కలిస్తే గొణుగుడు. 5. రెండు, ఏడు అక్షరాలు కలిస్తే రక్తవాహిని. మరి నేనెవరినో చెప్పండి.

| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|
| | | | | | |

**నేను ఆరు అక్షరాలతో ఆరు రుతువుల్లో ఒకదానిని. నన్ను కనుక్కోవడానికి ఆధారాలివిగో...** 1. మూడు, నాలుగు, ఆరు అక్షరాలు కలిస్తే చెట్టు. 2. ఒకటి, ఐదు, ఆరు అక్షరాలు కలిస్తే కారణం. 3. ఒకటి, రెండు అక్షరాలు కలిస్తే బంగారం. 4. మూడు, రెండు అక్షరాలు కలిస్తే చీకటి, త్రిగుణాల్లో ఒకటి. మరి నేనెవరిని?

| 1 | 2 | 3 | 4 | 5 |
|---|---|---|---|---|
| | | | | |

**నేను ఐదు అక్షరాలతో శ్రీమహావిష్ణువుని. నన్ను కనుగోడానికి ఆధారాలివిగో..** 1. ఒకటి, ఐదు అక్షరాలు కలిస్తే రోజు, గ్రామం, పల్లె. 2. ఒకటి, రెండు అక్షరాలు కలిస్తే మాజీ ముఖ్యమంత్రుల్లో ఒకరి ఇంటిపేరు. 3. రెండు, ఒకటి అక్షరాలు కలిస్తే నేటి తెలుగు సినీ హీరో. 4. రెండు, ఐదు అక్షరాలు కలిస్తే 'వస్తాడు'కు వ్యతిరేకం. మరి నేనెవరిని?

**నేనెవరిని?-22 జవాబులు, విజేత - 88 పేజీలో..**

పంపినవారి పేరు: ----------------------------------------

వయసు (      ) చిరునామా: ----------------------------------

----------------------------------------------------

-----------------పిన్ : ------------ ఫోన్ : ----------------

**నిబంధనలు**

✷ 'నేనెవరిని?' ఇదే పేజీలో పూర్తిచేసి పంపాలి. ✷ ఇచ్చిన ఆధారాలకు అనుగుణమైన పదాన్నే గళ్లలో నింపాలి. ✷ తుడుపులు, కొట్టివేతలు ఉండరాదు. ✷ ఆల్ కరెక్ట్ రాసినవారే విజేతగా నిలుస్తారు. ✷ మా 'కీ'తో సరిపోలిన పూరణలనే పరిగణనలోకి తీసుకుంటాం. ✷ ఎక్కువ మంది సరైన జవాబులు రాస్తే డ్రా ద్వారా విజేతను ఎంపిక చేస్తాం. ✷ ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు. ✷ ఒక్కొక్కరు ఎన్ని కూపన్లైనా పంపవచ్చు ✷ విపుల వినోదిని, నేనెవరిని? , చతురంగం, చతురప్రవేశిక - ఒకే కవరులో పంపవచ్చు

పంపాల్సిన చిరునామా : **నేనెవరిని?**
విపుల, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్ - 082

**చివరి తేది: డిసెంబరు 18**

నేనెవరిని?– 22 కి
సరైన సమాధానాలు రాసిన వారిలో డ్రా
ద్వారా ఎంపికైన ఈ విజేతకు
**రూ.100/- త్వరలోనే అందుతాయి.**

**వె**
ఇంటి. నెం. 7-9-125,
శ్రీరాంనగర్ -508001

## నేనెవరిని? - 22 జవాబులు

| 1 గ్రీ | 2 కు | 3 వీ | 4 రు | 5 డు |
|---|---|---|---|---|

| 1 న | 2 ర | 3 కా | 4 సు | 5 ర | 6 వ | 7 ధ |
|---|---|---|---|---|---|---|

| 1 భా | 2 ను | 3 మ | 4 తి |
|---|---|---|---|

1. సి. రాజేశ్వరి, ఎ.ఎస్. రావ్ నగర్, 2. యు. విజయశేఖర రెడ్డి, కూకట్‌పల్లి, 3. పి. దేవసేనమ్మ, సిద్ధార్థనగర్, హైదరాబాద్,4. డా.సి. జనార్దన సింగ్, నల్లకుంట, 5. అత్తివిల్లి బాలసుబ్రహ్మణ్యం, శేరిలింగంపల్లి, 6. బి. విశ్వనాథరావు, సైదాబాద్, 7. గట్టుపల్లి సీతారామారావు, సనత్‌నగర్, 8. కె. కేశవరావు, సైదాబాద్, 9. యు. చిట్టిబాబు, కొత్త పాల్వంచ, ఖమ్మం జిల్లా, 10. చుండూరు శకుంతల, బాచుపల్లి, 11. సిహెచ్. శిరీష, విజయవాడ, 12. డాక్టర్ శివభూషణం, కర్నూలు, 13. పాలకుర్తి సుధీర్‌కుమార్, మాదాపూర్, 14. ఎమ్.వి.ఎస్.ఎస్. ప్రసాద్, నిజామాబాద్, 15. రావి లలిత, విజయవాడ, 16. వి.డి. భవాని తల్లాప్రగడ, న్యూ నల్లకుంట, 17. నియాజ్ అలి, హైదర్‌గూడ, 18. పి.ఆర్. నాయుడు, తిరుపతి, 19. వి.వి. సత్యనారాయణ శెట్టి, తిరుపతి, 20. డి. కృష్ణకుమారి, ఎ.ఎస్. రావ్ నగర్, 21. కె. లక్ష్మీకమల, విజయవాడ, 22. జి. జయచంద్ర గుప్త, కర్నూలు,23. కె. భానుమతీ దేవి, వనస్థలిపురం, 24. మొహమ్మద్ ఖాసిం, కల్లూరు గూడెం, ఖమ్మం జిల్లా, 25. జి. విజయలక్ష్మి, ఖైరతాబాద్, 26. మేలనాతూరు జైవంత్, విజయవాడ, 27. ఐరేని శ్రీనివాస్ గౌడ్, రామాయంపేట, మెదక్ జిల్లా, 28. వి.పి. కిరణ్, బెంగళూరు, 29. ఎ. అరుంధతి, పుణె, మహారాష్ట్ర, 30. కన్నేపల్లి నారాయణమూర్తి, శ్రీకాకుళం, 31. ధరణి పద్మాసన, డి.డి. కాలనీ, హైదరాబాద్, 32. బి.వి. నరసింహారావు, పేరాల, ప్రకాశం జిల్లా, 33. ఎమ్. మణికంఠ, బోరబండ, 34. కొల్లు రాజశ్రీ, గుంటూరు, 35. ఇందన మల్లిఖార్జున్ రావు, ఏలూరు, 36. కె. శ్రీనివాసులు, రాయచోటి, 37. యు.యు.యు, ఎమ్మిగనూరు, 38. ఎమ్. వేణుగోపాల్, రుద్రంపేట, అనంతపురం జిల్లా, 39. ఆర్. వంశీకృష్ణ, ఎమ్మిగనూరు, 40. చాగంటి శేషుకుమారి, విశాఖపట్నం, 41. అత్తిలి కస్తూరిభాయి, తిరుపతి, 42. యమ్. అలమేలు, మల్కాజిగిరి, 43. జి. కరుణ ప్రభాకర్, తిరుపతి, 44. అనంతుల సుబ్బారావు, గుంటూరు, 45. పసుమర్తి క్రిష్ణారావు, మౌలాలి, 46. కాకర్లమూడి కృష్ణప్రసాదు, తణుకు, 47. ఆంద్ర అచ్యుతరామయ్య, తణుకు, 48. జి. జయలక్ష్మి, కర్నూలు, 49. పి.వి. రమణారావు, మల్కాజిగిరి, 50. నందెపు హనుమంతరావు, అంబాజీపేట, తూ.గో. జిల్లా, 51. పి. సుజాత, గుంటూరు, 52. యిర్తి భక్తవత్సలరావు, చిలకలూరి పేట, 53. చింతపల్లి నాగేశ్వరరావు, విజయవాడ, 54. బి.వి. రవికుమార్, తెనాలి, 55. టి. ప్రదీప్‌శర్మ, గుంతకల్లు, 56. టి.ఆర్. బాలకృష్ణారావు, రాజమండ్రి, 57. గేదెల రామారావు, ఏలూరు, 58. పప్పు కామేశ్వరరావు, అమలాపురం, 59. ఆర్.జి. రామచంద్రన్, మల్కాజిగిరి, 60. బి. శాంతి, విజయవాడ, 61. సిహెచ్. కీర్తి కల్యాణ్, విశాఖపట్నం, 62. బిరుదు సులోచనారాణి, పేరాల, ప్రకాశం జిల్లా, 63. కె.వి. లక్ష్మణరావు, మానేపల్లి, తూ.గో. జిల్లా, 64. కొక్కెరగడ్డ అన్నపూర్ణ, మానేపల్లి, తూ.గో. జిల్లా, 65. తటవర్తి పవన్‌కుమార్, తాళ్లగడ్డ, హైదరాబాద్, 66. పి.ఎస్. సుశీలమ్మ, కొత్తచెరువు, అనంతపురం జిల్లా, 67. అశ్వత్థ నారాయణ, దుబ్బార్లపల్లి, అనంతపురం జిల్లా, 68. సిహెచ్.ఎస్. రామచంద్రమూర్తి, తాడేపల్లి, గుంటూరు జిల్లా, 69. యం. తిరుపాలమ్మ, గుంతకల్లు, 70. ఇరుకుళ్ల లక్ష్మీనరసింహారావు, మధిర, ఖమ్మం జిల్లా, 71. కె. సుధాకర్ రావు, బండారెంజిల్, నిజామాబాద్ జిల్లా, 72. వి.ఆర్. జయలక్ష్మి, కరీంనగర్, 73. బి. నేహారెడ్డి, కడప, 74. అవధానం రంగనాథం, బెంగళూరు, 75. శివలెంక చంద్రశేఖర్, మెహదీపట్నం, 76. తువ్వా మాధవ మోహన్ రెడ్డి, మిడుతూరు, కర్నూలు జిల్లా, 77. షేక్ నజీర్ బాషా, కోట, నెల్లూరు జిల్లా, 78. పత్రా శ్రీనివాసులు, పామిడి, అనంతపురం జిల్లా, 79. మద్దూరి లక్ష్మీరాజ్యం, హైదరాబాద్, 80. వి. విమల, దిల్‌సుఖ్‌నగర్, 81. ఆర్. లక్ష్మి, మోతీనగర్, 82. పి. లక్ష్మి, టోలీచౌకి, 83. జె. రాజ గోపాలరావు, ఎ.ఎస్. రావ్ నగర్, 84. పెద్దింటి మనోజ్ శశాంక్, వనస్థలిపురం, 85. గురజాల వరలక్ష్మి, ఉచ్చిలి, తూ.గో. జిల్లా, 86. పల్లా పవన్‌కిశోర్, ప్రొద్దుటూరు, 87. డి. శివమనోహర్, తిమ్మాపురం, కర్నూలు జిల్లా, 88. ధవ్వూరి శ్రీధరా

చార్యులు, సీతారాంబాగ్, 89. యన్. దుర్గాంబ, కర్నూలు, 90. కె. మోహన్, బెంగళూరు, 91. బి. రామయ్య, బషీర్‌బాగ్, 92. కణుగుల గ్రీష్మ, శ్రీకాకుళం, 93. ఎస్. శ్రీనివాసమూర్తి, నెల్లూరు, 94. వెలసిరి మధుసూదన్, నల్గొండ, 95. ఎస్.నాగశ్వేత, బెంగళూరు, 96. ఎస్. రుత్విక్ శ్రీవాత్సవ, బెంగళూరు,97. పక్కి శ్రీదేవి, మెట్టపల్లి, విజయనగరం జిల్లా, 98. కె.వి.జె. దాస్,మైలార్‌గడ్డ, సికింద్రాబాద్, 99. కోనే నాగవెంకట ఆంజనేయులు,అగనంపూడి, విశాఖ జిల్లా, 100. గుంటూరు లక్ష్మణరావు, టి. అర్జాపురం, విశాఖ జిల్లా, 101. టి. వేదవతి, మోతీనగర్, 102. మహమ్మద్ తహసీన్ అలి, వడ్డెపల్లి, వరంగల్ జిల్లా, 103. టి. కమల, ఖమ్మం, 104. కె. నాగేందర్, నర్సంపేట, వరంగల్ జిల్లా, 105. పి. సీతారత్నం, నర్సాపురం, ప.గో. జిల్లా, 106. వి. రంగరాజ, భద్రాచలం, 107. డి. పద్మజ, హన్మకొండ, 108. సి. ఆల్వాల్ రెడ్డి, సరూర్‌నగర్, 109. కొత్తపల్లి సుధాదేవి, చీరాల, 110. ఏకా సావిత్రి, బాపట్ల, 111. ఎమ్. రామచంద్రరావు, హిల్ కాలనీ, నల్గొండ జిల్లా, 112. కె. మాధవి, కాకినాడ, 113. గోగాడ వెంకట సింహాచలపతిరావు, హుబ్లీ, 114. దేవళ్రాజు లలితాదేవి, చైతన్యపురి, 115. వెలసిరి రమాదేవి, నల్గొండ, 116. దేవళ్రాజు వెంకట నరసింహారావు, చైతన్యపురి, 117. బందెల శ్రీనాథ్ బాబు, ఉయ్యూరు, కృష్ణా జిల్లా, 118. వెల్మల మణిచందన, కరీంనగర్,119. జి. వెంకటస్వామి, వనస్థలిపురం, 120. కె.వి. దుర్గ, గుంటూరు,121. ఉడాలి భాస్కరయ్య, అడయార్, చెన్నై, 122. బి. గురునాథరావు,శ్రీకాకుళం, 123. సరిపల్లి నాగభూషణరావు, విజయనగరం, 124. వానపల్లి వాసిని, కశింకోట, విశాఖ జిల్లా, 125. మంచాళ శ్రీలక్ష్మి,విశాఖపట్నం, 126. జి. రత్నసాగర్, గుంటూరు, 127. కన్నేపల్లి పద్మ,బోడుప్పల్, 128. జి. రాధిక, రామచంద్రాపురం, హైదరాబాద్, 129. కె.వి.జె. దాస్, మైలార్‌గడ్డ, సికింద్రాబాద్, 130. తిప్పావఝుల వెంకటనారాయణ, మల్కాజిగిరి, 131. నండూరి నాగేశ్వరరావు, బేగంపేట, 132. కోలా సత్యనారాయణ, విశాఖపట్నం, 133. కరణం సుధీంద్రరావు, కర్నూలు, 134. టి.కె. లక్ష్మి, ఆత్రేయపురం, 135. ఎ.ఎస్.ఎన్. మూర్తి, కాకినాడ, 136. ఎ.వి. రామకృష్ణ, కాట్రేనికోన, 137. సిహెచ్. సాలమన్, కొండాపురం, కడప జిల్లా, 138. వక్కలంక విజయలక్ష్మి, విజయనగరం, 139. జి.వి. రాఘవేంద్ర రావు, బెంగళూరు, 140. చాడా మునిశేఖర రెడ్డి, ప్రొద్దుటూరు, 141. కొత్తపల్లి సృజన, టెక్కలి, శ్రీకాకుళం జిల్లా, 142. అల్లడి సుబ్బారావు, పాలవర్రు, గుంటూరు జిల్లా, 143. సిరివెల్లి రవీంద్రకుమార్, కర్నూలు, 144. యన్. ఉడయవర్లు, సైనిక్‌పురి, 145. సూరి నాగరాజు, రామవరప్పాడు, కృష్ణాజిల్లా, 146. జి. యశోలత, కావలి, 147. టి. రమాదేవి, తార్నాక, 148. ఎన్. విజయలక్ష్మి, ఒంగోలు,149. కొత్తపల్లి అన్నా సౌజన్యకుమారి, చిత్తూరు, 150. సౌదామినినాగరాజన్, విశాఖపట్నం, 151. హారిక, కానూరు, కృష్ణాజిల్లా,152. రామకూరు లక్ష్మి, శ్రీకాకుళం, 153. రామకూరు నాగేశ్వరరావు,శ్రీకాకుళం, 154. వై.ఆర్.కె.వి. ప్రసాదరావు, శ్రీకాకుళం,155. సిహెచ్. కోటయ్య శాస్త్రి, కాకినాడ, 156. డా. ఎస్.ఎస్. మోహన్‌నాయుడు, బంటుమిల్లి, కృష్ణా జిల్లా, 157. పి. శివకుమార్, కొత్తపేట,హైదరాబాద్, 158. కె.వి. ప్రసాద్, రిషికేష్, 159. ఎమ్.వి.ఎస్. మూర్తి,కొత్తగూడెం, 160. గరికిపాటి చైతన్యకృష్ణ, కాకినాడ, 161. గరికిపాటిఇందిర, కాకినాడ, 162. వల్లభ సైమన్, మచిలీపట్నం, 163. శిష్టారాధాకృష్ణమూర్తి, విజయవాడ, 164. ఎస్. నాగరాణి, కుప్పం,165. పి.యస్.వి. సుబ్బారావు, రాజమండ్రి, 166. సి. గిరిజాభాయ్, కోట,అనంతపురం జిల్లా, 167. టి. రాజశేఖర్, రాజమండ్రి, 168. ఆర్.వి.కృష్ణారావు, సామర్లకోట, 169. బిళ్లపాటి లక్ష్మణమూర్తి, మియాపూర్,170. వి. పార్వతీదేవి, విశాఖపట్నం, 171. గండ్లూరి బలరామ శాస్త్రి,నాచారం, 172. వి.వి. సంఘమిత్ర, కర్నూలు

